# రచయితను గురించి .....

విల్లర్డ్ ఆర్. ఎస్పీ వయస్సు 39. ప్రముఖ రచయిత. రెడ్ ల్యాండ్స్, క్యాలిఫోర్నియా, గ్రినోబుక్, సార్ బాన్ విశ్వవిద్యాలయాల్లో చదువుకున్నాడు. అమెరికాలో న్యూస్ రిపోర్టర్ గా పనిచేసి, రిపోర్టర్ గా విదేశాలకు వెళ్ళి 1940 లో ప్యారిస్ పతనానంతరం తిరిగివచ్చాడు. "రీడర్స్ డైజెస్ట్" పత్రికాఫీసులో 1941 లో ప్రవేశించి ఆ పత్రిక తాలూకు అంతర్జాతీయ ప్రచురణాలకు సాయపడ్డాడు. ఇంగ్లీష్, ఫ్రెంచి, స్పానిష్‌లు మాట్లాడగలడు. ఇటాలియన్, పోర్చుగీస్ భాషలను చదువగలడుకూడా. "రీడర్స్ డైజెస్ట్" అభివృద్ధి శాఖకు డైరెక్టర్. "న్యూయార్క్ టైమ్స్", "అట్లాంటిక్" మాస పత్రికల్లోను, యితర పత్రికల్లోను ఆయన వ్రాసిన వ్యాసాలు ప్రజానీకంలో సంచలనం కలిగించి, ప్రెసిడెంట్ ట్రూమన్ అమెరికా విదేశాంగ విధానంగా తలపెట్టిన అమోఘమైన చతుర్థసూత్ర కార్యక్రమానికి ప్రాతిపదికలైనవి.

# రచయిత మాటలు

జీవితపు వొత్తిడి పనులమధ్య యీ గ్రంథ రచన జరిగింది. కనుక విపులంగా వుండక పోవచ్చును. ప్రతి అధ్యాయమూ, చెప్పబడిన ప్రతివిషయమూ ఒక్కొక్క పుస్తకంగా రూపొందించవచ్చు కూడా. ఎన్నో విషయాలు వదలివేయ బడినవేమో. సాధ్యమైనంతవరకు యదార్థాన్ని వెలికి తీసుకున్నాను. తప్పులూ వుండవచ్చును. కాని, అవి విషయనిరూపణకు అపకారం కలిగించకుండా చూశాను.

ఒకటిమాత్రం జరిగి వుండవచ్చును. ఈ పేజీలలో ఆర్థిక విషయాలు ఆధ్యాత్మిక శక్తులకంటె హెచ్చనీ, వాపు బలుపనీ, సమృద్ధి స్వాతంత్ర్య సూచనయనీ, సౌఖ్యమనీ వాదించబడి యుండ వచ్చును. నేననుకోకుండానే ఇతర సంస్కృతులు, వృత్తులు కొంచ పరచ బడినవేమో.

ప్రస్తుత స్థితిలో యీ గ్రంథం సూచించే నవప్రపంచము మాత్రం అమెరికా సలహా, సహాయములతోనే పుట్టుతుంది. అట్టి "పురుడు"లో అమెరికా మంత్రసాని మాత్రమే. కొంతవరకు జనకుడూ మంత్రసానీ కూడా. ఆదిలో ఆదుర్దా కలిగించేవీ, తుట్టతుదకు లాభింపబడేవీ బడుగు దేశాలే. అవే బయటపడగల అవకాశాలు, సూచనలు ఉన్నవి.

పుస్తకానికి పనికివచ్చే వ్యాసాలను ప్రచురించి, వాటికి రూపం కలిగించుకోడానికి అనుమతించిన "అట్లాంటిక్ మన్త్లీ", "న్యూయార్క్ టైమ్స్" పత్రికలవారికి; నూతన మహోత్తర ప్రణాళిక స్వరూపాన్ని చూచాయగా ప్రచురించిన లెవ్విలిన్ కూల్ కి; పుస్తక రచనకు సకాలంలో ప్రోద్బలమిచ్చిన వాల్టర్

# విషయ సూచిక

# 1 వ భాగం

## తొలి పలుకు

బడుగు దేశాల ఆర్థికాభ్యున్నతికి ప్రెసిడెంటు ట్రూమన్ తల పెట్టిన నూతన మహత్తర ప్రణాళిక—చతుర్థసూత్ర కార్యక్రమం—వాణిజ్య వేత్తలను, రాజకీయ సిద్ధాంతులను ఒకే రంగంలోనికి తెచ్చింది.

అమోఘ శక్తి సంపన్నమైన ఈ నూతన మహత్తర ప్రణాళిక నిజానికి అమెరికా వ్యాపారస్థుల తోడ్పాటుతో సాగించ బడగలదనే తలంపుతో సృష్టించబడింది. ప్రపంచ శాంతి సౌభాగ్యాలకు వారు చేయూత నివ్వవచ్చునని తలపోయ బడడంచేతనే ఇది తయారు చెయ్యబడింది. ఇదివరకే పరిశ్రమలుగల దేశాల పునరుద్ధరణకై ప్రభుత్వపు గ్రాంటులను వినియోగ పరచే మార్షల్ ప్రణాళికవంటిది కాదిది. మార్షల్ ప్రణాళిక సందర్భంగా మనం మొదటి సంవత్సరంలో 5,00,00,00,000 డాలర్లను ఖర్చుచేశాము. చతుర్థసూత్ర కార్యక్రమంక్రింద మన మొదటి సంవత్సరపు బడ్జెటు 5,00,00,000 డాలర్లు. అమెరికానుంచి గాని, ప్రపంచ బ్యాంకి నుంచిగాని ఏకకాలంలో బడుగు దేశాల అభివృద్ధికి ఋణాలు యివ్వబడడం తథ్యం. చివరకు అమెరికా ఎగుమతి, దిగుమతి బ్యాంకుకు అప్పులిచ్చే అధికారం హెచ్చించ బడగలదు. కాని, మొత్తంమీద సాంకేతిక సహాయం విషయమై అజమాయిషీ చెయ్యడమో, దారిచూపడమో, సౌకర్యాలు చెయ్యడమో మాత్రమే అమెరికా చెయ్యగల సహాయం. బడుగు దేశాలకు పారిశ్రామికాభివృద్ధి కలిగించి సుస్థిరత్వాన్ని కూర్చే ప్రధాన

బాధ్యత ఆ దేశాలమీదనే ఉండగలదు; అందుకు సహాయపడే వారు అమెరికా ప్రయివేటు వ్యాపారస్థులే.

మరెవ్వరు చెయ్యలేని ఘనకార్యాన్ని చెయ్యడానికి ప్రయివేటు వ్యాపారస్థులకు అవకాశం కలిగించబడుతున్నది. అది అవకాశమే గాని, సంపూర్ణావకాశం గాదు. చతుర్థసూత్ర కార్యక్రమంలో పాల్గొనడానికి వ్యాపారస్థులు నిరాకరించినప్పటికీ తదాశయం ప్రకారం జరుగక మానేది లేదు. అప్పుడు బడుగుదేశాలు వృద్ధిపొందే పద్ధతి ప్రయివేటు వ్యాపారానికి ప్రతికూలం కావచ్చు.

ఏమైనా అంతర్జాతీయ ప్రయోజనకరమైన కార్యనిర్వహణకు ప్రయివేటు పెట్టుబడి ధనాన్ని సమకూర్చినప్పటికీ, ప్రయివేటు లాభాలకు దానిని ఖర్చు చెయ్యడానికి వీలుకాకుండదు. ఒకడు ధనాన్ని పెట్టుబడి పెడతాడంటే కేవలం దేశభక్తితో పెట్టడు. కేవలం అమెరికా ప్రయోజనానికో, ప్రపంచ క్షేమానికో విదేశాలలో ఫ్యాక్టరీలు నెలకొల్పడు. అటువంటివన్నీ ధనం సంపాదించడానికి చేస్తాడు. ప్రపంచంలో ఇప్పటికంటె సుస్థిర పరిస్థితులున్న కాలంలోకూడ అమెరికన్ కేపిటలిస్టు తన ధనాన్ని అమెరికాలో మాత్రమే పెట్టుబడిగా వినియోగించుకోడానికి శ్రద్ధపడ్డాడు. ఇందుకు కారణం అమెరికా చట్టాలు, ప్రజల మనస్తత్వం అతడికి బాగా తెలిసి ఉండడం. విదేశాలలోకూడా ధనం పెట్టుబడి పెట్టాలని 1920 లో లాగ ప్రయత్నించి నప్పుడల్లా తరచు దెబ్బతిన్నాడు.

బడుగుదేశాలకు సాంకేతిక సహాయాన్ని చెయ్యడం మాత్రమే కాక, వాటి వ్యాపారాలను అభివృద్ధిచెయ్యాలి కూడా. నూతన మహత్తర ప్రణాళికను అందుకై విస్తృతం చెయ్యడానికి పూర్వం అంతర్జాతీయ పరిస్థితులు చక్కబడాలి. ప్రయివేటు ధనాన్ని పెట్టుబడి పెట్టడం ఉపయోగకరం కాగల దనిపించడమే గాక, లాభాలు చేకూరగలవనే ఆశకూడా కనిపించాలి. అంటే న్యాయమైనంతవరకు న్యాయమైన లాభాలు చేకూరగల అవకాశాలు కనుపించాలి. దానినిబట్టి ప్రయివేటు వ్యాపారస్థులకు విధిగా లాభాలు చూపగలమని ఆ దేశాల ప్రభుత్వాలు గ్యారంటీ ఇవ్వాలని అర్థంకాదు. వారి ధనానికి రక్షణ ఉండగలదనీ, వారికి అన్యాయం చెయ్యబడదనీ ఆ ప్రభుత్వాలనుంచి అతడు హామీ కోరుతాడు.

అమెరికన్ వ్యాపారస్థునికి వీటిలో విచిత్రమేమీ కనిపించదు. అనేక బడుగుదేశాలు తనను సమీపానికే రానివ్వ వేమిటా అని అతడాశ్చర్య పోతాడు. పరోపకారం వల్ల అతడికి లాభాలు చేకూరినప్పటికీ, పరోపకార పరాయణుడనిపించుకోనడం అతడికి సరదా. అగ్రరాజ్యాలు చిరకాలంగా అశ్రద్ధచూపిన ప్రాంతాలవారికి అతడు పూర్తిగా అనుమానితుడని గ్రహించుకోలేడు. ఆ అనుమానాన్ని మార్క్సిస్టులు మరింత ఎక్కువచేశారు. ఈ దుష్ప్రచారానికి బడుగుదేశాల లోని కొన్ని వర్గాలు సయితం తరచుగా దోహద మిచ్చాయి. బడుగుదేశాలు వృద్ధి అయితే తమ ఆర్థిక, సాంఘిక ప్రయోజనాలకు ముప్పు వాటిల్లవచ్చునని ఆ వర్గాల తలంపు.

ఈ కారణాలచేత, ప్రయివేటు వ్యక్తులు బడుగు దేశాలలో కేవలం లాభాలకోసం కాక, ఉదాత్త ఆశయంతో కూడ ధనాన్ని పెట్టుబడి పెట్టేటట్లు చతుర్థసూత్ర కార్యక్రమం పనిచెయ్య గలగాలి. ఆర్థిక నిర్బంధాలు లేకుండా ఈ సహాయాన్ని బడుగుదేశాలు స్వీకరించేటట్లు కూడా చెయ్య గలగాలి. అందుచేత, అటు బడుగుదేశాలకు, ఇటు పెట్టుబడి దారులకు రక్షణ కల్పించడం అవసరమౌతుంది. ధనాన్ని ఏవిధంగా పెట్టుబడి పెట్టడమో ఐక్యరాజ్య సమితి ప్రధాన సూత్రాలను చెయ్యవచ్చు. అంతమాత్రంచేత, ఈ సమస్య పరిష్కారం కాజాలదు. ఎప్పుడే కార్యం చెయ్యవలసివస్తే దానినిబట్టి పరిష్కార మార్గాన్ని అన్వేషించాలి. ప్రతి బడుగు దేశంలోను వివిధ వర్గాలవారు వివిధ మార్గాలను సూచించ వచ్చు కూడా.

అమెరికనుల దృష్టిలో, ఇంపీరియలిస్టుల ప్రాబల్యం ఏర్పడే పరిస్థితులు, ఇంకా అటువంటి పరిస్థితులు త్వరత్వరగా నశించి పోతున్నాయి. ఇంపీరియలిస్టులు ప్రాబల్యాన్ని పొంద గలరని భయపడు తున్నవారు 1900 నాటి దృష్టితో చూస్తున్నారు. ఆ నాటికి, ఈ 1950 నాటికి సమస్యలలో చాలా వ్యత్యాసమున్నది. నిజానికి, విదేశాలలోని కొన్ని అమెరికన్ వ్యాపారస్థులు తప్పుపనులు చెయ్యకపోలేదు. కాని, అవి సయితం ఆ దేశాల వ్యాపారులు చేసిన పనులకంటె నయం. అమెరికన్ వ్యాపారస్థులు ఆయా దేశాల క్షేమాన్ని

కోరినట్లు అనేక ఉదాహరణలు ఈ పుస్తకంలో పేర్కొనబడ్డాయి.

అమెరికా ఇతర దేశాలనుంచి లాభాలు పొందిసేదనే ఆరోపణ ఒక్కటేకాక, అటువంటివి ఇంకా మరికొన్ని ఉన్నాయి. అమెరికనులకు ఉత్తమ జాతివారమనే గర్వమున్న దని బడుగుదేశాలలోని కొందరు ఏవగించుకుంటారు. ఆర్థిక విషయంలో అమెరికా యెడల గల భయంకంటె ఈ ఏవగింపు ఎక్కువగా ఉన్నది. విదేశాలలోని అమెరికనులు ఒక ఏకాకివర్గంగా ఏర్పడతారని, ఆ దేశాలవారిని హీనంగా చూస్తారని వారు ఆరోపిస్తారు. రష్యాకు వ్యతిరేకంగా ఆ దేశాల వారిని కూడగట్టుకోడానికి అమెరికా చతుర్థసూత్రాన్ని వినియోగిస్తుందని కొందరు అనుమానిస్తారు కూడా.

బడుగుదేశాన్ని అభివృద్ధి చెయ్యడం అనేక చిక్కు పనులతో కూడిన విషయం. ఆ ప్రజల ఆర్థిక, సాంఘిక సమస్యలను, శరీర, మానసిక తత్వాలనుకూడా గ్రహించుకొని పనిచేయాలి. అక్కడి ఉత్పత్తులను పెంచడం మాత్రమే సరిపోదు. యావన్మంది ప్రజల ప్రయోజనానుకూలంగా ఆ ఉత్పత్తులను పెంచడం అవసరం.

చతుర్థ సూత్ర కార్యక్రమాన్ని ఎదుర్కొంటున్న సమస్యలు ఇంకా అనేకం కలవు. ఉదాహరణకు, విదేశంనుంచి లభించే పెట్టుబడి బడుగుదేశానికి ఉపకరణగా మాత్రమే ఉపయోగించ గలదు. అసలు పెద్దపెట్టుబడి ఆ దేశంలోనే లభించవలసి ఉంటుంది. కాని, అంత ధనం దానిలో ఎలాగ

సమకూరగలదు? పన్నులు విధించి రాబట్టాలంటే మధ్య తరగతివారు బాధపడరా? ఆ దేశంలోని వ్యాపారులకు దెబ్బ తగలదా? ఈ విధంగానే అనేక సమస్య లున్నాయి.

మరొక సంగతి. అమ్మకానికి తగిన మార్కెట్టులు, ప్రజలకు కొనుగోలు శక్తి లేని ప్రాంతాలలో పెద్ద పెట్టున ఉత్పత్తులను సాగించడంలో అర్థమేమున్నది? అలాగ జరిగితే వస్తువుల ధరలు పడిపోవడం, సరకులు నిల్వ ఉండిపోవడం జరుగదా? ఇవికాక ఆ దేశాల పరిశ్రమలను జాతీయం చెయ్యడం మాటేమిటి? విదేశాల పెట్టుబడి ధనంలో పరిశ్రమలు లేచిన పిమ్మట ప్రజలు ఆ పరిశ్రమలను జాతీయం చెయ్యాలంటే వారిని ఆపగలవా రెవరు? ఇంకా ఆలోచిస్తే, ఆ ప్రజలు యుద్ధానికి దిగితేకూడ ఎవ రడ్డగలరు?

ఎంత పెద్ద ప్లానులను తయారు చేసినప్పటికీ ఇటువంటి అనేక ప్రశ్నలకు జవాబు చెప్పజాలరు. సమస్యలు బయలు దేరి నప్పుడల్లా వాటిని పరిష్కరించుకోడానికి ప్రయత్నించాలి గాని ముందుగానే సమాధానాలు లభించవు. ఈ కృషిలో ఘోరమైన తప్పిదాలు జరగక తప్పదు.

బడుగు దేశాల అభ్యుదయానికి టెక్నికల్ సహాయం, ధనసహాయంతో పాటు ఇంకా అనేక చర్య లవసరం. ఇవి కూడా జరిగినప్పుడే ఇప్పటికంటె ఉత్తమం, సౌభాగ్యవంతం, సద్భావపూరితం, స్వాతంత్ర్య విలసితం అయిన ప్రపంచం నిర్మించ బడుతుంది. అమెరికా ఇట్టి ప్రపంచ సృష్టికి నాలుగు కార్యాలను తన విదేశాంగ విధానంలో చేర్చుకున్నది. ఆ

నాలుగింటిలో నూతన మహత్తర ప్రణాళిక నాలుగవది. అందుచేతనే, అది చతుర్థసూత్ర కార్యక్రమమైంది.

మొదటి సూత్రం, ఐక్యరాజ్య సమితిని బలపరస్తూండడం; రెండవసూత్రం, మార్షల్ ప్రణాళికద్వారా, పరస్పర వాణిజ్య ఒడంబడికలద్వారా, ప్రపంచ వాణిజ్య సంస్థద్వారా, ప్రపంచ రాజ్యాలమధ్య ఆర్థిక సహకారాన్ని సాధించడం; మూడవ సూత్రం, ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల రక్షణ ఒడంబడిక ద్వారా సమష్టి భద్రతను సాధించడం. పోతే, చతుర్థ సూత్రానికి మిగతావాటితో దగ్గర సంబంధం ఉన్నది.

చతుర్థసూత్ర కార్యక్రమం శాసనం వంటిదికాదు. అదొక విధానాన్ని, వైఖరిని చూపుతుంది. దానిని అమెరికా కాంగ్రెస్ శాసనరూపంలో ఆమోదించడానికి పూర్వంనుంచి కూడా అమలు జరుగుతూనే ఉన్నది. ఉదాహరణకు, 1949 లో నేషనలిస్టు చైనాలో లక్షలాది రైతుల స్థితిగతులను ఆర్థిక సహకార కార్యాలయంవారు చక్కబరిచారు. నేషనలిస్టు చైనా క్రమక్రమంగా కమ్యూనిస్టుల వశంలో పడుతున్నప్పటికీ ఆ విధంగా జరిగింది. అమెరికా చతుర్థసూత్ర కార్యక్రమానికి రూపమివ్వడానికి పూర్వంనుంచికూడా ఐక్యరాజ్య సమితి ఉపసంఘాలు ప్రపంచంలో అధికాహారోత్పత్తికి, ఆరోగ్యాభివృద్ధికి, విద్యాప్రచారానికి కృషి చేస్తున్నాయి. ప్రయివేటు సంఘాలు, ప్రభుత్వాలుకూడ వెనుకబడ్డదేశాల సౌభాగ్యానికై కొన్ని దశాబ్దాలనుంచి శ్రద్ధ వహిస్తున్నాయి.

పోతే, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల సమస్యలకు వాటితో ఏమీ సంబంధమే లేదంటూ ఒక్క గీతతో కొట్టి పారవేయడానికి వీలులేదు.

ప్రపంచ ఆర్థిక సౌష్ఠవానికే ఆటంక పడుతున్న కొన్ని సమస్యలు ఈ పుస్తకంలో వివరించ బడలేదు. అవి డాలర్ల కొరత, కరెన్సీ విలువలు, వాణిజ్యావరోధాలు, నియంతృత్వ విధానాలు మొదలైనవి. వాటినిగురించి ప్రస్తావించడం మాత్రం జరిగింది. కాని, ఈ పుస్తకం ఉద్దేశ్యమే వేరు. ఈ నాటి ప్రపంచానికి నూతన మహత్తర ప్రణాళిక ఏదో ఒక రూపంలో అవసరమని నిరూపించడమే ఈ పుస్తకం ఉద్దేశ్యం. ఈ కార్యక్రమాన్ని తప్పిస్తే ప్రపంచ క్లిష్ట సమస్యల పరిష్కారానికి నియంతృత్వమో, యుద్ధమో తప్ప గత్యంతరం లేదనీ, అమెరికనులు తమ సిరిసంపదలనుబట్టి మాత్రమేగాక అమెరికా వ్యాపార సరళి చతుర్థసూత్ర కార్యక్రమం దిశగానే పురోగమిస్తున్నదనీ, తమ సిరిసంపదల చేతనేమి, స్వభావాదుల చేతనేమి ఈ కార్యక్రమ నిర్వహణలో నాయకత్వానికి అమెరికా ప్రజలు సమర్థులనీ, బడుగు దేశాల అభివృద్ధికై ప్రాజెక్టుల నిర్మాణం ఇప్పటికే ఆలస్యమైనదనీ, ఈ ప్రాజెక్టులను నిర్మించిననాడు శాంతి సౌఖ్యాలతో వర్ధిల్లగల ప్రపంచం ఉద్భవించ గలదనీ—ఇవన్నీ నిరూపించడానికే ఈ పుస్తకం.

అందుచేత, ఇది ఉత్సాహం కలిగించ గలదు.

అమెరికాలో సయితం ప్రశాంత పరిస్థితులు కానరావడం లేదని నా పొరుగువారు నిస్పృహ చెందుతారు. పత్రికలు,

పుస్తకాలు చదివినా, రేడియో ప్రసంగాలు వినినా, విందులకు వెళ్ళినా యుద్ధభయం కలుగుతుంది. హైడ్రోజన్ బాంబు తమ నెత్తిమీదనే పడుతుందన్నంతగా ఆందోళన పడతారు. అటువంటివారికి పరిస్థితులు ఆశాపూరితంగా గోచరించవు. "అమెరికాలో సయితం స్వాతంత్ర్యానికి భంగం కలగడం లేదా?" అని వారు గొంతెత్తి చాటుతారు. "మరొకసారి ఆర్థికమాంద్యం రేపో మాపో ఏర్పడబోవడంలేదా? ప్రతిచోటా కమ్యూనిస్టులు లేరా?" అని గోడన చేస్తారు.

చావో బ్రతుకో తేల్చుకోడానికి మనం యుద్ధంచేసిన నియంతృత్వ విధానమే నిలుస్తుందని నా పొరుగువారి భయం. మనమే క్షీణిస్తామనీ, అదే నెగ్గుతుందనీ వారి ఆందోళన. దేనికైనా మృత్యువు ఆసన్న మనవచ్చునేమో కాని. స్వాతంత్ర్యానికిమాత్రం కాదు.

కమ్యూనిజం ఉద్ధృతంవల్ల కలగగల తుది ఫలితం మేమిటంటే, స్వతంత్ర దేశ మానవుల శక్తి దానిపైననే విశృంఖలంగా విరుచుకు పడడం. మన లోపాలను తొలగించుకో గల పద్ధతులను నేర్చుకొంటున్నాము. ప్రజాస్వామ్యాన్ని కమ్యూనిజం నాశనం చెయ్యడం లేదు. అది తన యావచ్ఛక్తితో విజృంభించేటట్లు కమ్యూనిజం ఒత్తిడి చేస్తూంది.

కమ్యూనిజాన్ని అరికట్ట గలదనే తలంపుతో మాత్రమే చతుర్థసూత్ర కార్యక్రమాన్ని అమలు జరపడం అవివేకం. అదే దాని లక్ష్యమైతే పూర్తిగా విఫలం కాకతప్పదు. రష్యా పాటకు మరొకసారి తాళంవేసినట్లే అవుతుంది.

చతుర్థసూత్ర కార్యక్రమంవల్ల సైనిక బలాలను పెంపొందించుకో నవసరం లేదని చెప్పడం లేదు. నిజానికి మనం అధికతరం చేస్తున్న సైనికశక్తిని వినియోగించే అవసరం రాదనే పూర్తిగా ఆశిస్తున్నాము. ఎందుచేతనంటే, శాంతికి దోహదమిచ్చే గుణం చతుర్థసూత్ర కార్యక్రమంలో ఉన్నది.

ఈ కార్యక్రమం ఔషధం లాంటిది. ఔషధాన్ని త్రాగడం వలన ఒక్కమాటుగా వ్యాధి నయంకాదు. మంత్రాలకు చింతకాయలు రాలవు. రా అనగానే విద్యాబుద్ధులు రావు. రూపాయనోటు చూపిస్తే రావు. ఇల్లు అలకగానే పండుగ అవదు. ఒక ఆనకట్ట కట్టగానే భూమి సస్యశ్యామలం కాదు. ప్రజల జీవన వ్యయప్రమాణం హెచ్చిన తరువాతకూడా చాలాకాలంవరకు ప్రపంచ రాజ్యాల మధ్య ఈర్ష్య, అసూయ, వైమనస్యం పోజాలవు.

అమెరికా ధనం ప్రపంచాన్ని కాపాడగలదంటే వొట్టి మాట. ఆ యా బడుగు దేశాల పెట్టుబడులు సద్వినియోగం కావడానికి మాత్రమే అది ఉపకరిస్తుంది.

చతుర్థసూత్ర కార్యక్రమంపట్ల ఎన్ని అభ్యంతరాలు చెప్పినా, ఎన్ని ప్రమాదాలు ఉన్నాయని చెప్పినా, అమెరికన్ జాతి తన భౌతికశక్తిని ఎంత వృద్ధి చేసుకొన్నదో తుదకు అంత మేధా సంపత్తినికూడా వృద్ధి చేసుకొన్నదనే విషయం యదార్థమనక తప్పదు. ప్రచ్ఛన్న యుద్ధాన్ని చతుర్థసూత్రం కలలో విషయంగా చెయ్యగలదు. ప్రపంచ వాణిజ్యాన్ని

అభివృద్ధి పరచి ప్రజల భయాందోళనలను తొలగించి. ఆశా విశ్వాసాలను కలిగించగలదు.

చతుర్థసూత్ర కార్యక్రమం ప్రపంచాన్ని అమెరికాలాగ మార్చివేయదు. అమెరికనులలోకూడ లోపాలున్నవనే సంగతి స్వతంత్ర ప్రజలకు విదితమే.

అలాగ జరగబోదు గనుక మనం ధన్యవాదా లర్పించుదాం. ధనాన్ని, నైపుణ్యాన్ని ఎగుమతి చేసినంత మాత్రంచేతకూడ మూలపడ్డ ఆర్థిక వ్యవస్థలకు చైతన్యం కలగబోదు. వెనుకబడ్డ దేశాలకు అవి ఉత్సాహాన్ని కలిగించి అడుగు వేయించ గలవు. అయితే, అన్నప్పుడూ అవి మనకిష్టమైనలాగే అడుగువెయ్యవు. అందుకుకూడ మనం ధన్యవాదా లర్పించాలి. మనం నియంతలం కాము; నిర్మాతలము.

అంతేకాదు, ఎటువంటి న్యాయదృష్టితో చూచినప్పటికీ చతుర్థసూత్ర కార్యక్రమం సోవియట్ పద్ధతిని త్వరగా సమూలించ గలది కాదనికూడా విదితం కాగలదు. ఏ పని చెయ్యడంలోనైనా ఒక్కొక్కరికి ఒక్కొక్క ప్రత్యేకత ఉంటుంది. అది చైనావారికైనా ఉన్నది; అమెరికనులకైనా ఉన్నది; మరొకరికైనా ఉన్నది.

అలాగే రష్యనులకుకూడా వారి పద్ధతులు వారికి ఉన్నాయి.

కాని, ప్రపంచ భవిష్యత్తు రష్యామీద గాక, మనమీద ఆధార పడ్డదనే విషయాన్నిమాత్రం చతురసూత్ర కార్యక్రమం విస్పష్టం చెయ్యగలదు.

# కొత్తది కాదు

ప్రెసిడెంట్ ట్రూమన్ 1949 లో కాంగ్రెసు ప్రారంభోత్సవ సందర్భాన, చతుర్థసూత్ర కార్యక్రమం జాతీయ విధానమనీ. "బడుగు దేశాల అభివృద్ధికై మనకు శాస్త్ర పారిశ్రామిక రంగాలలో గల విజ్ఞానాన్ని వాటికి లభింప జెయ్యాలి," అని చెప్పాడు. అమెరికన్ వ్యాపారస్థులు, వ్యవసాయదారులు, కార్మికులు సహకరించాలని ఆయన కోరాడు. వాటిలో ధనాన్ని పెట్టుబడి పెట్టి, పరిశ్రమలను వృద్ధి చేసే నిమిత్తం తమ తమ సాంకేతిక నైపుణ్యాన్ని అమెరికాతో పాటు లభింప జేయవలసిందనికూడా ఆయన విదేశాలకు విజ్ఞప్తి చేశాడు. "శాంతి, సుభిక్షం, స్వాతంత్ర్యాల సాధనకు ప్రపంచ మంతనూ ఉద్ధరించే కార్యక్రమంలో సహకరించండి," అని ఆయన విజ్ఞప్తి చేశాడు.

ప్రెసిడెంట్ ట్రూమన్ ఈ కార్యక్రమం గురించి ఏ విషయాన్నీ స్పష్టంగా చెప్పలేదు. ఏ దేశాలకు ఈ సహాయాన్ని చెయ్యాలో, ఎంత ఖర్చు చెయ్యాలో, ఏ ప్రణాళికలను అనుసరించాలో ఆయన వివరించలేదు. ఇదంతా నిరపాయకరమైన వాగాడంబరమనీ, ఏదో ఒకటి చెప్పవలసి ఉన్నది గనుక ట్రూమన్ ఇదంతా ఊసుపోక చెప్పాడనీ వ్యాఖ్యాతలు విమర్శించారు.

యూరప్ పునరుద్ధరణ కార్యక్రమాన్ని ప్రారంభించాలంటూ 1947 లో జనరల్ మార్షల్ హార్వర్డు విశ్వవిద్యాలయంలో చేసిన ఉపన్యాసాన్ని విమర్శించినవారికి ఆ

తరువాత కనువిప్పు అయినట్లుగానే, ట్రూమన్ ప్రకటన కూడా అనతికాలంలోనే విమర్శకులు పోగపాలు పడ్డారని తేలిపోయింది. మరొకసారి అమెరికా మహాసముద్రయానాన్ని ప్రారంభించినదన్నమాట. వెనక్కి రావడం మాత్రం సులభ సాధ్యంకాదు. "కొందరు అమెరికనులు ఈ విషయాన్ని వెంటనే గ్రహించారు. ప్రభుత్వ విధానం ఇంత స్వల్పకాలం లోనే ఎంత మారిపోయిందో," అనుకొంటూ ఆశ్చర్య చకితు లయ్యారు.

ఏమైనా, చతుర్సూత్ర కార్యక్రమం కొత్తది కాదు. అప్పుడప్పుడు అది స్వల్పంగా అమలు జరుగుతూనే ఉన్నది. పాశ్చాత్యులు తమ సాంకేతిక నైపుణ్యంతో [illegible] దేశాలను వృద్ధిపరచడం వుడ్రో విల్సన్ కాలంనుంచీ జరుగుతున్నదే. యూరపు దేశాలు ఒకదానితో మరొకటి యుద్ధం చేసుకోవడం కంటె ఎల్లో ఫీవరును, కొంకి పురుగు వ్యాధిని నిర్మూలించ డానికి శ్రద్ధ పట్టవలసిందని వాల్టర్ హైన్స్ పేజ్ ఆనాడు సూచించాడు. అదే విధంగా హెర్బర్ట్ హూవర్, ఫ్రాంక్లిన్ రూజ్వెల్టులు కూడా హితవు చెప్పేవారు. "ఏనాటికైనా జరగక పోతుందా," అనే ధోరణిలో ద్వితీయ ప్రపంచ యుద్ధానికి పూర్వమే ఇట్టి మహత్తర ప్రణాళికను గురించి రాజకీయ నాయకులు చర్చించుకొనే వారు.

అమెరికన్ వ్యాపారస్థులు, మిషనరీలు, ధర్మసంస్థలవారు, సాంకేతిక నిపుణులు, గవర్నమెంటు ఏజన్సీలవారు ఈ కార్య క్రమానికి ఆదిలో పునాది వేశారు.

ఇటీవల విదేశాలకు పెట్టుబడి పెడుతున్నవారు కొద్దిమందే అయినప్పటికీ, విదేశాలలో బ్రాంచీలు కలిగి, ధనాన్ని పంపుతున్న అమెరికన్ కంపెనీలు ఈనాడు రెండువేలనుంచి మూడువేలవరకు ఉన్నాయి.

అరేబియాలో పెట్రోలు కంపెనీల మూలంగా అక్కడి ప్రజల జీవన ప్రమాణం అధికంగా వృద్ధి అయింది. వెనిజూలాలోని పెట్రోలు కంపెనీల వలన ఆ దేశానికి అత్యధికంగా ఆదాయం లభిస్తున్నది. మరి దేనివల్ల దానికి అంత ధనం రావడం లేదు. తత్ఫలితంగా దేశంలో వైద్యశాలలు, విద్యాలయాలు విరివిగా నెలకొల్ప బడ్డాయి.

ఇంటర్నేషనల్ జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీవారికి విదేశాలలో అనేక డజనుల బ్రాంచీ లున్నాయి. ఆ దేశాల వ్యాపారస్థులతో భాగస్వామ్యం కలిగి వాటిని నిర్వహిస్తూంది. విదేశాలవారికి దానివల్ల విశేషంగా సాంకేతిక నైపుణ్యం లభిస్తూంది. పైగా, అమెరికనులకు తెలియని నేర్పరితనం ఆ దేశాలనుంచి గ్రహించబడుతూంది.

ఇండియాలో విలియం డి. పాలీ 80,00,000 డాలర్ల విలువగల ఎరువుల ఫ్యాక్టరీని తిరువాన్కూరు సంస్థానంలో నెలకొల్పాడు. అది తయారుచేసే అమోనియమును చేలకు వేస్తే, ఆ క్షామ భూమిలో ధాన్యం రెండింతలు పండగలదు. అమెరికనుల ప్రయత్నంవల్ల తిరువాన్కూరు ప్రజలకు క్షామ ప్రమాదం తప్పింది.

బెంగుళూరులో విలియం పాలీ ఒక విమానాల ఫ్యాక్టరీని నెలకొల్పాడు. అమెరికాలో అత్యుత్తమమైనదని భావించబడే కంపెనీల కార్మికులతో ఆ కార్మికులను పోల్చవచ్చును. అంతగా వారు ఆదరించబడుతున్నారు. మూడు సంవత్సరాల అనంతరం అది తగినంతశీఘ్రముంగా విమానాలను నిర్మిస్తున్నది.

ఇండియాలోని ఫైర్‌స్టోన్ కంపెనీవారు అమెరికన్ రబ్బరు ఫ్యాక్టరీలలోని కార్మికులతో సమంగా అక్కడి కార్మికులకు జీతాలు యిస్తారు. అందువల్ల అక్కడి కార్మికులు అమెరికన్ కార్మికులకంటె కూడా నైపుణ్యం చూపుతున్నారని ఆ కంపెనీవారు గ్రహించారు.

కారిబియన్ దీవులలో గల యునైటెడ్ ఫ్రూట్ కంపెనీ వారు ఆ ప్రాంతంలోని మిగతా కంపెనీలకంటె కార్మికులకు ఎక్కువ జీతాలను ఇవ్వడమే గాక, ఆ కంపెనీ తాలూకు షాపులలో ఆహార ధాన్యాలను అతిచవుకగా అమ్ముతున్నారు. పాఠశాలలను, ఇళ్ళను, వైద్యశాలలను కట్టించి తమ కంపెనీలో పని చేసేవారికి సర్వ సదుపాయాలు చేస్తున్నారు. కారిబియన్ దీవులలోని ఇతర కార్మికుల జీవనవ్యయ ప్రమాణం కంటె, ఫ్రూట్ కంపెనీ కార్మికుల జీవనవ్యయ ప్రమాణం రెండింతలు. దక్షిణ అమెరికా వాసులకు ఫ్రూట్ కంపెనీవారు వ్యవసాయ పద్ధతులలో శిక్షణ యిస్తారు. అందువల్ల అమెరికా ఖండానికి కారిబియన్ ప్రాంతం "పళ్ళ బుట్ట" కాగలదు.

విదేశాలలోని అమెరికన్ కంపెనీలు పెద్దవి కానవసరం లేదు; ఎక్కువధనం ఖర్చుచేసేవి కానవసరంలేదు. అవి చాల

వరకు ఉత్తమ పద్ధతులమీాద నిర్వహించ బడుతూ ఉంటాయి. తమ కంపెనీలలో పనిచేసే వారి యోగక్షేమాలను గురించి శ్రద్ధ వహిస్తాయని అవి ఋజువు చేశాయి. అవి ఉన్న ప్రాంతాల అభివృద్ధికి కృషిచేస్తాయని తేటపరిచాయి.

ఉదాహరణకు, ఇక్వేడార్‌లో గ్వాతూక్విల్‌లో గల ఒక కంపెనీ కృషిని చూద్దాం. దానిపేరు ఎంబోటెల్లా డోరానాసి యోనాల్. 1946 లో ఇది నూరుమంది ఇక్వేడార్ పనివారిని నియోగించింది. పెప్సీకోలా పానీయం సీసాలను నింపడం వీరిపని. కార్మికులు మాత్రమే గాక, ఇంజనీర్లు, మెకానిక్‌లు, జనరల్ మేనేజరు వీరందరు కూడా ఇక్వేడార్ వారు లే.

పెప్సీకోలా పానీయమేగాని, ఆహారం కాకపోవచ్చు. అది లేకపోయినా ఇక్వేడారు ప్రజలు బ్రతుకగలరు. అయినప్పటికీ, ఆ కంపెనీ తన కార్మికులకు విశేషంగా సహాయపడింది. యజమాని, కార్మికులు ఎటువంటి సహకార భావంతో సద్భావంతో పనిచేసుకోవాలో ఆ కంపెనీ చూపించింది.

ఫ్యాక్టరీకి కార్మికులలో నూటికి 40 వంతులమంది అనారోగ్య కారణాలచేత హాజరు కాలేక పోయేవారు. అందుచేత, డబ్బు ఎక్కువ ఖర్చుకావడం, పనులు తక్కువ అవడం జరిగింది. ఈ సంగతి కనిపెట్టగానే కంపెనీ యజమానులు ఇక్వేడార్ కార్మికులను చీదరించుకోడానికి బదులు ఒక వైద్యుణ్ణి నియమించారు. నాలుగు రోజులలో అతడు రోగులకు నయం చేశాడు.

వారిని పనులనుంచి తొలగించడానికి బదులు కంపెనీ వారు మంచి ఔషధాలను, విశ్రాంతిని, జీతాలను యిచ్చారు. స్వస్థమైన వెంటనే వారు పనులకు వచ్చారు.

కార్మికులు అప్పటికే అసమర్థంగానే పనిచేశారు. అనారోగ్యంగానే ఉన్నారు. అందుచేత, కంపెనీ యజమానులు కార్మికులకోసం ఒక హోటలు పెట్టారు. దానిలో కార్మికులకు భోజనం ఉచితం. అయితే, ఒక ఆహార పదార్థాల నిపుణుడు దానిలో నియోగించబడ్డాడు. నెలరోజులలో సగటున ఒక్కొక్క కార్మికుని బరువు ఐదుపౌనులు పెరిగింది. ఫలితం ఏమైంది? నూటికి 95 మంది పనులకు హాజరైనారు. ఉత్పత్తులు రెండింతలు పెరిగాయి.

కార్మికులు చిన్న దొంగతనాలు చేసేవారు. అందుచేత, ఇలాగ ఎందుకు జరగాలా అని యజమానులు యోచించారు. సాధారణంగా ఒక్కొక్క ఇక్వడార్ కార్మికునికి రోజుకి ఆరు సకర్ లు ఇస్తారు (సుమారు రెండు రూపాయలు). ఈ దొంగతనాలు జరుగుతున్నందున కంపెనీ యజమానులు తమ కార్మికులకు రోజుకు 21 సకర్ల వేతనాన్ని యివ్వనారంభించినారు. శని, ఆదివారాలు పనులు లేకపోయినప్పటికీ, ఆ రోజులకుకూడ కలిపి వారం జీతం ఒక్కసారిగా యిచ్చేవారు. తరువాత దొంగతనాలే జరగలేదు.

వేతనాలు కాక లాభాలలో నూటికి 7 వంతులు కార్మికులకు పంచి పెడతారు. అందువల్ల యజమానులు ఎంత కష్టపడి పనిచేస్తారో, కార్మికులు కూడా అంత కష్టపడి పని

చేస్తారు. 1947 న సంవత్సరాంతాన లెక్క వేయగా కార్మికులు శ్రద్ధవహించని కారణాన 15,000 డాలర్ల విలువకు సీసాలు చెడిపోయినవని తేలింది. అంటే కార్మికులకు రావలసిన 1050 డాలర్ల లాభం పోయిందన్నమాట. ఆ మరుసటి సంవత్సరంలో సీసాలు చెడిపోవడం సగానికి తగ్గింది. ఈ నాడు ఆ కంపెనీవారు రోజుకు 3,000 పెట్టెల పెప్సీకోలా సీసాలను అమ్ముతారు. ఒక మాదిరిగా లాభాలు వస్తున్నాయి. తాము ఇంకా కష్టపడి పనిచేయాలని కార్మికులకు, యజమానులకు నమ్మకం కలిగింది. పరస్పర సహకారాన్ని ఇంకా సాధించు కోవాలని వారు విశ్వసిస్తారు.

దక్షిణ అమెరికన్ దేశాలలోని అమెరికా కంపెనీలు తమ కార్మికులకు ఆ ప్రాంతాల కంపెనీలు ఇచ్చే జీతంకంటె నూటికి 60 వంతులు ఎక్కువగా ఇస్తాయి. ఆ దేశాలవారికి మంచి శిక్షణ ఇస్తుంటాయి. స్థానిక వ్యాపారస్థులుకూడ తమ కంపెనీలలో వాటాదారులు కావాలని అవి తరచు ప్రయత్నం చేస్తుంటాయి. స్థానిక వ్యాపారస్థులను వాటాదారులుగా చేర్చుకొనిన అమెరికా కంపెనీలలో కొన్ని యివి: డబ్ల్యు. ఆర్. గ్రేస్ అండ్ కంపెనీ, పాన్ అమెరికా–గ్రేస్ ఎయిర్ వేస్, అమెరికన్ సైనమైడ్ కంపెనీ, పిట్స్‌బర్గ్ ప్లేట్ గ్లాస్ కంపెనీ.

ఈ కంపెనీలలో కొన్ని గుత్తవ్యాపారంవల్ల లాభాలన్నీ తామే సంపాదించిన పాపం చేసి ఉండవచ్చు. కొన్ని ఆర్థిక వ్యవస్థను తమ గుప్పిటిలో పెట్టుకొని ఉండవచ్చు. కాని, మొత్తంమీద ఆ దేశాల పరిస్థితులను చక్కబరచినవి.

అమెరికా నమ్మకాలు, వైఖరులు విదేశాలకు ప్రాకడంలో ప్రయివేటు వ్యాపారస్థులు వహించిన పాత్ర కొట్టిపారవేయ వలసినది కాదు. ప్రపంచానికి అమెరికా స్థితిగతులను తెలియ పరచడానికి హాలివుడ్ చిత్రాలు ఎంత ఉపకరించినవో ప్రతి వానికీ తెలియగలదు. అమెరికా పరిశ్రమలలోని పరిస్థితులను నేర్పడానికి ప్రతి సంవత్సరం విదేశ విద్యార్థులను ఇక్కడికి తీసుకువచ్చే అనేక అమెరికన్ కంపెనీలలో వెస్టింగ్ హౌస్ ఒకటి. ప్రపంచంలోని విదేశ ప్రజల వాంఛలైనా అమెరికా ప్రజల వాంఛలవంటివే నని చెప్పడానికి అద్భుతమైన "రీడర్స్ డైజెస్ట్" పత్రిక చాలును. ఎందుచేతనంటే, అది ప్రతినెలా విదేశాలలో పదకొండు భాషలలో 70,00,000 ప్రతులు అమ్ముడుపోతుంది.

వెనుకబడిన దేశాలు యెంత ఉపద్రవకరంగా పరిణమించ గలవో, వాటిని అభివృద్ధిచేస్తే యెంత ఆశాజనకం కాగలవో అమెరికా ధర్మసంస్థలు, ఇతర ఏజన్సీలు ఎక్కువగా గ్రహిస్తున్నాయి.

ప్రపంచ దేశాలు సహజసంపదలను కాపాడి, ప్రపంచాన్ని అభివృద్ధి పరచడానికి టెన్నెసీవాలీ అథారిటీవంటి ప్రపంచ సంస్థ నొకదానిని స్థాపించాలని 1946 లో అమెరికా ప్రభుత్వం ఐక్యరాజ్య సమితికి సూచించి, అందుకై ఒక సమావేశాన్ని ఏర్పాటు చెయ్యాలని కోరింది. వెనుకబడ్డ దేశాలకు సహాయ పడే నిమిత్తం ప్రపంచ ఇంజనీరుల ఫెడరేషన్‌ను స్థాపించాలని

ఇంటర్నేషనల్ టెక్నికల్ కాంగ్రెసువారు ప్యారిస్‌లో అదే సంవత్సరం సమావేశమై ప్రతిపాదన చేశారు.

సుమారు రెండు దశాబ్దాలనుంచి విదేశ ప్రభుత్వాలు మన టెన్నెసీ వాలీ అధారిటీని, భూసార రక్షణ కార్యాలయాన్ని పరిశీలించడానికై నిపుణులను పంపిస్తున్నాయి. ఇతర దేశాలు వ్యవసాయ పద్ధతులను, ఇతర అభ్యుదయకర ప్రణాళికలను పరిశీలించి, తగు ఉత్తమ పద్ధతులను గురించి ఆయా ప్రభుత్వాలకు సలహాలిచ్చే నిమిత్తం మనంకూడా నిపుణులను పంపుతున్నాము. విదేశాలకు అనేక అమెరికన్ సంస్థలు సాంకేతిక సహాయాన్ని చేస్తున్నాయి. ఉదాహరణకు, పది సంవత్సరాలనుంచి దక్షిణ అమెరికా దేశాలకు మన వ్యవసాయ కార్యాలయం సహాయపడుతున్నది. ఆ దేశాల వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుతున్నది. అది పెట్టుబడి పెట్టిన ప్రతి మూడు డాలర్లకు మనం ఒక డాలరు పెడుతున్నాము. ఈనాడు దక్షిణ అమెరికా దేశాలలో వాటికి సహాయపడుతున్న మన పరిశోధనాలయాలు మొదలైనవి 220 ఉన్నాయి. ఇదే విధంగా మధ్యప్రాచ్య దేశాలకు, ఆసియా దేశాలకు, ఫిలిప్పీన్సుకు సహాయపడుతున్నాము.

బడుగు దేశాలలో పెద్దగా ధనం ఖర్చుచెయ్య నవసరం లేకుండానే ప్రజల జీవితాన్ని బాగుచెయ్యవచ్చునని ప్రయివేటు ధర్మసంస్థలు కార్యాచరణలో చూపించాయి. నియర్ ఈస్ట్ ఫౌండేషన్ వారు ఏడాదికి కొన్ని వేల డాలర్లు మాత్రమే ఖర్చు చేస్తారు. మధ్యప్రాచ్యంలో ఒక్కొక్క

గ్రామంలో ప్రజలు స్వయంసహాయంతో అభివృద్ధి పొందే పద్ధతులను, వ్యవసాయాలను వృద్ధిచేసే పద్ధతులను వీరు బోధిస్తూ, అనేకమంది స్త్రీల, పురుషుల, బాలబాలికల స్థితిగతులను చక్కబరిచారు. రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్‌వారు చిరకాలంనుంచి ప్రజలను పీడిస్తున్న అనేక వ్యాధులను నిర్మూలించారు. ఆధ్యాత్మికంగా మానసికోన్నతి పొందాలంటే చక్కని దేహారోగ్యం అవసరమని మతసంస్థలవారు గుర్తించారు. వారు చర్చీలను మాత్రమేగాక, కాలేజీలను, వైద్యశాలలనుకూడా బడుగుదేశాలలో స్థాపించారు.

రాడార్ యంత్రాన్నిగాని, రాకెట్ విమానాన్నిగాని కని పెట్టడమంటే దుస్సాధ్యమనీ, ఊహాగానమనీ పది సంవత్సరాల క్రిందట సామాన్య అమెరికా పౌరునికి ఎలాగ అనిపించిందో, ప్రపంచాభ్యుదయ కార్యక్రమంకూడ అలాగ అనిపించింది. కాని, క్రమంగా అది అతడికి సాధ్యమనిపించడానికి కొన్ని ఉపకరించాయి. అవి, పొరుగు రాజ్యంతో పొత్తుగా ఉండాలనే విధానం. అరువు-కౌలుబిల్లు, రెండవ ప్రపంచ యుద్ధం, ఐక్యరాజ్య సమితి, రష్యా పాశ్చాత్య దేశాల మధ్య విభేదాలు, చిట్టచివరకు మార్షల్ ప్రణాళిక.

"తమకు తామే సహాయం చేసుకొనే నిమిత్తం ఇతరులకు సహాయపడడం అమెరికాకే సహాయకారి అనేసూత్రం మీద రచించబడిన మార్షల్ ప్రణాళికవల్ల యూరప్‌కు ప్రయోజనం కలిగితే, మిగతా స్వతంత్ర ప్రపంచానికికూడా అది ప్రయోజనం కలిగించగలదు," అని కొందరన్నారు.

వెనుకబడ్డ దేశాలను అభివృద్ధి చెయ్యడం అవసరమని 1949 మొదటి ఆరు నెలల్లో అమెరికాలో క్రొత్త వాదాలు బయలుదేరాయి. యూరపు దేశాల పునరుద్ధరణ పూర్తి అయిననాడు ప్రపంచంలో తగినన్ని మార్కెట్లు ఉండజాలవనేది స్పష్టపడింది. అంతర్జాతీయ సహకారం అంతి యెక్కువగా జరుగుతున్నప్పుడు, యూరప్ రాజ్యాలు ఉత్పత్తి చేసే సరుకులు అమ్ముడుపోడానికి మార్కెట్లు ఉండవు. వ్యాపారాలలో పోటీ విషమస్వరూపం దాల్చగలదు. సరకులు కొల్లలుగా ఎగుమతి అవుతాయి. సరకులు కొనేవారుండరు. ధరలు పడిపోతాయి. కరెన్సీలకు విలువ వుండదు. సుంకాలు హెచ్చిపోగలవు. అందుచేత, శాంతి సుభిక్షాలతో ప్రపంచం పరిఢవిల్లాలంటే అట్టి పరిస్థితులు ఏర్పడకుండా చెయ్యాలి. అందుచేత, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలోని దేశాలను అభివృద్ధి పరచినట్లయితే అటువంటి విషమ పరిస్థితులు తొలగిపోగలవనీ, కనీసం తాత్కాలికంగానైనా ఉపద్రవం సంభవించదనీ ఆర్థిక, వ్యాపార, సాంఘిక శాస్త్రవేత్తలకు అనిపించింది. అందువల్ల, ఇంతకంటె సౌఖ్యవంతమైన ఉత్తమ ప్రపంచ నిర్మాణానికి నాందీప్రస్తావన కాగలదని వారు భావించారు.

ప్రపంచ జనాభాలో సగానికిపైగా ఈనాడు రెండు పూటలా తిండిలేదు. ప్రాణాలను అరచేతులలో పెట్టుకొని బ్రతుకుతున్నారు. వారి జీవితం నిరర్థకమౌతూంది. దారిద్ర్యంతో, అజ్ఞానంతో వారు రోజులు వెళ్ళబుచ్చు

తున్నారు. వారు తగు వయస్సయినా రాకుండానే మరణిస్తారు. ఆ వయస్సు సామాన్య అమెరికన్ పౌరునికి వివాహం చేసుకో తగునదికూడా కాదు. ఇండియా, చైనా, ఈజిప్టులలో పనివారల వేతనాలు అతి స్వల్పం. కడుపునిండా తినడానికి చాలవు.

అయితే, మనం చేస్తున్న పనేమిటి? మానవ కారుణ్య దృష్టితో సహాయపడుతున్నా మనుకోండి. అంతమాత్రంచేత మన ప్రభుత్వ విధానం ఫలప్రదం కాజాలదు. అమూల్యమైన మానవశక్తి వృథా అవుతూంది. అలాగ కానివ్వడం ప్రపంచానికి తగదు. బడుగు దేశాలు అభ్యున్నతి పొందక పోతే ఆ దేశాల ప్రజలు మిగతా ప్రజలకు, అమెరికనులకు సయితం బరువు కాగలరు. ఎందుచేతనంటే, బడుగు దేశాలలో ఎల్లప్పుడు ఉద్రిక్త పరిస్థితులు ఉంటూ, విప్లవాలకు, యుద్ధాలకు కారణం కాగలవు. వారికి ప్రజాస్వామిక ప్రయోజనాలను కలిగించక పోతే కమ్యూనిజం నోట పడగలరు; లేదా మరొక అభివృద్ధి నిరోధక పరిపాలనలో చిక్కగలరు. తత్ఫలితంగా అమెరికా ఒంటరిగా, నిరంకుశ రాజ్యాలమధ్య స్వాతంత్ర్యం గల ఏకాకి దీవిగా అయిపోతుంది.

పోతే, ఆకలితో మాడుతున్న ప్రజలకు పుష్కలంగా భుక్తి లభించేటట్లు చేస్తే, వారు పరిశుభ్ర ప్రాంతాలను నిర్మించుకొనేటట్లు చేస్తే, కర్రనాగళ్ళకు బదులు మరనాగళ్ళను సప్లయి చేస్తే అధిక సంఖ్యాకులకు శక్తియుక్తులు కలిగి, అవి ప్రపంచాభ్యున్నతికి దోహద మివ్వగలవు.

ఆర్థికంగా చూస్తే అంతులేని అవకాశాలున్నాయి. అమెరికనులు వాడినంతగా అందరూ సబ్బులను వాడుతారనుకోండి. సబ్బులు ఇప్పటికంటె నాలుగు రెట్లు తయారు కావాలి. మనం వాడేటన్ని వస్త్రాలను అందరూ వాడుతారనుకోండి. ఇప్పటికంటె మూడురెట్లు వస్త్రాలు తయారు కావాలి. రేపే మిగతా ప్రపంచంలో ఇప్పటికంటె 2,00.00.000 మైళ్ళ రోడ్లను నిర్మించారనుకుందాం. అయినప్పటికీ అమెరికాలోని రోడ్ల పొడవు ఎక్కువగానే వుంటుంది. ఇప్పటికంటె మిగతా ప్రపంచంలో 35,00,00,000 టెలిఫోనులు, 45,00,00,000 మోటారుకారులు, 60,00,00,000 రేడియోలు ఎక్కువైనవనుకుందాం. అప్పటికీ అమెరికాదే పై చేయి. అందుచేత, బడుగు దేశాల ప్రజలు ఎంతైనా అభివృద్ధి చెందవలసి వుంది. వారు ఉన్నతస్థితికి వచ్చినకొలదీ మనం కూడా ఉన్నతస్థితి పొందుతూంటాం.

ఈ నూతన మహత్తరప్రణాళిక మొట్ట మొదట ప్రకటించబడినప్పటినుంచి, అమెరికా సాంకేతిక నైపుణ్యాన్ని, ప్రయివేటు ధనాన్ని ప్రపంచాభివృద్ధికి వ్యాపారం మాదిరిగా వినియోగించవచ్చునని మొత్తంమీద చాలా మంది ఒప్పుకున్నారు.

అయితే, దీనిలో చాలా కష్టాలున్నాయి. చతుర్థ సూత్ర కార్యక్రమం ద్వారా ప్రభుత్వం విరివిగా ధనాన్ని ఖర్చు చేస్తే తమ కెక్కడ అపకారం జరుగుతుందోనని వాణిజ్య నాయకులు భయపడుతున్నారు. చతుర్థ సూత్రంవల్ల ఆర్థిక, రాజకీయ

రంగాలలో మరొక ఇంపీరియలిజం నెలకొంటుందేమోనని లిబరల్ రాజకీయవేత్తలు భయపడుతున్నారు.

అట్టి భయ సందేహాలను సాధ్యమైనంతవరకు నివారించే నిమిత్తం చతుర్థసూత్ర కార్యక్రమ రచయితలు బహు జాగ్రత్త వహించారు. ఇదివరకునుంచి బడుగు దేశాలకు జరుగుతున్న సహాయాల నన్నింటినీ క్రమబద్ధం చేసి, వాటికి రూపు రేఖ లిచ్చారు. అంతే వారుచేసిన పని. ఆ విధంగా కాంగ్రెసుకు బిల్లులు సమర్పించారు.

పూర్వపు అనుభవాన్ని పురస్కరించుకొని ఆ బిల్లులు శక్తిమంతం చెయ్యబడ్డాయి. వాటికి చలనం లేదు. విదేశాల లోని రైతులు, పారిశ్రామిక వేత్తలు, తదితరులు అమెరికా సాంకేతిక సహాయాన్ని పొందదలచితే, తగు ఖర్చులను చెల్లించాలని ప్రభుత్వానికి కాంగ్రెసు తెలియపరిచింది. పైగా అమెరికా నుంచి పెట్టుబడిపెట్టగల ధనానికి మోసం కలగబోదని ఆ దేశాలు హామీనివ్వాలని ప్రతిపాదించబడింది. అమెరికా పభుత్వంనుంచి మాత్రమే గ్యారంటీని కోరడం సముచితం కాదనీ, సహాయం పొందగల దేశాలుకూడా అటువంటి గ్యారంటీ నివ్వాలనీ వ్యాపారస్థులు వక్కాణించారు.

అమెరికా ప్రెసిడెంటు ప్రకటన, అమెరికా నుంచి లభించ గల మద్దతు ఐక్యరాజ్యసమితికి ప్రోత్సాహమిచ్చాయి. అందు మీదట ఐక్యరాజ్యసమితిలోని ఆర్థిక, సాంఘిక సంఘంవారు ప్రత్యేకంగా ఒక సాంకేతిక సహాయ కార్యాక్రమాన్ని తయారు చేశారు. దానిని 1949 వర్షాకాలంలో జనరల్ అసెంబ్లీ

ఆమోదించింది. అది చతుర్థసూత్రి కార్యక్రమంలోని భాగంగా లాంఛనానికి తయారు చెయ్యబడ్డదికాదు. అయితే, మన కార్యక్రమానికి తోడుగా ఉంటుంది. అమెరికా ధనం, సాంకేతిక నైపుణ్యం ఆ కార్యక్రమాచరణకుకూడా లభించగలవు.

చతుర్థసూత్రి కార్యక్రమంక్రింద జరుగగల ప్రథమ చర్యల ఫలితంగా టి. వి. ఏ. వంటి పెద్ద ప్రాజెక్టుల నిర్మాణం బహుశా జరగక పోవచ్చు. అందుకు బదులుగా, బడుగు దేశాలలో పరిశ్రమల అభివృద్ధికి తగు మార్పులు, సంస్కరణలు స్వల్పవ్యయంతో జరుపబడగలవు. ఒక్కొక్క సందర్భంలో ఖర్చులేకుండా కూడా అవి జరగగలవు. పెద్ద ప్రాజెక్టులు ఎప్పటికో గాని సాధ్యం కావనుకున్నప్పటికీ రైతులకు, కార్మికులకు నూతన పద్ధతులను బోధించడం ముమ్మాటికీ సాధ్యం.

పెద్ద ప్రాజెక్టులు, పరిశ్రమలు మొదలైనవి మున్ముందు నిర్మించుకోవచ్చును గాని, వెంటనే నూతులను త్రవ్వడం, చిన్న పరిశ్రమలను నెలకొల్పడం మొదలైనవి జరగాలి. ఆస్పత్రులను ముందెప్పుడో నిర్మించినప్పటికి మొట్టమొదట ఆరోగ్య పద్ధతులను అనుసరించడం బడుగు దేశాలలో ముఖ్యావసరం.

బడుగు దేశాలు అతిత్వరితగతిని ఉత్పత్తులను చెయ్యడానికి సిద్ధమైనప్పుడు పెద్ద ప్రాజెక్టులను నిర్మించుకోడానికి సిద్ధం కాగలవు. ప్రభుత్వ సహాయంలేనిదే పెద్ద ప్రాజెక్టులకు

ధనం సమకూర జాలదు. కొన్ని ప్రాంతాలలో చతుర్థసూత్ర కార్యక్రమం అమలు జరుగుతున్నప్పుడే ఈ పనులకు ప్లానులు జరుగగలవు; పునాదులు ఏర్పడగలవు. కాని, ఆ వెంటనే ఫలితాలను పొందలేరు. చతుర్థసూత్ర కార్యక్రమంనుంచి ఆనకట్టలకు, ఎడారులను పంటభూములుగామార్చడానికి ధనం లభించదు. ఆ ధనాన్ని ఎగుమతి దిగుమతుల బ్యాంకు, ప్రపంచ బ్యాంకు మొదలైనవి ఇవ్వాలి. అవి అన్ని సందర్భాలను చూచుకొనిదే అప్పు ఇవ్వజాలవు.

పరిశ్రమలు తక్కువగా ఉన్న దేశాలు తరచు అమెరికన్ ఇంజనీర్ల సహాయంతో ఆచరణ సాధ్యమైన పద్ధతిగా ప్లానులు రచించుకుంటున్నాయి. ప్లానులను ఆచరణలో పెట్టగల ధనం, యంత్రాలు, సాంకేతిక నిపుణులు లభించినప్పుడే ఆ విధంగా చేస్తున్నాయి. అప్పుడే ఆనకట్టలను, ఎరువుల పరిశ్రమలను, రోడ్లను నిర్మిస్తున్నాయి. క్రీస్తుపూర్వం 3,00,00,000 మంది రైతులను పోషించిన ఇరాక్‌లో ఈనాడు వ్యవసాయ పద్ధతులు చక్కబడినట్లయితే తిరిగి లక్షలాది ప్రజలు క్రొత్తగా వ్యవసాయంమీద బ్రతకడానికి చాలినంత బంగారంవంటి భూములున్నాయని 1946 లో హెర్బర్ట్ హూవర్ అన్నాడు. జోర్డాన్ లోయలో పెద్ద ప్రాజెక్టులను నిర్మించినట్లయితే మధ్యప్రాచ్య దేశాల స్వరూపమే మారిపో గలదని భూసార శాస్త్రవేత్త వాల్టర్ లోడర్ మిల్క్ అన్నాడు. పదిహేను సంవత్సరాలలో నలభైకోట్ల మంది

ప్రజల జీవనస్థాయి ప్రమాణాన్ని వృద్ధిచెయ్యాలని ఇండియా ప్రభుత్వం ఒక ప్రణాళికను తయారు చేసుకొన్నది.

అభ్యుదయ ప్రణాళికలను అమలు జరుపుకొంటూ కొంతవరకు అభివృద్ధిచెందిన దక్షిణ అమెరికా దేశాలు అప్పుడే ముందడుగు వేస్తున్నాయి. మిగతా దేశాలలో పెద్ద ప్రాజెక్టులు మొదలైనవి నిర్మించడానికి చాలాకాలం పట్టగలదు. కాని, వాటి నిర్మాణంమాత్రం తథ్యం. అప్పుడుగాని అవి ప్రపంచానికి ఉపయోగ పడవు.

అందుచేత, ఈలోగా ప్రాజెక్టుల నిర్మాణానికి ధనాన్ని సమకూర్చగల మార్గాలను చూడాలి. పంటలను వృద్ధిచేసే పద్ధతులను అనుసరించాలి. ప్రపంచంలోని సిరి సంపదలకు, సాంకేతిక సంపదలకుకూడా ఒక పరిమితి ఉన్నది. అందుచేత, ఏ ప్రాజెక్టులు ముందుగా అవసరమో వాటినే నిర్మించాలి. ఒకవేళ ఏదైనా ప్రాజెక్టులు నిర్మించబడినప్పటికీ, ఇండియా వంటి బహుగు దేశాలలో అది వెంటనే ఫలితాల నివ్వదు. అర్థ శతాబ్దమైనా గడిచినిదే దాని ప్రయోజనాలు కనుపించవు. ఇతియోపియా, చైనాలవంటి దేశాలలో అయితే ఇంకా ఎక్కువ కాలం పట్టగలదు.

అమెరికాకు సాధ్యమైన ధనాన్నంతనూ, సాంకేతిక నైపుణ్యాన్నంతనూ వినియోగించినప్పటికీ ప్రపంచ దారిద్ర్యాన్ని ఒక్కమాటుగా నిర్మూలించజాలము. అందుచేత, తగుమాత్రంగా ధనాన్ని పెట్టుబడిపెట్టి సాంకేతిక నైపుణ్యాన్ని

అందచేస్తాంటే, ఆ యా దేశాల ఆర్థిక వ్యవస్థలను చక్క దిద్దడానికి సహాయపడిన వారం కాగలము.

నూతన మహత్తర ప్రణాళిక క్రింద ఏ ప్రాజెక్టులను నిర్మించాలో సాధ్యాసాధ్యాలనుబట్టి నిశ్చయించుకుంటే, సుస్థిర రాజకీయ పరిస్థితులలో వాటిని వ్యాపారస్థులు నిర్వహిస్తాంటే, ఫలితాలకు తగినట్లు ధనాన్ని ఖర్చుచెయ్యడం, ఆ పెట్టుబడి తిరిగి చేతికిరావడం జరుగుతుంది.

కొంతవరకు కృషిచేసిన తరువాత ఇక మనం వెనక్కు తెప్పాలో వచ్చునసే ఏకాకితనం పుట్టగలదు. ఈ సత్యాన్ని కాదనలేము. కాని, ఈ తలంపును లొంగిపోతే ఏమవుతుంది?

## ఏకాకి తనము

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో పొరుగు రాజ్యాలపట్ల సౌహార్ద విధానాన్ని అవలంబించ దలచి, నెల ఒకటికి లక్షలాది డాలర్లను దక్షిణ అమెరికా దేశాలకు గుమ్మరించాము. జపాను శరణాగతి అయిన ఆరు నెలల తర్వాత ఆ సహాయంలో చాలాభాగాన్ని విలిపివేశాము. అంతరాయం లేకుండా ఆర్థిక పరిస్థితులు చక్కబడ్డం మీదనే తమ మనుగడ ఆధారపడ్డదని ఆశపెట్టుకున్న పలు దక్షిణ అమెరికన్ ప్రభుత్వాలు 1949 సంవత్సరాంతానికి కూలిపోయాయి.

దక్షిణ అమెరికాలో ఈ విధంగా జరగడం చూచిన వారు, కొన్ని షరతులను కోరనిదే నూతన మహత్తర ప్రణాళిక ద్వారా సహాయం పొందడానికి తొందరపడి

ప్రమాదాలకు గురికా దలచరు. రష్యాతో పెనగులాట సాగినంతకాలం మాత్రమే ఈ సహాయం జరుగుతుందా? రష్యావల్ల ప్రమాదంలేదనే ధైర్యం కలగగానే ఇది నిలిచి పోతుందా?

కమ్యూనిజం ప్రమాద మున్నదనే కారణంచేతనే స్వతంత్ర రాజ్యాలన్నీ సమైక్యమయ్యాయని విన్‌స్టన్ చర్చిల్ చెప్పినమాట నిజం. భయంచేతనే ఒక కూటంగా ఏర్పడిన వారు ఆ భయం తొలగిపోగానే సాధారణంగా వేరుపడి పోగలరు. కూటంగా ఏర్పడిన కాలంలోనే సుస్థిర ప్రాతిపదిక మీద సమైక్యతను సాగించుకోగల ఏర్పాట్లు చేసుకుంటే తప్ప ఆవిధంగా జరుగుతుంది.

మిగతా ప్రపంచంతో జోక్యంలేకుండా అమెరికా ఏకాకిగా వుండాలనే వారు ఇప్పటికీ లేకపోలేదు. అతి విషమ పరిస్థితులలో వారి ప్రభావం పనిచెయ్యలేదంటూ త్రోసి పారవెయ్యడానికి వీలులేదు.

స్థానిక ప్రయోజనాలకు, ప్రపంచ ప్రయోజనాలకు మధ్య సంఘర్షణను నివారించడంకూడా అంత తేలికపని కాదు. అటువంటి సంఘర్షణ ఏర్పడకుండా అమెరికా శతవిధాల ప్రయత్నం చేసింది. కొన్ని పొరపాట్లుచేస్తూ వాటిని సవరించు కొంటూ వచ్చింది. తత్ఫలితంగా దూరదృష్టితో అత్యుత్తమ విదేశాంగ విధానాన్ని రూపొందించుకున్నది. అయినప్పటికీ, ఈనాడుకూడా ఆహార ధాన్యాల ధరలు పడిపోకుండా చెయ్యడానికి సంవత్సరానికి సుమారు నూరుకోట్ల డాలర్లను

ఖర్చు చేస్తున్నది. లాభసాటికాని దిగుమతి నిర్బంధాలను పెట్టడం వలన అది జరుగుతున్నది.

ఈ కారణాలచేత, అమెరికాలో ఆర్థికంగా విషమ పరిస్థితులేర్పడేపక్షంలో ప్రపంచ వ్యవహారాలలో శ్రద్ధ వహించడం మానివేయగలదని అర్థంకాదు. కాని, విదేశాలలో అంతగా జోక్యం కలిగించుకోరాదని గట్టిగా బుద్ధి పుట్టగలదు. నిజానికి, ఇటువంటి వైఖరి అమెరికాలో ఏర్పడగలదని రష్యా భావించి, ఆవిధంగా యుద్ధానంతరం తన విదేశ విధానాన్ని తయారు చేసుకున్నది.

అమెరికా విదేశాలకు సహాయపడడంద్వారా తన అభివృద్ధిని కోల్పోతున్నదని వాదించేవారున్నారు. క్రెమ్లిన్ ఆశించిన పరిస్థితులు అమెరికాలో ఏర్పడేటట్లు చెయ్యడానికి వారి వాదనలు ఉపకరించగలవు. ఆ వాదనలు చేసేవారు హెన్రీ హాబ్లిట్, ఎర్ల్ బ్రౌడర్, కమ్యూనిస్టు పార్టీ సభ్యులు మొదలైన వారు.

అమెరికాలో ఆర్థికమాంద్యం ఏర్పడితే, అది తనసంగతి తను చూచుకుంటే చాలునని ఇంకా చక్కగా వాదించేవారుండవచ్చును. రష్యా మొదలైన గొడవలు తెచ్చే తూర్పు రాజ్యాలతో ఎట్టి సంపర్కం పెట్టుకోకుండా మనం హాయిగా జీవించగలమని వారు వాదించగలరు.

ప్రపంచం రెండు ముక్కలై, తూర్పు భాగమంతా ఆకాశంలోకి ఎగిరిపోయి, మనభాగం యథాప్రకారం సూర్యుడి

చుట్టూ తిరుగుతూ జీవించడం జరిగితే మన కేటువంటిలోపమూ ఉండజాలదని వారు నిరూపించగలరు.

మనంకూడా ప్రపంచంనుంచి వేరుపడ జాలని ఒక భాగంలోని వారమని నిర్ధారణ చెయ్యగల పరిస్థితి ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు. అటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు ఎట్టి నిశ్చయం చేసుకోగలమో ఇప్పటినుంచి అమెరికాలోగల 15,00,00,000 మంది ఆలోచిస్తున్నారు. మనం మానవులము గనుక స్వార్థపరులము కూడా. అందుచేత, యూరపు, ఆఫ్రికా, ఆసియాల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకుండా నిజంగా ఒంటెత్తు వైఖరితో బ్రతకగలమని అక్షరాలా నిర్ధారణ అయితే, మిగతా ప్రపంచం ఏమైపోయినా సరే, మన ఉక్కు తెరను మనమే నిర్మించుకుంటాము. అందుచేత, అమెరికా ఒంటెత్తుగా వుంటే ఏమౌతుందో చూద్దాం.

పంటలను పండించడంలోను, ఉత్పత్తులు చెయ్యడంలోను, వాటిని వాడుకోనడంలోను అమెరికాను మించిన దేశం లేదు. అమెరికాలోను, దాని పరిసరాలలోను ఉన్నన్ని ఖనిజాలు, యంత్రాలు మరెక్కడా లేవు.

నిజానికి, అనేక రంగాలలో అమెరికా ఇప్పుడిప్పుడే తన ఖనిజ సంపదలను బయటకు తీయ నారంభించింది. భూసారం ఏమాత్రం తగ్గకుండా ఆధునిక పద్ధతులద్వారా పంటలను రెండింతలు పండించగలమని 1938లో వ్యవసాయ శాఖవారి "ఇయర్ బుక్"లో తెల్పబడింది. యుద్ధకాలంలో అదనంగా 3,00,00,000 ఎకరాలలో పంటలు వేశాం. తద్విధంగా

అంతకు పూర్వాంకంటె మూడవవంతు ఎక్కువగా పంటలు పండినాయి. ఈ విధంగానే ఆధునిక పద్ధతులను అనుసరించడం వలన 1954 నాటికి నూటికి ఇంకా 20 వంతులు పంటలు వృద్ధి కాగలవని అంచనా వెయ్యబడింది. పంటలు ఈ విధంగా వృద్ధి అవుతున్నాయి గనుక, తూర్పు దేశాల అవసరం ఏమున్నదనుకోవచ్చు. కాని, అది కాదు.

అమెరికా పరిశ్రమలు 1861 నుంచి 1941 వరకుగల ఎనభై సంవత్సరాలలో ప్రపంచం కని విని ఎరుగనంతగా వృద్ధి అయాయి. ఆ తరువాత నాలుగు సంవత్సరాలలో ఉత్పత్తులు రెండింతలయాయి. ఈ విషయాన్ని బట్టికూడా తూర్పు రాజ్యాల అవసరం మనకేమీ లేదనిపిస్తుంది.

అమెరికాలో లభించని ఖనిజాలలో సగం భాగం మన ఖండంలోనే లభించగలవు. బాల్ బేరింగులకు, తుపాకి తూటాలకు, బ్యాటరీలకు అవసరమైన యాంటీమొనీలోహం పెరూ, మెక్సికో, బొలీవియాలలో లభిస్తుంది. తగరంలోని ప్రధాన వస్తువు బాక్సైట్ లోహం బ్రిటిష్ గయానాలోను, డచ్ గయానాలోను లభిస్తుంది. చిలీ, పెరూ, క్యూబాలలో రాగి లభిస్తుంది. కెనడా, కొలంబియాలలో ప్లాటినం లభిస్తుంది. మోటారుకారులను, విమానాలను, రైలు పెట్టెలను, ఓడలను నిర్మించడానికి ముఖ్యావసరమైన టిన్ను బొలీవియాలో లభిస్తుంది. బొలీవియా, పెరూలలో టంగ్‌స్టెన్ లభిస్తుంది. ఈ మధ్యనే తగినన్ని మాంగనీస్ గనులు బ్రెజీల్‌లో కనుగొనబడ్డాయి. మరికొన్ని తక్కువ రకం లోహపు గనులు

అమెరికా పశ్చిమ రాష్ట్రాలలో ఉన్నాయి. కోబాల్ట్, క్రోమైట్‌లు సయితం తగినంతగా ఇడాహో రాష్ట్రంలో ఉన్నాయి.

పోతే, ముఖ్యమైన ఆహార పదార్థాలలో అనేకం అమెరికాలో పండనే పండవు. కాని, అవన్నీ అమెరికా దక్షిణాన గల దేశాలలో పండుతాయి. అరటిపండ్లు, కాఫీ, టీ, కర్పూరం, నూనెలు, క్వైనైన్ మొదలైనవి దక్షిణ అమెరికా రాజ్యాల సొత్తు. అమెరికాలో లభించని కొన్ని వస్తువులను కృత్రిమంగా తయారు చెయ్యడానికి, లేదా వాటిస్థానే వినియోగించగల వస్తువులను కనిపెట్టడానికి శాస్త్రవేత్తలు పరిశోధనలు చేస్తున్నారు. రబ్బరు విషయంలో కృత్రిమ నిర్మాణ పద్ధతిని ఇదివరకే కనుగొన్న రీతిగా, మిగిలిన వాటిలోకూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఉష్ణదేశాలలో తప్ప పండని పంటలను సయితం అమెరికాలో పండించడానికి శాస్త్రవేత్తలు పరిశోధనలు చేస్తున్నారు.

మన ఉత్పత్తులు పెరుగుతున్న కొలది జీవనవ్యయ ప్రమాణాలను, వస్తువుల వాడకాన్ని ఏ విధంగా పెంచగలము? అందుకైనా ప్రణాళికలను రచించుకోవాలి. ప్రభుత్వము, కార్మికులు, వ్యవసాయదారులు ఒక ప్రణాళికప్రకారం ఆచరించాలి.

మనకు గల ఖనిజసంపదలనే మనం వినియోగించుకుందా మంటే, ప్రతిదినం ఎన్ని సరకులను వాడుతున్నామో లెక్క లేదు. మన ఖనిజసంపదలు తరిగి పోతూవుంటే వాటికి బదులు

కొత్త ఖనిజాలు లభించేమార్గం లేదు. గత 50 సంవత్సరాలలో అమెరికాలో ఉత్పత్తి అయిన ఖనిజాల ప్రమాణంతో అంతకు పూర్వం ప్రపంచంలో ఉత్పత్తి అయిన ఖనిజాల మొత్తం ప్రమాణం సాటిరాదు. మనం ఉత్పత్తిచేసిన ఖనిజాలను మనమే వాడుకున్నామని అర్థం. ఆ ఖనిజాలన్నీ గతించినట్లే గదా. ఉత్తమరకం ఇనుము సప్లయి తగ్గిపోతున్నది. గనులనుంచి ఉత్తమరకం ఇనుము 34 సంవత్సరాలవరకు, జింక్ లోహం 19 సంవత్సరాలకువరకు, కాడ్మియమ్ 16 సంవత్సరాలవరకు, సీసం 12 సంవత్సరాలవరకు సరి పోగలదని 1949 లో గనుల కార్యాలయంవారు అంచనా వేశారు. యాంటిమొనీ, టంగ్స్టెన్, ప్లాటినం, పాదరసము ఇవి అయిదు సంవత్సరాల వరకు కూడా మన గనులలో లభించవని అంచనావెయ్యబడింది.

ఇదివరలో మన ఖనిజసంపద సాటిలేనిదే కావచ్చు. కాని, తూర్పు రాజ్యాలనుంచి కొన్ని కీలకపదార్థాలు వచ్చి వుండకపోతే ఇన్ని పరిశ్రమలను స్థాపించగలిగే వాళ్లం కాదు. పెట్రోలు పరిశ్రమలకు, రసాయన పరిశ్రమలకు ముఖ్యావసర మైన మిశ్రమజాతి ఉక్కులోహాన్ని తయారు చెయ్యడానికి కావలసిన క్రోమైట్‌లోహం రష్యా, టర్కీ, దక్షిణరొడీషియాల నుంచి వస్తుంది. కోబాల్ట్ కోసం ఇప్పటికీ బెల్జియన్ కాంగో, ఉత్తర రొడీషియా, ఫ్రెంచి, మొరాకోలమీద ఆధారపడ్డాము.

ఈనాడు మనం దిగుమతి చేసుకుంటున్న సరకులలో నూటికి 67 వంతులు ముడిపదార్థాలు. మన పరిశ్రమలు సాగ

డానికి అవి అవసరం. ఒక్కొక్క విషయంలో అతిస్వల్పంగా దిగుమతి అయే సరకుకూడా పెద్ద పరిశ్రమ సాగడానికి ఉపకరిస్తుంది. ఉదాహరణకు, విదేశాలనుంచి సాలీనా 1,50,00,000 డాలర్ల విలువకు దిగుమతి అవుతున్న సువాసన ద్రవ్యాలవల్ల పది పెద్ద ఆహారపదార్థాల పరిశ్రమలు నడుస్తున్నాయి. వాటిలో 5,00,000 మంది పనిచేస్తున్నారు.

ఇవన్నీ అలావుండగా, మన విదేశ వాణిజ్యంవలన కలుగుతున్న ఆర్థిక ప్రయోజన మెంత?

1947 మొదటి ఆరు నెలల్లో రైతులకుగాక 25,00,000 మందికి ఎగుమతులవల్ల పనులు లభించాయి. అంటే, కార్మికుల సంఖ్యలో వారి సంఖ్య నూటికి 5.6 అన్నమాట. 1939 లో ఆ విధంగా పనులలో వున్నవారు దానిలో సుమారు మూడవ వంతు మంది. వారిలో అధిక సంఖ్యాకులు ఉక్కుపరిశ్రమల లోను, బొగ్గు గనులలోను, యంత్రాలను తయారుచేసే పరిశ్రమలలోను పనిచేశారు.

పోతే, 1947 లో అమెరికా ధాన్యాలలో సుమారు పదవవంతు ఎగుమతి అయాయి. వ్యవసాయదారుల ఆర్థిక వ్యవస్థ చక్కబడాలంటే ఈనాడు ఇంకా ఎక్కువగా ఎగుమతి చెయ్యాలి. 1930 తరువాత అమెరికా వ్యవసాయ పద్ధతులు అభివృద్ధి అయాయి. తత్ఫలితంగా ఈనాడు మనం వాడు కొంటున్న ధాన్యాలకంటె నూటికి 25 వంతులు ఎక్కువ పండిస్తున్నాము. అందుచేత, వాటినన్నింటినీ మనం తిన్నైనా

తినాలి; పండించడమైనా మానివెయ్యాలి; నాశనమైనా చెయ్యాలి; విదేశాలకైనా పంపాలి.

అమెరికాలో ఆర్థికమాంద్యం ఏర్పడిన కాలానికి పూర్వం సయితం మన ప్రత్తిలో సగానికిపైగా, గోధుమలో అయిదవ వంతు, పొగాకులో అయిదింట రెండు వంతులు, యాపిల్ పళ్ళలో ఆరవవంతు, ఎండు పళ్ళలో అయిదింట రెండు వంతులు, డబ్బా పళ్ళలో అయిదింట ఒకవంతు, వ్యవసాయపు పనిముట్లలో అయిదవ వంతు విదేశాలలో అమ్ముకొన్నాము. మనము నిర్మించిన టైపురైటర్లలో నూటికి నలభై వంతులను, అచ్చు యంత్రాలలో నూటికి 30 వంతులను, మోటారు కారులలో నూటికి 14 వంతులను ఎగుమతి చేశాము. కొన్ని సరకులను ఈనాడు మరీ ఎక్కువగా ఎగుమతి చేస్తున్నాము.

మన ఎగుమతులు తగ్గిపోయి నట్లయితే, పెద్ద పెట్టున ఉత్పత్తులు కాజాలవు. నిరుద్యోగులు ఎక్కువమంది కాగలరు. కొనుగోలు శక్తి పడిపోతుంది. ధరలు పడిపోతాయి. ఈ నాటి అమెరికన్ వ్యాపారస్థుల భయం ఇదే.

సరకులను ఎగుమతి చెయ్యడానికి దిగుమతులు కూడా వుండాలి. అమెరికన్ వస్తువులను విదేశాలు కొనడానికి మనం ఎల్లప్పుడు డాలర్లను సప్లయిచేస్తూ వుండజాలము. ఆ డాలర్లను విదేశాలు సంపాదించుకో గలగాలి.

అమెరికా ఎగుమతి దిగుమతులవల్ల 1914–1949 మధ్య మనకు విదేశాలు చెల్లించవలసిన ధనం 1,01,00,00,00,000 డాలర్లని యూరప్ సహకార కార్యాలయంవారు అంచనా

వేశారు. కాని, ఆ దేశాలంలో విదేశాలకు అమెరికా ప్రభుత్వం 68,00,00,00,000 డాలర్లను గ్రాంట్లుగాను, ఋణాలుగాను సహాయం చేసింది. ఆ ధనంలో చాలాభాగం ఇప్పటివరకు చెల్లించబడలేదు. ప్రయివేటు వ్యక్తులు 10,50,00,00,000 డాలర్లు పంపారు; అంతే ధనం వ్యాపారస్థులు పెట్టుబడి పెట్టారు; 15,50,00,00,000 డాలర్ల బాకీలు కొట్టివెయ్యబడ్డాయి; ప్రపంచ బ్యాంకి 1,00,00,00,000 డాలర్లను అప్పుగా ఇచ్చింది. వీటినిబట్టి అమెరికా దిగుమతులకంటె ఎగుమతులు ఎక్కువగా జరగడానికి పన్నులు చెల్లించిన ప్రజలు, వ్యాపారస్థులు తమకు తెలియకుండానే ఆర్థిక సహాయం చేశారన్నమాట.

నిజా నిజాలు ఇలావుండగా, దిగుమతులవలన మన ఉత్పత్తులకు ప్రమాదమనీ, ఎక్కువ జీతాలు పొందుతున్న అమెరికన్ కార్మికులు విదేశాలలోని తక్కువ జీతాల కార్మికులతో పోటీ పడజాలరనీ విమర్శించబడింది.

నిజానికి మన కార్మికులు శిక్షణలో ఇతర కార్మికుల కంటె ఉత్తములు. విదేశాలలోని కార్మికులకంటె వీరే మంచి ఇళ్లు గలిగి, మంచి ఆహారం పొందుతున్నారు. ఏ ఇతర దేశంలోను లేనంతగా ఉత్పత్తులు చేస్తున్నారు. గత 75 సంవత్సరాలుగా మన దిగుమతులకంటె ఎగుమతులు ఎక్కువగా వున్న విషయమే మనం విదేశాలతో పోటీ చెయ్యగలమని రుజువు చేస్తుంది.

ఈ నాడు అమెరికాకు విదేశాలనుంచి ముడి పదార్థాలు ఎగుమతి కాకపోతే అనేక నిత్య జీవితావసర వస్తువులకు కొరత రాగలదు. ప్రజలకు ఎక్కువగా అసౌకర్యాలు కలుగ గలవు. అనేకమంది ప్రజలకు కలిగేవన్నీ అసౌకర్యాలే అయితే, బానిసత్వం వేరే వుండదు. తత్ఫలితంగా యుద్ధం సంభవిస్తుంది. వీటి నన్నింటినీ దృష్టిలో వుంచుకొని అమెరికా తన భావి కార్యక్రమాన్ని నిర్ణయించుకోవాలి.

ఇంతచేసినా, మనం ఏకాకిగా మనలేము. ఇంకా ఇతర రాజ్యాలు వుంటూనే వుంటాయి. అవి మనతో సంపర్కం కలిగించుకోవాలని పెద్ద ప్రయత్నాలు చేస్తూండగా, మనం మరింతగా తీవ్రమైన కంట్రోల్సు ప్రయోగించడం తప్పనిసరి అవుతుంది. ప్రభుత్వం నిరంకుశత్వాన్ని వహించడం జరుగు తుంది. నిరంకుశ ప్రభుత్వం హింసాపూరిత ప్రభుత్వమని నిర్వచనం. మిగతా ప్రపంచంతో సంబంధంలేకుండా ఒక జాతిని కట్టి పడవేయడానికి హింసాకాండ అవసర మౌతుంది.

రష్యా యావత్తు శాంతి ప్రియుల దేశంగా తయారు కాగల అద్భుతం జరిగినదనుకొంటే కూడా, అమెరికాను సర్వసమృద్ధిగల దేశంగా చెయ్యడానికి పెద్ద ప్రయత్నం జరిగితేకూడా యుద్ధప్రమాదం తొలగిపోదు. ఎందువల్లనంటే, ప్రపంచంలోని మూడింట రెండువంతుల భాగంలో యుద్ధానికి అనువగు వాతావరణం ఏర్పడుతూంది. రష్యావున్నాసరే, పోయినాసరే ఎక్కడైతే దారిద్ర్యం తాండవిస్తుందో అక్కడ

కమ్యూనిస్టులో, వారితో తుల్యమైన వారో బయలు దేరుతారు. అమెరికా నాయకత్వం, సహాయం లేకపోతే ఈనాడు సగం ప్రపంచం కమ్యూనిస్టులతో చేతులు కలిపి వుండవచ్చు.

అయితే, అమెరికా అనుసరించవలసిన మార్గం అంత సుగమమైనది కాదు. యథేచ్ఛగా వాణిజ్యం జరగడానికి మనం అమిత సహనంతో, పట్టుదలతో కృషి చెయ్యాలి; మనకు సమ్మతంగాని షరతులు విధించబడిన సందర్భాలలో సయితం మనం సహకారేచ్ఛను చూపాలి; మన దేశంలో ప్రయోజనాలను సయితం వదలుకొని తగినంత ధనాన్ని విదేశాలకై ఖర్చు చెయ్యాలి; విదేశాలలో పరిశ్రమలను వృద్ధిచెయ్యాలి. అవి మన సరకులతో పోటీచెయ్యగల వాటిని తయారు చెయ్యవచ్చు; అది తప్పదుకూడా. అయినప్పటికీ, విదేశ పరిశ్రమలకు సహాయపడడం ముఖ్యావసరం. మన తక్షణ ప్రయోజనాలను ప్రధానంగా ఎంచవద్దు. తత్ఫలితంగా ఇతరులుకూడా అదేవిధంగా చెయ్యగలరని ఆశించుదాం.

ఒంటెత్తుగావున్న రోజులే బాగున్నాయని మనం గతాన్ని గురించి తలచుకోవచ్చు. కాని, మనం తిరిగి ఆ విధంగా చెయ్యరాదు. ఎందుకంటే, ఈనాడు స్వతంత్ర సౌభాగ్యాలతో వర్ధిల్లుతున్న అమెరికా, ప్రపంచాన్ని కాపాడ గలిగితే, స్వతంత్ర సౌభాగ్యాలతో వర్ధిల్లగల ప్రపంచం మనలను రేపు కాపాడగలదు.

*

41

# పరిశ్రమలో - పస్తులో

బడుగు దేశాలలో ఆహారధాన్యాలకు, జనాభా పెరుగుదలకు ఈ నాడు కనిపిస్తూన్న తేడా, ఆ దేశాల ఆర్థిక, సాంఘిక వ్యవస్థల లోపమూ లేక, సహజంగానే వారావిధంగా బాధపడుతున్నారా? ఆ దేశాల్లోని సాంఘిక, ఆర్థిక వ్యవస్థల అభ్యుదయలోపమే వారి బాధలకు కారణమయినట్లయితే, ప్రపంచంలోని ఇతర దేశాల్లోని ఆర్థిక, సాంఘిక వ్యవస్థల స్థాయికి నాటిని అభివృద్ధిచేసే మార్గాలేమీ లేవా?

ప్రస్తుతం సాగవుతున్న భూముల్లో ఇంక ఎంత ఎక్కువ ఆహారధాన్యాలు పండించవచ్చు?

ప్రస్తుతం ప్రపంచమందంతటా 70,00,000 చదరపుమైళ్ళు, అంటే సుమారు 4,00,00,00,000 ఎకరాలభూమి సాగవుతూంది. తత్ఫలితంగా మన అందరికీ బ్రతకడానికి సరిపోయే ఆహారం మాత్రం లభిస్తూంది. అయితే, ఇప్పటి లెక్క ప్రకారం మనమందరం కడుపునిండా తిండితినాలంటే ఇప్పటి కంటె ఒకటిన్నర రెట్లు ఎక్కువగా పంటలుపండాలి.

ఏటేటా పంటలను మార్చి పండించడంవల్ల ఇప్పటి పంటలతోనే ప్రపంచంలోని వారందరికి పుష్టికరమైన ఆహారం సప్లయిచేసి పస్తులు, బాధలు తప్పించ వచ్చునని ఆహార శాస్త్రవేత్తల అభిప్రాయం. మనం తినే ఆహారాన్నిబట్టి ఎంత తినవలసిందీ నిర్ణయం కావలసి ఉంటుంది.

పై విషయం చక్కగా తెలియడాని కొక ఉదాహరణ చెపుతాను. యుద్ధకాలంలో యూరప్ దేశాల కొక నౌక

నిండా ఆహార పదార్థాలు పంపించాలని మిత్రసంఘం వారనుకొని, పుష్టికరమైన ఆహారం అక్కడివారికి లభించే టందుకుగాను ఆ ఓడలో ఏమేమి పంపితే బాగుంటుందని మసాచుసెట్స్ సాంకేతిక కేంద్రంలోని ఒక శాస్త్రవేత్తను సలహా అడిగారు. ఆయన వారంరోజులపాటు ఆ విషయం ఆలోచించి అదే నౌకలో మామూలు ఆహార పదార్థాల కన్న నూటికి 50 వంతు లెక్కువ పుష్టికరమైన ఆహార పదార్థాలు పంపవచ్చునని తేల్చాడు.

ప్రపంచంలో ఇప్పుడు పండే పంటలన్నింటికీకూడా పై విధంగా పుష్టిచేకూర్చ గలిగితే, ఒక్క గింజ కూడా ఎక్కువగా పండించకుండానే ఇప్పటి ఆహార కొరతను పరిష్కరించవచ్చు.

ప్రపంచ జనాభా కంతటికీ సరిపోయే పంటను పండించడం ముందెప్పుడో కాని సాధ్యంగాని విషయం. ప్రజలు ఇప్పటి అలవాట్లను బట్టి ప్రపంచ మానవాళికంతటికీ సరిపోయే ఆహార పదార్థాలు సప్లయి చెయ్యాలంటే పంటలను నూటికి 50 వంతులు ఎక్కువ ఉత్పత్తి చేయవలసి ఉంటుంది. మరి, ప్రస్తుతం సాగవుతున్న 70,00,000 మైళ్ళ భూమిలో అంత అదనపు ఫలసాయం తీయడం సాధ్యపడగలదా?

హార్వర్డ్ భూగర్భ శాస్త్రవేత్త, ప్రపంచ వస్తుసంపద వివరాలు బాగా తెలిసినవాడు అయిన కర్ట్‌లీ ఎఫ్. మాథర్ పై విషయం సాధ్యపడేదంటున్నాడు. కడచిన పాతికేళ్ళలో జనాభాతోపాటు పంటల నెక్కువగా పండించే సాధనాలు

కూడా ఎక్కువైనాయని ఆయన అభిప్రాయం. 1900 వ సంవత్సరంలో అమెరికాలో ఎకరానికి సగటున 60 బుషెల్సు పంటపండిన భూమిలో ఈనాడు మేలిరకపు విత్తనాలు నాటడం వల్ల 100 బుషెల్సు పండుతూంది. యాభై యేళ్ళ కిందట అమెరికాలో రైతులు వాడిన మేలిరకం విత్తనాలవల్ల, ఈనాటి మేలిరకం విత్తనాలవల్ల పండే పంటలో సగం మాత్రమే పండింది. ప్రస్తుతం అమెరికాలో ఎకరానికి సగటున 17.9 బుషెల్సు గోధుమలు పండుతున్నాయి. అయితే, ఒక క్షేత్రంలో ఎకరానికి 74.5 బుషెల్సు గోధుమలుకూడా పండాయి. శీతకాలం గోధుమ విత్తనాలవల్ల ఎకరానికి 120 బుషెల్సును తాను పండించినట్టు రష్యా ప్రకటించిన వార్త ఇంకా ధ్రువపడలేదు.

ఇప్పటికే ఎక్కువ పంటలు పండించడంలో చక్కగా ఉపయోగపడ్డ వ్యవసాయ విధానాలను అన్నిప్రాంతాల్లో అమలు జరిపినట్లయితే అమెరికాలో ఇప్పుడు పండే పంటను రెండింతలనుంచి నాలుగింతలవరకు కూడా పెంపొందించవచ్చునని మాథర్ అంచనా వేస్తున్నాడు.

అనేకసార్లు ప్రయత్నించి విఫలులై తుదకు యూరప్ దేశాల్లోని రైతులు భూసార పరిరక్షణ విషయంలో అనుసరిస్తున్న పద్ధతులను ఇతర దేశాలవారిప్పుడిప్పుడే కనుగొంటున్నారు. ప్రస్తుతం ప్రపంచమం దంతటా సాగులో ఉన్న 2,00,00,00,000 ఎకరాల భూమిలో బ్రిటన్‌లో అమల్లో ఉన్న పద్ధతుల్లో వ్యవసాయం సాగించినట్లయితే ప్రపంచం

లోని జనాభా కంతటికీ సరిపడే ఆహారపదార్థాలు పుష్కలంగా లభించగలవని బ్రిటన్ భౌతిక శాస్త్రవేత్త జె. డి. బెర్నల్ అంచనా వేశాడు. ప్రపంచంలోని పంటభూములన్నింటిలో ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయం సాగించి నట్లయితే, ఇప్పుడు ప్రపంచాని కంతటికీ కావలసిన ఆహార పదార్థాలకంటె 20 రెట్లు ఎక్కువగా పంటలు పండించవచ్చునని ఆయన అభిప్రాయం.

అనేక కారణాలవల్ల వ్యర్థమయ్యే పంట నంతటినీ తీసివేసినా ప్రస్తుతపు పంటభూముల్లో ఇంకా ఎన్నో రెట్లు పంట పండించగల అవకాశాలున్నట్లు కనిపిస్తూంది. ఆవిధంగా ఎక్కువ పంటలు పండించినందున భూమి ఉత్పాదకశక్తి తగ్గదు సరిగదా, ఇంకా ఎక్కువ కాగలదు. వచ్చే పదేండ్లలో కేవలం ఆదర్శప్రాయంగాకాక, వాస్తవంగా ప్రపంచ ఆహార ధాన్యాలను ఇప్పటికంటె నూటికి 90 వంతులు ఎక్కువగా పండించడం అవసరమని ఐక్యరాజ్య సమితికిచెందిన ఆహార వ్యవసాయ సంఘం నిర్ణయించింది. ఆ విధంగా చేయగలిగి నట్లయితే ప్రపంచంలోని ప్రతి ఒకరికి రోజుకు కావలసిన (2,600 కెలోరీలు) ఆరోగ్యకరమైన ఆహారం సప్లయి చేయగలం. ఆపని ఏ విధంగా జరగాలనే ప్రశ్నకు సమాధానంగా యుద్ధకాలంలో బ్రిటన్ సాలీనా పండే పంటలను నూటికి 60 వంతులు ఎక్కువ చేయగలిగిందనీ, అమెరికా నూటికి 35 వంతులు అదనంగా పండించిందనీ ఆ సంఘం చెప్తుంది.

ఇప్పటి వ్యవసాయక్షేత్రాల్లో ఆధునిక పద్ధతులను అనుస రించడంవల్ల ఇప్పటి ప్రపంచజనాభా కంతటికీ సరిపడే ఆహార పదార్థాలు లభించగలవని సిద్ధాంతీకరించినంత మాత్రాన సరిపోదు. వచ్చే 50 ఏండ్లలో ప్రపంచ జనాభా ఇప్పటికన్న 5,00,00,00,000 ఎక్కువ కావచ్చు. మరి వారందరికీ సరిపోయే ఆహార పదార్థాలు ఆ యా ప్రాంతాలు సప్లయి చేయగల అవకాశాలను ఏ విధంగా పెంపొందించాలి?

ఈ ప్రపంచంలో 5,20,00,000 చదరపుమైళ్ళ భూమి ఉన్నది. ఇందులో 70,00,000 చదరపు మైళ్ళు మాత్రమే ప్రస్తుతం సాగు అవుతున్నది. ఇటీవలి వరకు మరొక 20,00,000 చదరపు మైళ్ళలో మాత్రమే వ్యవసాయంచేసే అవకాశా లున్నాయని సాధారణంగా అనుకొనేవాళ్ళు మిగిలిన భూమిలో కొంతభాగం చాలా నిస్సారమైందనీ, మరికొంత భాగం ప్రజలకు అందుబాటులో లేదనీ భావించబడేది.

ఇంకా చాలా ఎక్కువభూమిలో వ్యవసాయం చేయ వచ్చునని భూసార శాస్త్రవేత్త లంటున్నారు. 2,45,00,000 చదరపుమైళ్ళు అంటే, భూమిలో సగభాగం వ్యవసాయానికి పనికివచ్చేదే నన్నమాట. అయితే, ఇంతలో అంత భూమిలో వ్యవసాయం చేయడం సాధ్యపడక పోవచ్చు. కాని, నిన్న మొన్నటివరకూ దేనికీ పనికిరాకుండా పడివున్న బీడు రేపు పాడిపంటలతో తులతూగగల ఆధునిక సాంకేతిక పద్ధతులు మనకున్న నన్నమాట మాత్రం నిజం.

ప్రస్తుతం అమెరికా రైతులు ఏటేటా 10,00,000 ఎకరాల కంటే ఎక్కువ భూమిలో అదనంగా వ్యవసాయం చేస్తున్నారు. ఒకవైపు భూసారం తగ్గడంవల్ల సంవత్సరానికి 5,00,000 ఎకరాల భూమి వ్యర్థమవుతున్నా, కడచిన పాతికేండ్లలో అమెరికా రైతులు వ్యవసాయంచేసే భూమి 4,00,00,000 కోట్ల ఎకరాల వరకూ పెరిగిందని హెచ్. హెచ్. ఫ్రాకెన్ "ది అగ్రికల్చరల్ సిట్యుయేషన్"లో వ్రాస్తున్నారు.

ఆధునిక యంత్రాల సహాయంతోనే భూములను కొత్తగా సాగుకు తీసుకు వస్తున్నారు. కొండల్ని చదును చేయడానికీ, అడవులు కొట్టివేయడానికీ గతంలోవలె నెలల తరబడి చిన్న పెద్దలు చెమటోడ్చి పనిచేయ నవసరంలేదు. ట్రాక్టర్లు మొదలైన ఆధునిక యంత్రాలు కొన్నిగంటల్లో ఆ పని చేసేస్తున్నాయి. 1930 లో అమెరికాలోని 58,00,000 వ్యవసాయ క్షేత్రాల్లోని రైతుల్లో 6 వవంతు వారికి మాత్రమే ట్రాక్టరుండేవి. ఇప్పుడో అమెరికన్ రైతుల్లో మూడింట రెండు వంతులకు ట్రాక్టరున్నాయి. బ్రిటన్ వంటి దేశాల్లో యంత్రాల వాడుక ఇంకా చాలా ఎక్కువగా ఉన్నది.

ప్రపంచంలోని పంట భూమిలో 15,00,00,000 ఎకరాల భూమిలో వ్యవసాయం చక్కగా జరగడానికి కారణమైన నీటివసరులుకూడా ముఖ్యమైనవే. నీటి వసర్లు ఎక్కువ చేసినట్లయితే మరొక 30,00,00,000 ఎకరాల భూమి అదనంగా వ్యవసాయానికి లభించగలదు. *

---

* సముద్రపు నీటినుంచి ఉప్పును విరగ్గొట్టి ఆ నీటితో వ్యవసాయం చేసే ప్రయోగాలు ప్రస్తుతం జరుగుతున్నాయి. వచ్చే పదేండ్లలో ఆ

తెలిసిన విజ్ఞానమంతా ఆచరణలోకి రానందున యేర్పడ్డ పెద్ద అఘాతమే ఈ ఆందోళనకు ముఖ్య కారణం. ప్రపంచమందంతటా మొత్తం 50,00,00,000 మంది రైతులున్నారు. వారిలో ఎక్కువమంది నిరక్షరాస్యులు. అందుచేత, వారిలో ఎక్కువమంది సంస్కరణలంటే అనుమానిస్తారు. ఆ అనుమానం పోగొట్టి భూసారం నిలువచేసే పద్ధతులు, ఆధునిక యంత్రాలు వాడ్డంవల్ల కలిగే సత్ఫలితాలు, నీటి సరఫరా సౌకర్యాలు, ఎరువుల ఉపయోగాలు, మంచి పంటలు పండించే పద్ధతులు మొదలైనవాటిని వారికి చక్కగా తెలియచేయడానికి మరొక పదేండ్లకంటె ఎక్కువ కాలమే పట్టవచ్చు. ఈ లోపుగా ప్రపంచ జనాభా పెరుగుతూనే ఉంటుంది. పస్తులెక్కువవుతూనే ఉంటాయి. అభ్యుదయలోపంగల దేశాల విషయంలో మాల్టస్ చెప్పింది వాస్తవమే. వ్యాధిపీడితులు, నిరక్షరాస్యులు, పస్తులుండేవారు ఎక్కువైనకొద్దీ వారిని ఆ బెడదలనుంచి తప్పించగల పద్ధతులు వారికి నేర్పడం కష్టతరము. ఏదో ఒక ప్రళయమే ప్రపంచమందంతటా వ్యాపించి ఈ సమస్యాపరిష్కారానికి మనమేమీ చేయలేని పరిస్థితి ఏర్పడేటట్లుంది.

పెరుగుతూన్న జనాభా బ్రతకడానికి కావలసిన ఆహార పదార్థాలు సప్లయిచేయడానికే శక్తి సామర్థ్యాలన్నీ వినియోగించబడి, తత్ఫలితంగా, ఆధునిక వ్యవసాయ పద్ధతులు

ప్రయోగాల ఫలితంగా సముద్రప్రాంత భూముల్లోకూడా వ్యవసాయం చేయడం సాధ్యపడవచ్చు.

ప్రవేశపెట్టి ఆహార పధార్థాలు ఎక్కువగా తయారుచేయడం సాధ్యపడక పోయినట్లయితే, ఈ సమస్య ఎలా పరిష్కార మవుతుంది? బర్చ్, వోగ్‌లవంటి ప్రముఖులు జనాభాను కంట్రోలు చేసే పద్ధతులను అమలు జరపాలంటున్నారు. వివిధ సంస్కృతులకు చెందినవారు, విభిన్న మతాలవారు, అనేక రకాల ఆర్థిక తరగతులకు చెందినవారు, అనేక జాతులవారు ఉన్న ఇండియావంటి దేశంలో అటువంటి పద్ధతులను జరపడం చాలా కష్టసాధ్యమైన పని. తక్షణ భవిష్యత్తులో జనాభా కంట్రోలు పద్ధతులను జరపడానికి ప్రయత్నించడమే సమంజస మైన పని.

జనన సంఖ్య పెరగడం అనేక విషయాలమీద ఆధారపడి ఉంటుంది. 25 ఏండ్ల వయస్సులో వివాహం చేసుకొనే స్త్రీలకన్న 12 ఏండ్ల బాలికలప్పుడు వివాహం చేసుకొనేవారికి ఎక్కువమంది పిల్లలు పుట్టుతారు. పస్తులు పడుకొనే వారిలో కామం ఎక్కువగా ఉండడం సహజం. జర్మనీ లోని వెట్టిచాకిరీ కేంద్రాలు (కాన్ సెన్ట్రేషన్ కాంప్స్) ఈ విషయంలో చక్కటి ఉదాహరణలు. అక్కడే తినడానికి తగినంత ఆహారం లభించక, బలవంతాన పనిచేసే ఖైదీలు, మనసారా ఇరుగు పొరుగువారితో మాట్లాడే అవకాశం లేని ఖైదీలలో కామం ఎక్కువగా కనిపించింది. చాలీచాలని నిస్సారమైన తిండి తిన్న ఆ తండ్రులకు కలిగిన పిల్లలు పుట్టిన కొద్ది వారాలకో కొద్ది రోజులకో మరణించడం జరిగింది.

అట్లాకాక ఒక్క వివాహ సుఖంతప్ప, మిగతా అన్ని సౌకర్యాలు ప్రజలకు పుష్కలంగా లభించినట్లయితే, జననాల సంఖ్య తగ్గే అవకాశ మున్నది. ప్రజల్లో విజ్ఞాన వికాసం పెంపొంది, వారి స్థితిగతులు బాగుపడి జన్మనిరోధానికి సంబంధించిన విజ్ఞానం వారిలో ఎక్కువైన కొద్దీ, జననాల సంఖ్య తగ్గిపోగలదు.

మానవులు సుఖంగా బ్రతికే అవకాశాలు ఎక్కువై తమ సంతాన పోషణకు కావలసిన సౌకర్యాలెక్కువైన కొద్దీ జననాల సంఖ్య తగ్గుతుంది. పశ్చిమ యూరప్ దేశాల్లోను, అమెరికాలోను 1876–1936 మధ్య యాభై సంవత్సరాల్లో జననాల సంఖ్య సగంకంటే ఎక్కువే తగ్గింది. అయితే, ఆహారం పుష్కలంగా లభించినందువనే జననాలు తగ్గలేదు. పారిశ్రామిక విప్లవం ఫలితంగా పశ్చిమ దేశాల్లో కలిగిన మార్పుల్లో మంచి ఆహారం, మంచి ఆరోగ్యమే ముఖ్యమైతే, జననాలు తగ్గడంకంటె ఎక్కువై వుండవలసిందనడానికి కావలసినన్ని కారణాలున్నాయి.

పరిశ్రమలు పెంపొందిన కొద్దీ ఆ దేశాల్లో మరొక ముఖ్యమైన మార్పు వచ్చింది. పట్టణాలెక్కువయాయి. అక్కడికి వలస వెళ్ళే కుటుంబాల సంఖ్య ఎక్కువైంది. అయితే, యంత్రాలు ఎక్కువగా వాడుకలోకి వచ్చినందున ఒక కుటుంబంలో ఎక్కువమంది ఉన్నందువల్ల కలిగే ప్రయోజనాలకన్న ఇబ్బందులే ఎక్కువయాయి. 150 యేళ్ళ కిందట అమెరికాలో పనిపాట్లు చేసుకొనే వారిలో పదింట 9 మంది

రైతులైనప్పుడు, అయిదు కుటుంబాలకు కావలసిన ఆహార పదార్థాలు సప్లయి చేయడానికి నాల్గుకుటుంబాలు పనిచేయ వలసి ఉండేది. అందుచేత, ప్రతి కుటుంబానికి పిల్లల సంఖ్య పెరగడం అవసరమైంది. గొర్రెలను కాయడం, పాలు పితకడం మొదలైన చిల్లర పనులన్నీ ఆ రోజుల్లో పిల్లలే చేసేవారు. కనుక వారివల్ల అనేక ప్రయోజనాలుండేవి. మరి ఈ రోజుల్లోనో, అమెరికా జనాభాలో అయిదవవంతు రైతులు అమెరికనులందరికీ కావలసిన ఆహార పదార్థాలు, విదేశాల కెగుమతి చేయడానికి కావలసిన ధాన్యాలు కూడా పండిస్తున్నారు. అంతేకాక, పరిశ్రమ లెక్కువ కావడంవల్ల లభించిన (ఫ్యాక్టరీలు మొదలైనవి) ఉద్యోగావకాశాల్లో పిల్లలు నియమించబడరు. ఒకవేళ ఏ తల్లిదండ్రులైనా తమ ఆరేండ్ల పిల్లవాణ్ణి అట్టి పనికి నియమిస్తామన్నా చట్టం ఒప్పుకోదు. ప్రతి పిల్లవాడికీ కనీసం 16, 20 యేండ్లు వచ్చే వరకూ విద్య చెప్పించాలి.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతూన్న సమాజంలో జననసంఖ్య తగ్గడానికి, జనాభా పెరుగుదల ఆగిపోవడానికి మధ్య కొంత వ్యవధి ఉండగలదు. ఎందుచేతనంటే, ఏ పరిస్థితులవల్ల జననాల సంఖ్య తగ్గిపోతుందో, అవే పరిస్థితులవల్ల ఎక్కువకాలం బ్రతకడంకూడా సాధ్యపడగలదు. 12 యేండ్ల వయస్సులో వివాహితయైన స్త్రీకంటె ఇరువైయేండ్ల వయస్సులో వివాహమాడిన ఆమెకు తక్కువమంది పిల్లలు పుట్టవచ్చు. కాని, ఆమె తన సోదరికంటె ఎక్కువకాలం

బ్రతగ్గలదు. డజనుమంది పిల్లలను కన్న స్త్రీకంటె ముగ్గురు పిల్లలను కన్న ఆమె ఎక్కువకాలం జీవించవచ్చు. సుఖ భోగాలతో తులతూగే సంసారంలో పుట్టే పిల్లవాడు తదితర్లకంటె సుఖంగా ఉంటాడు. బాలారిష్టాలన్నింటిని అతడు తప్పించుకొనవచ్చు.

దీనిఫలితంగా జనాభా ఆశ్చర్యకరంగా తగ్గిపోవచ్చు. యూరప్ దేశాల్లో జననాల సంఖ్య రెండువిధాల తగ్గి పోతూండగా వాటి జనాభా మాత్రం నూటికి 60 వంతులు పెరిగింది.

అయితే, జననసంఖ్య తగ్గినకొద్దీ జనాభా పెరుగుదలకూడా తగ్గిపోగలదు. సంవత్సరానికి సగటున 1,000 మందికి 20 మంది పిల్లలు మాత్రమే పుట్టినప్పుడు జనాభా పెరుగుదల పూర్తిగా ఆగిపోగలదు. పశ్చిమ యూరప్ దేశాల్లోను, అమెరికాలోను, ప్రస్తుత మిదే జరుగుతూంది. ఈ శతాబ్దాంతానికి పశ్చిమ యూరప్ అమెరికాలలోని ప్రజల జీవితకాలం ఆశ్చర్యం గొలిపేట్లు పెరగడమేగాక, వాటి జనాభా పెరగడం పూర్తిగా ఆగిపోవడంకూడా జరుగుతుంది.

అలసి సొలసి మానవుడు కన్నుమూసేవరకు ఎక్కువ మందికి ఎక్కువ ఆహారం యంత్రంమాదిరిగా సప్లయి చెయ్యడం అప్పుడు నిరంతరం జరగ్గలదు. మనుష్యులకంటె సులభంగాను, చౌకగాను పనిచేయగల యంత్రాలు లభించ నంతవరకు కుటుంబాల్లోని వారి సంఖ్య పెరగవలసిందే.

ఆవిషయ మలా ఉండగా పరిశ్రమలను సక్రమంగా పెంపొందిస్తే, అందుకు పనికిరాని ప్రాంతమంటూ లేనే లేదు. ఈ విషయంలో ఇండియా చక్కటి ఉదాహరణ కాగలదు.

ఇండియాలో పదేపదే కరువులొస్తున్నాయి. తత్ఫలితంగా కన్నుమూసి తెరిచేలోగా లక్షలాది మరణిస్తున్నారు. ప్రతి దశాబ్దము, ఆ దేశ జనాభా విపరీతంగా పెరిగిపోతూంది. స్పెయిను, పోలెండు, ఇంగ్లండుల జనాభా అంతటి జనాభా ప్రతి పది సంవత్సరాలకూ ఆ దేశంలో ఎక్కువవుతూంది. ఆ దేశంలోని మతాలు, శీతోష్ణస్థితి, బాల్యవివాహాలు మొదలైన వన్నీ ఆ జనాభా పెరుగుదలకు కారణాలు. ప్రజల జీవన ప్రమాణం చాలా తక్కువ. వారి సరదాలుకూడా చాలా పరిమితంగా ఉంటాయి. అక్కడి సామాన్యుని జీవన స్థితి గతులనుగురించి పెన్సిల్వేనియా విశ్వ విద్యాలయంలోని డాక్టర్ ఎస్. చంద్రశేఖరన్ ఇలా అంటున్నారు:

"వారి జీవితం చాలా నిరుత్సాహంగా ఉంటుంది. సంపాదన చాలా తక్కువై, విసుగు పుడుతూన్న మనస్సుకు ఉల్లాసం కలిపించే నిమిత్తం వారు తమ భార్యలతో సంసార జీవితం చేస్తారు. అదొక్కటే వాళ్ళ సరదా. అదే వారి మనస్సును రంజింప చేస్తూంది."

1870 నుంచి 1930 వరకూ ఇప్పటి ఇండియా జనాభా పెరుగుదలకంటె రెండింత లెక్కువగా యూరప్ దేశాల జనాభా పెరిగిన మాట, అదేకాలంలో అమెరికా జనాభా ఇప్పటి ఇండియా జనాభా పెరుగుదల కంటె నాలుగురెట్లు

ఎక్కువగా పెరిగిన మాట నిజమే. అయితే. యూరప్ దేశాల్లోను, అమెరికాలోను ఆరోజుల్లో మరణాలసంఖ్య చాలా తక్కువ కావడంవల్లనే జనాభా అంత పెరిగింది.

ఇండియాలో కూడా పారిశ్రామికోదయం ఫలితంగా గత శతాబ్దంలో జననాలసంఖ్య క్రమంగా తగ్గుతూందని కీర్లీ మాథర్ అంటున్నాడు. 1920-1940 సంవత్సరాల మధ్య కాలంలో ఇండియాలో ఉక్కుపరిశ్రమ అదివరకు కంటే ఐదు రెట్లుగాను, ముడియినుము ఉత్పత్తి ఆరురెట్లుగాను ఎక్కువైంది. యంత్రాలను, దైనందిన జీవితావసర వస్తువులను ఇతోధికంగా తయారు చేయించడం నెహ్రూ ప్రభుత్వం ముఖ్యాశయం. అందుచేత, ఆ దేశంలో పరిశ్రమలు విధిగా పెంపొందగలవు. తత్ఫలితంగా భారతీయుల స్థితిగతులు బాగుపడేదీ, లేనిదీ నిలకడమీాదట తేలవలసిన విషయం. అయితే, పరిశ్రమలు ఆ దేశంలో పెంపొందిన కొద్దీ ఆధునిక పద్ధతు లమల్లోకివచ్చి అక్కడి జననాల సంఖ్య ఇంకా తగ్గగలదనే విషయంమాత్రం నిశ్చయం.

అయితే, ఇండియాలోని వివిధ మత విశ్వాసాలు జననాల సంఖ్య తగ్గడానికి కొంతకు కొంతగా అవరోధం కావచ్చు. కాని, 1820-1940 ల మధ్య జననాల సంఖ్య నూటికి 40 వంతులు తగ్గిన ఇటలీలో కాథలిక్ మతం జననాల సంఖ్య తగ్గడానికి ఎంత అవరోధమైందో ఇండియాలోని మతాలు కూడా అంత అవరోధమే కాగలవు. అదేవిధంగా, అదే కాలంలో అమెరికాలోని కాథలిక్కుల ఆర్థిక పరిస్థితులు,

ప్రొటెస్టెంట్ల ఆర్థిక పరిస్థితులు ఒకే మాదిరిగా ఉన్నా, వారికి పుట్టిన పిల్లల సంఖ్యలో మాత్రం చెప్పుకోతగ్గంత తేడా లేదు.

వచ్చే శతాబ్దంనాటికి ఇండియాలో జనన సంఖ్యకు, మరణ సంఖ్యకు తేడా అట్టే ఉండదనీ, అప్పటికి ఆదేశ జనాభా సుమారు 70,00,00,000 ఉండగలదనీ జీవశాస్త్రవేత్త లంటున్నారు.

అయితే, ఇండియా జనాభా ఆ విధంగా స్థిరపడే సందర్భంలో ఆహారోత్పత్తి సదుపాయాలు పెంపొంది, పరిశ్రమలుకూడా త్వరగా పెంపొందడం మవసరం. గత పాతి కేండ్లనుంచి జననాల సంఖ్య క్రమంగా తగ్గుతూ వస్తూందని మాథర్ చెప్తున్న జపాన్ విషయంకూడా ఇండియాలో లాగానే జరగాలి.

ఇండియా, జపాన్లలో పరిశ్రమ లెక్కువైనకొద్దీ సరిగ్గా పశ్చిమ యూరప్ దేశాల్లో వలెనే జనాభా తగ్గుతూ వస్తూందని జనాభా పెరుగుదల ధోరణిగట్టా బాగా తెలిసిన ప్రముఖ భారతీయ శాస్త్రవేత్త డాక్టర్ రాధాకమల్ ముఖర్జీ అంటున్నారు.

ప్రపంచ జనాభా ప్రస్తుతానికి రెండింతలుగా పెరగడం చాలా అసాధ్యమైన విషయమని మాథర్ ప్రకటించిన అభిప్రాయం ఆ యా దేశాల్లో పరిశ్రమలు పెంపొందే పద్ధతులపై ఆధారపడి ఉంటుంది.

1660 నుంచి 1937 వరకు ప్రపంచ జనాభా పెరుగుదల ఒక వలయాకార రేఖవలె నున్నదని ప్రముఖ అమెరికా జీవ

శాస్త్ర వేత్త రేమాండ్ పెరల్ అంటున్నారు. ప్రస్తుతం జనాభా పెరుగుతున్నా భవిష్యత్తులో తగ్గగలదని ఆయన అభిప్రాయం. ప్రస్తుత ప్రపంచ జనాభా 2,25,00,000 మంది అయినా, వచ్చే 150 యేండ్లలో ఆ సంఖ్య 3,00,00,000 మాత్రమే కాగలదు.

ఆహారకొరంతను, జనాభా పెరుగుదలను పరిశ్రమలు, ఆధునిక పద్ధతులు త్రుటిలో మార్చగల అద్భుతశక్తులని ఎవరూ పొరపడరాదు. ఏ ఒక్క రోజులోనో, లేక ఒక దశాబ్దంలోనో పై సమస్యలను పరిశ్రమలు, ఆధునిక విజ్ఞానము పరిష్కరించలేక పోయినా, అవే నాటికి నిజమైన పరిష్కార మార్గాలు.

అందుకనే చతుర్థసూత్ర కార్యక్రమం. కర్మాగారాల్లో (ఫ్యాక్టరీల్లో) గాక వ్యవసాయ క్షేత్రాల్లో మొదట ప్రారంభ మవుతుంది. అయితే, తుదకు ఆ కార్యక్రమంవల్ల పరిశ్రమలను పెంపొందించలేక పోతే, అది అర్థమే లేని పని కాగలదు. కనుక అభ్యుదయ లోపంగల ప్రాంతాలన్నింటిలో ఆధునిక వ్యవసాయ పద్ధతులు ప్రవేశపెట్టాలి. భూసారం వృథాచేయడం మహా పరాధంగా పరిగణించి, అందుకు కారకులయిన వారిని శిక్షించాలి. అంతటితో సరిపోదు. ప్రజలు ఆరోగ్యంగా బ్రతకగల పద్ధతుల నమలుపరచాలి. అంతేగాక, ఇరాన్‌నుంచి పెరూకు, పెరూనుంచి ఇరాన్‌కు, ఆ రెండు ప్రాంతాలనుంచి ప్రపంచం లోని ఇతర ప్రాంతాలకు రవాణా మార్గాలు పుష్కలంగా ఏర్పాటుచేయ్యాలి. జీవితావసర వస్తువులు ప్రపంచంలోని

ప్రతివారికి సమంగా లభించగల అవకాశాలు కలిపించాలి. ఇన్ని చేసినా, ఆ యా ప్రాంతాల్లోని పరిశ్రమలు స్వయం పోషకంకాగల పరిస్థితులను సాధించలేకపోతే, ప్రయోజనముండదు. అందుచేత, పరిశ్రమలు పెంపొందించడం అంతిమాశయం–చతుర్థసూత్ర కార్యక్రమం మొదటి మెట్టు.

# సామ్రాజ్య తత్వంనుంచి ఈ కార్యక్రమం వరకు మార్పు

బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఒకానొకప్పుడొక యువకునికి 10 డాలర్లు పంపుతూ ఈవిధంగా ఆయన వ్రాశాడు: "ఇంత డబ్బు విరాళంగా నీకిస్తున్నట్లు నేను నటించను. స్వదేశం తిరిగి వెళ్ళిన తరువాత నువ్వు ఏదో ఒక లాభసాటి వ్యాపారం చేసుకొనగలవు. ఆటుతరువాత కొంతకాలంలో నీ అప్పులన్నీ తీర్చివేయగలవు. కనుక ఇప్పుడు నీవలెనే బాధపడుతున్న మరొక నిజాయితీ పరునకు ఈ మొత్తమివ్వడం ద్వారా నా అప్పు తీర్చుకొనగలవని నే నాశిస్తున్నాను. అతడుకూడా అదేవిధంగా ఈ మొత్తాన్ని మరొకరికి ఇస్తాడనీ, చివరికి ఎప్పుడో ఒకప్పుడు ఎవరో ఒక మూర్ఖునిచేతిలో ఈ సొమ్ము నిలిచి పోతుందని అనుకుంటున్నాను."

అమెరికా నూతన మహత్తర ప్రణాళికను అమలు పరుస్తున్నప్పుడు ఫ్రాంక్లిన్ ఆనాడన్న మాటలకు మనం సమ్మతించడం సమంజసం. స్వయం సహాయంవల్లనే మనం ఇంతటి వారమైనామనీ, మనం ఎవరికీ ఏమీ ఋణపడిలేమనీ

మనం తరుచు అనుకొంటూండడం కద్దు. కాని, ఇది నిజం కాదు. అమెరికా స్వాతంత్ర్యమే అడుగంటి పోతుందా అనే భయమేర్పడ్డ రోజుల్లో అమెరికా ఆర్థిక వ్యవస్థకు విదేశ పెట్టుబడి దారులు చాలా సహాయం చేశారు. లూసియానా రాష్ట్రవాసులు దైనందినావసరాలు కొనుక్కోడానికి హాలెండు ప్రజలెంతో సహాయపడ్డారు.

ప్రాచ్య దేశాల్లో పందొమ్మిదవ శతాబ్దంలో వచ్చిన ఆర్థిక ఇబ్బందులవల్ల తదితర దేశాలకు చాలా లాభాలు కలిగాయి. ముఖ్యంగా అమెరికా ఆరోజుల్లో చాలా ప్రయోజనాలు పొందింది. కొంతమంది సాంకేతిక నిపుణులు విదేశాలకు వలసవెళ్ళారు. మరికొంతమంది ప్రాచ్యదేశాల్లో వ్యాపారం చెయ్యడానికి వెళ్ళారు. తత్ఫలితంగా యూరప్ దేశాల వస్తూత్పత్తి, వాటినికొనే వారిసంఖ్య పెరిగింది. ఇటువైపు అమెరికాకూడా తన స్థితిగతుల అభివృద్ధికి చాలా దీక్షతో పనిచేసింది. 1875 లో ఇక మనకు ఇతర్లు చేయగలిగిందేమీ లేదా అనే పరిస్థితు లేర్పడ్డాయి. అప్పుడే యూరప్ దేశాల్లో మరొక కొత్త విపత్తు వచ్చింది. కాగా, యూరప్ దేశాలు తమ వస్తువులను ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, అర్జెంటైనాల కెగుమతిచేసి కష్టంనుంచి గట్టెక్కాయి.

ఈ పరిస్థితు లన్నింటి దృష్ట్యా నూతన మహత్తర ప్రణాళికను మనం పరిశీలించాలి. మధ్య ప్రాచ్యంలో అమెరికన్ వ్యాపారస్థులు పెన్సిలిన్ ఫాక్టరీలు నిర్మించడం, ఇండియా రైలు మార్గాల అభివృద్ధికి అప్పులివ్వడం మొదలైనవన్నీ

మన పూర్వీకుల లక్షణం. అది మనలో కనిపిస్తుంది. వారు కూడా ఇదేవిధంగా ఆరోజుల్లో ఒకదేశంనుంచి మరొక దేశానికి రకరకాల కొత్త వస్తువులతో వెళ్ళుతూండేవారు. వారు గ్రీకులు, అస్సీరియన్లు మొదలైనవారి సంతతివారు. కాని, వారి కిందటితరం పూర్వీకులు మాత్రం బ్రిటిష్‌వారు. నెపోలియన్ యుద్ధాల తరువాతికాలంలో బ్రిటిష్‌వారుకూడా ఇప్పుడు మనమున్న ఆర్థిక పరిస్థితుల్లోనే ఉన్నారు. విదేశాల్లో కొత్తరకం వ్యాపారంచేయడం లాభసాటి విషయమని వారు అనుకొన్నారు. అయితే, అప్పటివారి కార్యక్రమాలకున్న ఈనాటి మన పథకాలు చాలా కష్టమైనవి. ఎందుచేతనంటే, 19 వ శతాబ్దంలో అయితే, ప్రైవేటు వ్యాపారస్థుల విషయాలలో ప్రభుత్వం కలిగించుకునేది కాదు. వ్యక్తిగత ఆస్థులు, వాణిజ్యంలో పోటీ మొదలైనవన్నీ ఆనాడు జరిగేవి గనుక, ఇతర్లను దోచుకోవడంకూడా ఆ రోజుల్లో సంభవమే. విదేశాల్లో వాణిజ్యంచేస్తే లాభాలొస్తాయనే దురాశ ఫలితంగా అనేకమంది పెట్టుబడి దారులు పడిపోయారు. అయితే, అమెరికాలో పరిశ్రమలు మాత్రం శరవేగాన పెంపొందాయి.

గతంలో బ్రిటిష్‌వారు వెళ్ళిన కొన్ని ప్రాంతాల్లో వారికి లాభాలు కలిగాయి. మరికొన్ని ప్రాంతాలవారు చాలా నష్టపడ్డారు. ఈ రెండు రకాల అనుభవాలుకూడా మన చతుర్థసూత్ర కార్యక్రమ నిర్వాహకులకు చాలా ఉపయోగ పడగలవు.

సూర్యుని చుట్టూతా తిరిగే గ్రహాల గమనంవలె గతంలో సామ్రాజ్యవాదం ప్రపంచంలో పెంపొందింది. అది ఈ విధంగా స్పష్టం కాగలదు. ఒక దేశం ఆర్థికంగా బాగుపడి తన ఖర్చులకు పోను ఇంకా కొంత ధనం అదనంగా నిలువ చేసుకొంటుంది. ఆ డబ్బును లాభాలు వచ్చే బడుగుదేశాల్లో పెట్టుబడిగా వినియోగించి, తన వ్యాపారానికి కావలసిన ప్రత్యేక సౌకర్యాలు కలిగించమని తన స్వప్రభుత్వాన్ని కోరుతుంది. అనుకున్నట్లు లాభాలు రాకపోతే, సైనికంగా గాని, మరేవిధంగానైనా సహాయం చెయ్యమని ఆ దేశ వ్యాపారస్థులు తమ స్వప్రభుత్వాన్ని అభ్యర్థిస్తారు. తత్ఫలితంగా ఆ బడుగుదేశాలు ఏదో ఒక విధంగా ఆ దేశం చెప్పు చేతల్లో ఉండవలసి వస్తుంది.

ఇదే పద్ధతిలో అమెరికా కూడా 1875 నుంచి 1925 వరకు వ్యవహరించింది. మనకు కావలసిన రోడ్లు, తదితర రవాణా మార్గాలు, ఓడరేవులు, బ్రిడ్జీలు మొదలైనవన్నీ నిర్మించుకొన్న తరువాత ఆర్థికంగా ఇతర దేశాల్లో పలుకుబడి సంపాదించడానికి మనం ప్రయత్నించాము.

ఆ కాలంలోనే అలాస్కా, పోర్టోరికోలను మనం సంపాదించాం. మెక్సికో, కోస్టారీకా మొదలైన ప్రాంతాలను మన చెప్పు చేతల్లో ఉండేవాటినిగా చేసుకొన్నాం.

అంతటితో అమెరికాకు పొద్దెదురు తిరిగింది. మొదటి ప్రపంచ యుద్ధకాలంనుంచీ ప్రపంచంలో పెరుగుతూవచ్చిన అమెరికా పలుకుబడి అప్పుడు ఇంకా హెచ్చింది. ఒక చెంప

రెండవ ప్రపంచ యుద్ధప్రమాదం తొంగిచూస్తున్నా, మన పలుకుబడి క్రమంగా క్షీణించ సాగింది. క్యూబాకు స్వాతంత్ర్యం వచ్చింది. ఫిలిప్పీన్స్ స్వాతంత్ర్యం పొందింది. పోర్టోరికో, హవాయి, అలాస్కాలు క్రమంగా అభివృద్ధి అయి ప్రత్యేక రాష్ట్రాలనే లక్షణాలు పొటమరించాయి. వాణిజ్యంలో మనతో తీవ్రంగా పోటీచేస్తున్న యూరపు దేశాల్లో మనం చాలా ధనం పెట్టుబడిగా పెట్టాం. తుదకు బడుగుదేశాలను అటు సామ్రాజ్యవాదంలో పరాధీనంగా ఉండే దేశాలుగాగాని, ఇటు వలసలుగాగాని చేసే అవకాశం లేకుండా నూతన మహత్తర ప్రణాళిక అమలు పరుస్తున్నాం. ఇది చాలా ముఖ్య విషయం.

సమ్నర్ వెల్స్ 1920లో డాలర్ డిప్లమసీని విమర్శించాడు. ఆ యా దేశాలలో వాణిజ్య సంబంధాలు పెట్టుకొని, అక్కడి ప్రజల విద్యాసౌకర్యాలు పెంపొందింపచేసి, అటువంటి కార్యక్రమాలకు కావలసిన ధనసహాయం చేయడంద్వారాను, వారికి కావలసిన సాంకేతిక సహాయం పంపించడంద్వారా మాత్రమే అమెరికా ఆశయాలు నెరవేరగలవుగాని, యుద్ధం వల్ల మాత్రంకాదని ఆయన వాదన.

వెల్స్ చెప్పిన కార్యక్రమం అమలుపరచడ మంటే సామ్రాజ్య తత్వాన్ని పూర్తిగా సంస్కరించి దానికొక వినూత్నార్థం కలిగించడమన్నమాట. ఫ్రాన్క్లిన్ డి. రూజ్వెల్టు ప్రెసిడెంటుగా ఎన్నికయి, 1933లో వెల్స్‌ను

విదేశాంగశాఖ ఉపమంత్రిగా నియమించినప్పుడు తన కార్యక్రమం ఆచరణలో పెట్టే అవకాశం వెల్సుకు లభించింది.

ప్రెసిడెంటు రూజ్వెల్టు తన ప్రారంభోపన్యాసంలో ఇలా చెప్పాడు :

"అంతర్జాతీయ రాజకీయాల్లో మనదేశం అందరితోను స్నేహసంబంధాలతో వ్యవహరించడానికి, తన బాధ్యతలు తాను నిర్వహించి, ఇతర్ల హక్కులను గుర్తించే దేశంగాను, తనను తాను గౌరవించుకొని, ఇతర్లను గౌరవించే దేశంగాను తయారుచేయడానికి ప్రయత్నిస్తాను."

ఆటుతరువాత కొన్ని వారాల్లోనే ఆయన ఈ మంచి పొరుగు వైఖరిని లాటిన్ అమెరికాపట్ల అవలంబించాడు. అమెరికా ఇరుగుపొరుగున ఉన్న అన్ని దేశాలతోను సద్భావ సంబంధాలు నెలకొల్పుకొనడమే ఆయన ఆశయం. 1933 లో అఖిల అమెరికా సమావేశం జరిగింది. ఆ సమావేశంలో లాటిన్ తన విరోధ వైఖరిని మార్చుకొని, అమెరికాతో మిత్రసంబంధా లేర్పరచుకొన్నది. ఒక శతాబ్దం కిందట కార్లైల్ హాల్ ఇతర రాష్ట్రాల ఆంతరంగిక వ్యవహారాల్లో కలిగించుకునే హక్కు ఏ రాష్ట్రానికీ లేదన్నాడు. రూజ్వెల్టు ఆ వాదనను సమర్థిస్తూ యుద్ధానికి అమెరికా వ్యతిరేకి అని ప్రకటించాడు. ఆటుతరువాత 5 నెలలకు ప్లాట్ సవరణలు రద్దుచేయబడి, హైటీలోని అమెరికా నౌకా సైన్యాలు విరమించబడ్డాయి. అంతటితో "మంచి పొరుగు సంబంధాల విధానం" పూర్తిగా అమల్లోకి వచ్చింది.

ఆ వైఖరిననుసరించి రెండవ ప్రపంచ యుద్ధంలో దక్షిణ ప్రాంతంలో కొన్ని దేశాల్లో సమ్మకమైన స్నేహితుల నేర్పరచుకొన్నది. అంటే, అమెరికా సామ్రాజ్య తత్వము, డాలర్ డిప్లమసీ అంతరించాయని అర్థం. అంతేగాక, ప్రపంచ మందంతట సత్ప్రవర్తనలుగా వ్యవహరించటంవల్లనే మనకుకూడా శ్రేయస్సు కలుగుతుందని మనం తెలుసుకున్నామన్న మాట. ఫ్రాన్క్లిన్ డి. రూజ్వెల్టు, కార్డెల్ హాల్, సమ్నర్ వెల్స్‌లు ప్రబోధించిన మంచి పొరుగుసంబంధాల నైఖరిలోనే ఇప్పటి చతుర్థసూత్ర కార్యక్రమానికి—నూతన మహత్తర ప్రణాళికకు అంకురాలున్నాయన్న మాట.

## పొరుగువారితో పొత్తు: కార్యక్రమ లక్ష్యం

జీసస్ ఒకప్పుడు కథ చెప్పాడు: "ఒక రైతు పొలానికి వెళ్ళి కొన్ని విత్తనాలు చల్లాడు. వాటిలో కొన్ని బాటలో పడ్డాయి. వచ్చిపోయే జంతువులు వాటిని తిన్నాయి. మరికొన్ని విత్తనాలు రాళ్ళమీద పడ్డాయి. అక్కడ మట్టి ఎక్కువగా లేనందున మొక్కలు మొలిచిన కొద్దికాలానికే అవి మాడి పోయాయి. మరికొన్ని విత్తనాలు ముళ్ళపొదల్లో పడ్డాయి. అందుచేత, అక్కడకూడా మొక్కలు బాగా పెరగలేదు. మరి కొన్ని విత్తనాలు మంచి భూమిలో పడి మంచి మొక్కలు మొలిచాయి. వాటిలో కొన్నింటికి 100 రెట్లు కాయలు, మరి కొన్నింటికి 30 రెట్లు కాయలు కాచినవి."

జీసస్ చెప్పిన కథలోని రైతులవలెనే మనంకూడా ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో ప్రయత్నించాం. మనకు కూడా కొంత పర్రభూమి, కొంతబెట్ట, కొంత మంచి భూమి దొరికింది. ప్రయివేటు వ్యక్తుల కిచ్చిన అప్పుల రూపాన నేమి, ప్రభుత్వ ఋణాల రూపాననేమి, సాంకేతిక సహాయం రూపాన నేమి, మనం గతంలో ఆ యా దేశాలకు చేసిన సహాయం ఫలితాలను గురించి ఈనాడు నూతన మహత్తర ప్రణాళికనమలు పరిచేవారంతకు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. ఈ కార్యక్రమం సక్రమంగా పనిచేసేదీ లేనిదీ మిగతా ప్రపంచం తెలుసుకోవాలంటే లాటిన్ అమెరికాతో మన మవలంబించిన మంచి పొరుగు విధానం ఎంతవరకు జయప్రద మయిందీ పరిశీలించడ మవసరం. మన ఇష్టాయిష్టాల ప్రకారం నూతన మహత్తర ప్రణాళికను అమలు పరచడం లేక, మానుకోడం జరిగేటట్లయితే, ఆ కార్యక్రమ మమలు పరిచే దేశాలవారు దానియందు విశ్వాసముంచి పనిచేయడం సాధ్యంకాదు.

లాటిన్ అమెరికాకు అమెరికా ప్రభుత్వ మొకచెంప ఋణాలిస్తూంటే యుద్ధకాలంలోను, అటు తరువాతకూడా అమెరికా ప్రైవేటు పెట్టుబడిదారులు ఆ దేశంలో పరిశ్రమలు వృద్ధిచేయడానికి మరొక చెంప కృషిచేశారు. ఆ ప్రాంతంలోని స్థానిక వ్యాపారస్థుల సహాయంతో అమెరికా ఇచ్చిన ధనం గుడ్డలు, ఆహారం మొదలైన నిత్యజీవితావసర వస్తువుల నెక్కువగా తయారుచేయడానికి వినియోగించబడ్డది. కంట్రోలు

ధరలు లేనందున మితిమీరిన లాభాలు వచ్చాయి. ధరలు విపరీతంగా పెరిగిపోయినయి. ఎంత ప్రయత్నించినా తయారైన వస్తువులు అక్కడి గిరాకీని తట్టుకో లేక పోయినయి. అర్జెంటైనాలో కూడా 1935లో 4,62,000 మంది కార్మికు లుండగా 1941కి వారిసంఖ్య 8,29,000 వరకు పెరిగింది. అదే విధంగా వారు తయారుచేసిన వస్తువుల విలువకూడా పెరిగింది.

లాటిన్ అమెరికాకు ప్రభుత్వం ఋణాలివ్వడం, ప్రైవేటు వ్యాపారస్థులు ఋణాలివ్వడమేగాక ఆ రోజుల్లో మరొక రకమైన సహకారంకూడా జరిగింది. లాటిన్ అమెరికాలో వ్యవసాయం, ఆరోగ్యం, విద్య మొదలైన వాటిని అభివృద్ధిచేయడానికి కావలసిన సాంకేతిక సహాయంకూడా అమెరికాచేసింది. ఈ విధంగా సహాయం చేసినందున మన ప్రభుత్వం గాని, ప్రైవేటు వ్యాపారస్థులుగాని అదనంగా ఏ మాత్రం శ్రమపడలేదు.

అమెరికా 1938 లో అంతర్జాతీయ సాంస్కృతిక వైజ్ఞానిక సంఘాన్ని నెలకొల్పింది. అందులో ఇప్పుడు 25 దేశాల ప్రతినిధులున్నారు. అమెరికా వ్యవసాయశాఖ ఆ సంఘంద్వారా లాటిన్ అమెరికాలో సహకార వ్యవసాయ క్షేత్రాల నేర్పాటు చేసే విషయంలో అక్కడి ఉద్యోగస్థులకు సహాయం చేయడానికి కొంతమంది వ్యవసాయ నిపుణులను పంపించింది. అమెరికాతో పోటీపడని పంటలను అక్కడ అభివృద్ధి చేయడమే ఆ ప్రణాళిక ఆశయం. దానిఫలితంగా లాటిన్

అమెరికా పంటలెక్కువై అక్కడి ప్రజలు సుఖపడగలరని అమెరికా కాంగ్రెసు ఆశించింది.

అమెరికా రిపబ్లిక్కులలో ఆరోగ్య విద్యా సౌకర్యాలు అభివృద్ధిచేసే విషయంలో పరస్పరసహకార మవసరమంటూ, అటుతరువాత మూడేండ్లకు రమోడిజనీరోలో జరిగిన విదేశాంగ శాఖా మంత్రుల సమావేశం ఒక తీర్మానం చేసింది. రోగగ్రస్తులైన, నిరక్షరాస్యులైన ప్రజలు యుద్ధానికి పనికి రారనే ఉద్దేశంతో అటువంటి పరస్పరసహకార కార్య క్రమం ద్వారా పశ్చిమార్థగోళంలోని వస్తుసంపత్తి అంతా సక్రమోపయోగానికి రాగలదని విదేశాంగ మంత్రులు అనుకొన్నారు.

చతుర్థసూత్ర కార్యక్రమానికి మనం అధిక ప్రాధాన్య మిస్తున్నాం. అంతేకాక, ఆ యా దేశాలు ఆ యా ప్రణాళికల కయ్యే ఖర్చులో ఎక్కువభాగం భరించి వాటిని అమలు జరుపుకుంటే వారికి అమెరికా సాంకేతికంగా సహాయపడగల దంటున్నాం. ఎందుచేతనంటే, మంచి పొరుగు విధానంలో అలా చేసినందువల్ల, సత్ఫలితాలు కలగడంవల్ల, మన ఆర్థిక పరిస్థితులకుకూడా ప్రమాదం రాకుండా ఉండగలందులకు విదేశాల్లో సాంఘికాభ్యుదయానికి వినియోగపడే కార్య క్రమాలకు ధనమిచ్చే అమెరికన్ వ్యాపారస్థులవద్ద రాబడి పన్ను, ఆదాయ పన్ను మొదలైనవి వసూలుచేయకపోవడం ఈ దృష్టితో చూస్తే వాటి విలువ అర్థమవుతుంది. అటువంటి ప్రత్యేక సౌకర్యాలు వారికి కలిగించకపోతే వారాధనాన్ని

సాంఘికాభ్యున్నతికి వినియోగపడని కార్యక్రమాలకు ఉపయోగించవచ్చు. లేదా అసలు తమ ధనాన్ని బయట పెట్టకపోవచ్చు. అందుచేతనే బడుగుదేశాల అభ్యున్నతికి ధనమిచ్చే వ్యాపారస్థులకు డాలర్లు సులభంగా మారకమయ్యే సౌకర్యం, తదితర సౌకర్యాలనిస్తూ, అటు ఆ ధన సహాయంపొందే బడుగుదేశాలతోను, ఇటు అమెరికా ప్రభుత్వంతోను వారు ద్విముఖ ఒప్పందాలు చేసుకొనే ఏర్పాటు చేయడం మంచిదనే విషయం మంచి పొరుగు విధానం ద్వారా మనం తెలుసుకొన్నాం. ఆ యా కార్య క్రమాలలో కొంత అమలు జరుగుతూండగానే మరొక కొంప వారి డబ్బుకు సంబంధించిన ప్రభుత్వ నిబంధనలు మార్చినా, బడుగుదేశాలు వారి డబ్బుకు తగినంత హామీ ఇవ్వక పోయినా, అమెరికన్ వ్యాపారస్థులు తమ ధనాన్ని బయటకు రానివ్వరనికూడా మనకు తెలిసివచ్చింది.

యుద్ధకాలంలో లాటిన్ అమెరికా ఆర్థిక వ్యవస్థ నభివృద్ధి చేయడానికి ఎగుమతి దిగుమతి ఋణాలు చక్కగా ఉపయోగించాయి. ఆ యా దేశాల కవసరమైనప్పుడల్లా అంతులేకుండా అప్పులివ్వడం మన పద్ధతికాదు గనుక, ఏదో తాత్కాలికంగా మాత్రమే పై రకం ఋణాలు బడుగు దేశాలకు లభించడం అంత మంచి సంగతికాదు. అందుచేత, ఇకముందు బడుగుదేశాలకు అమెరికా ప్రభుత్వం అప్పులిచ్చే టప్పుడు ఆ యా కార్యక్రమాలకయ్యే ఖర్చులో సగమో, లేక నాలుగవవంతో అప్పిచ్చే పాత పద్ధతిని తిరిగి ఆచరణ

లోకి తీసుకురావడం సమంజసం. తను దేశంలోగల సదుపాయాలవల్ల బడుగు దేశాలు ఆ కార్యక్రమాలకు కావలసిన మిగతా ధనం సేకరించాలి.

మంచి పొరుగు విధానంద్వారా ఇంకొక విషయంకూడా మనం తెలుసుకున్నాం. పెక్కు బడుగు దేశాల్లో పరిశ్రమల నభివృద్ధి చేయడమంటే విదేశాల దోపిడినుంచి వాటికి విముక్తి కలిగించడ మన్నమాట గనుక, బలవంతాన ఆ దేశాల్లో పరిశ్రమలు నెలకొల్పి ప్రయోజనముండదు. వస్తువులను భారీ ఎత్తున కొనలేని ప్రజలున్న దేశంలోను. వ్యాపారం పుష్కలంగా జరిగే అవకాశాలులేని దేశంలోను, కొనుగోలు శక్తి చాలా తక్కువగావున్న దేశంలోను పరిశ్రమలు పెంపొందించడంతో అక్కడి ప్రజలకు అనవసరమైన బాధలు రావచ్చు.

ఆ యా దేశాల జాతీయగౌరవం పెంపొందించే దృష్టితోగాక, సాధ్యమైనంతవరకు వాటి ఆర్థికావసరాలను పరిష్కరించ గలిగే పరిశ్రమలనే నెలకొల్పాలి. ఇక ఆ దేశాల్లో అసాధారణ పరిస్థితులేర్పడ్డప్పుడు, అక్కడ విదేశీ వ్యాపారస్థులు పరిశ్రమలు నెలకొల్పి ప్రయోజనం ఉండదు. ఎందుచేతనంటే, ఆ అసాధారణ పరిస్థితులు తగ్గగానే వారు ఆ పరిశ్రమల నెత్తివేయగలరు. అలా చేసినందువల్ల 1820 లో బ్రిటిష్‌వారు నిష్కారణంగా లాటిన్ అమెరికాకు పెద్ద మొత్తాలు అప్పుగా ఇచ్చినందువల్ల ఆ దేశానికి ఎంత

ప్రయోజనం కలిగిందో, పై విధమైన పరిశ్రమలు బడుగు దేశాలకు ఇప్పుడంతే ప్రయోజనాలు కలుగగలవు.

ఇంకొక ముఖ్య విషయం. బడుగు దేశాలు కొత్త పరిశ్రమలు నెలకొల్పేటప్పుడు, విదేశాలనుంచి వస్తువులు తెప్పించుకొనేటప్పుడు, తమ దేశానికి ముఖ్యంగా కావలసిన వేమిటో సావధానంగా నిర్ణయించుకోవాలి. లేకపోతే, ఆ ప్రధానమైన వస్తువుల కెక్కువ డబ్బు ఖర్చుచేయడం ప్రజల దైనందిన జీవితావసరాలకు ధనం లేకపోవడం జరిగే ప్రమాద మున్నది.

2 వ భాగం

# తొలిపలుకు

వెనక ముందులు ఆలోచించకుండా, ఇంజనీరింగు ప్రణాళికలకు పెద్ద మొత్తాలు మంజూరు చేయడం వృధాకాగలదు. ఆ యా దేశాల్లో అనుకూల పరిస్థితులు ముందు కలిగించడమవసరం. ప్రపంచ బ్యాంకువద్ద కోటానుకోట్ల డాలర్లున్నా, ఆ యా దేశాల్లో అభ్యుదయ ప్రణాళికల నమలు జరపడం ఇష్టం లేక అది తటపటాయించడంలేదు; మంచి ప్రాజెక్టులు లేక నే. ఒక దేశం 5,00,00,000 డాలర్ల అప్పుకు దరఖాస్తు పెట్టినంత మాత్రాన ఆ డబ్బంతా సద్వినియోగమవుతుందని అర్థంకాదు.

ప్రభుత్వ ఋణాలతోగాని, ప్రయివేటు వ్యాపారస్థులిచ్చే అప్పులతోగాని విదేశాల్లో పరిశ్రమలభివృద్ధి చేసే అవకాశాలీనాడు పరిమితంగా ఉన్నాయి. విదేశీ పెట్టుబడులంటే ఆ యా దేశాలకు గల ద్వేషంవల్ల, కొన్ని దేశాలకు డాలరు మారకం సౌలభ్యం లేనందువల్ల కొన్ని దేశాల్లో ఆరోగ్యం, ఆహారం, బొగ్గు, రవాణా సౌకర్యాలు, ప్రజల కొనుగోలు శక్తి, మంచి పనివారు, ప్రణాళికల నమలు పరచడానికి తగిన సిబ్బంది మొదలైన సౌకర్యాలు లేకపోవడంవల్ల ఆ యా దేశాల పారిశ్రామికాభ్యుదయానికి అంత అనుకూలమైన పరిస్థితులు లేవు.

ఒక దేశంలో ప్రభుత్వ ఋణాల రూపంగాగాని. ప్రయివేటు పెట్టుబడులద్వారా గాని పరిశ్రమ లభివృద్ధి చేయడానికి పైవన్నీ ముఖ్యావసరాలు. అంతేకాక, మంచి

ఇంజనీరింగు ప్రణాళిక లుండాలి. చక్కటి ఆర్థిక విధానాలు కావాలి.

అత్యావసరంగా అమలు జరపవలసిన కొన్ని కార్యక్రమాలు, క్రమంగా అమలు జరపవలసినవి మరికొన్ని ఈ చతుర్థసూత్రి కార్యక్రమంలో ఉంటాయి, మొదటి సంవత్సరం ఆ కార్యక్రమం పరిమితంగానే అమలు జరగ్గలదు. ఎందుచేత నంటే, సాంకేతిక నిపుణులు లేరు. ఇక డబ్బుకూడా పరిమితంగానే ఉన్నది. ఒకవేళ ఈ రెండు విరివిగా లభించినా, కొన్ని దేశాల స్వయంనిర్ణయాన్నిబట్టి వాటిలో ఈ కార్యక్రమం అమలు జరుపబడదు. ఉదాహరణకు, చైనా, రష్యా, తూర్పు యూరప్ దేశాల్లో చతుర్థసూత్ర కార్యక్రమం అమలు జరపబడదు.

ఆయా దేశాల్లోని వారికి సాంకేతిక విజ్ఞానం కలిగించినంత మాత్రాన ప్రణాళికల నములు జరపడానికి అంతా తయారుగా ఉన్నట్లుకాదు. ప్రజల దృక్పథం, వైఖరికూడా మారవలసియున్నది. తొందర తొందరగా అమెరికాలో పరిశ్రమలు వృద్ధిపొందడంతో కలిగిన అనుభవం ద్వారా మనం కొన్ని విషయాలు గ్రహించాము. పరిశ్రమలు పెంపొందడమనేది అటు ఆర్థిక కార్యక్రమమేగాక, ఇటు సాంఘికాభ్యుదయ కార్యక్రమం కూడా. యజమానుల అభివృద్ధికేగాక, సాంఘిక శ్రేయస్సుకు కూడా పరిశ్రమలు ఉపయోగపడాలి. పరిశ్రమ ఎక్కువ చేయడంవల్లకలిగే సత్ఫలితాలను సాధ్యమైనన్ని ప్రాంతాలకు వ్యాపింపచేయడం వాణిజ్యాల్లోకల్లా ఉత్తమమైందనికూడా

మనం గ్రహించాం. ఇవే మనం నేర్చుకొన్న ముఖ్యనిమయాలు. వీటిని ఇతర దేశాలవారికి నేర్పడం ద్వారా పరిశ్రమలు కేవలం మానవ శ్రేయస్సుకు వినియోగపడే విధంగా అభివృద్ధి చేయగలం. ప్రజల ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా, ఆధునిక పరిశ్రమలను వారి మీద రుద్ది, తత్ఫలితంగా దేశంలో నిరంకుశత్వం గాని, అంతర్జాతీయంగా సామ్రాజ్యతత్వంగాని పెంపొందించే ప్రమాదాన్ని నివారించగలము.

నియంతృత్వంలో నయితే, క్రమంగాగాక ఒక్కసారిగా వ్యవసాయం చేసుకునే వారెక్కువగల ఒక దేశంలో భారీ పరిశ్రమలను నెలకొల్పవచ్చు. కాని, ప్రజాస్వామ్యంలో అది తగని పద్ధతి. ఎందుచేతనంటే, భారీ పరిశ్రమలవల్ల ముందెప్పుడో ప్రజలకు ప్రయోజనాలు కలుగుతాయి. అంతేగాని, ప్రజల తక్షణావసరాలైన ఆహారం, గుడ్డలు, ఇళ్ళు మొదలైనవి వాటివల్ల లభించవు. అందుచేత, మొదట చిన్న చిన్న పరిశ్రమలు నెలకొల్పి నిత్యజీవితావసర వస్తువులను పుష్కలంగా తయారు చెయ్యాలి.

అంతేగాక, రైతులు పండించే ధాన్యాదులను అంగడికి తీసుకువచ్చేటందుకు మంచిరోడ్లు వుండాలి. రోడ్లు వెయ్యడం కంటెకూడా ఆ యా వ్యవసాయక్షేత్రాల్లో ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టడం ముఖ్యం. రైతుల ఆర్థిక పరిస్థితులు చక్కపరచకుండా పెద్ద మొత్తాలతో పెద్ద పెద్ద ఫాక్టరీలు నెలకొల్పితే బహుశా ఆ ధనమంతా వృధాకావచ్చు. అంతే

గాక, అటువంటి పనివల్ల తక్షణం కలిగే ప్రయోజనాలకంటే ప్రమాదాలే ఎక్కువ ఉండగలవు.

ప్రపంచంలో సగంమంది బియ్యం వాడుతున్నారు. జపానులో వలెనే ఆసియాలోని మిగతా దేశాలుకూడా అధికాహారోత్పత్తి కార్యక్రమాల ద్వారా వరిపంటను ఎక్కువ చేయగలిగితే, దూరప్రాచ్య దేశాల్లో 13,00,00,000 టన్నులకు బదులు 30,00,00.000 టన్నుల వరి పండగలదు. క్రొత్తరకం విత్తనాలు చల్లడంద్వారా ఆ విధంగా వరిపంట నెక్కువ చేయవచ్చు. మిల్లు ఆడించేపద్ధతులు సంస్కరించడం ద్వారా బియ్యానికి పుష్టి కలిగించవచ్చు.

చతుర్థసూత్ర కార్యక్రమం అమలు జరగడానికి కావలసిన పరిస్థితులు సృష్టించడం వీటన్నింటికంటె ముఖ్యమైన విషయం. ఆ కార్యక్రమం అమలులోకి రాగానే ప్రపంచంలోని వారందరికి ఉద్యోగాలు లభించగలవని ఆశించేవారు అసంతృప్తి చెందగలరు. ఈ కార్యక్రమాని కనుగుణంగా అమెరికన్ వ్యాపారస్థులనే ఆ యా దేశాలకు పంపిస్తున్నారనీ, చాలా నెమ్మదిగా, జాగ్రత్తగా ఆ యా కార్యక్రమాల నమలు జరుపుతున్నారనీ కొందరు మనల్ని విమర్శిస్తున్నారు. కాని, అమెరికన్లకు తెలిసిన సాంకేతిక విజ్ఞానంలో చాలాభాగం వెనుకబడుగుదేశాల్లో ఉపయోగించడానికి వీలులేదనీ, ఆ యా దేశాల అవసరాలు చాలా స్వల్పమైనవనీ, చతుర్థసూత్ర కార్యక్రమం అమలు జరిపే మొదటిదశలో మన సాంకేతిక

విజ్ఞానంలో చాలా తక్కువభాగం మాత్రమే విదేశాల్లో అమల్లోకి రాగలదనీ అలా విమర్శించే వారు విస్మరిస్తున్నారు.

తమ దేశాల్లో పంటల లెక్కువచేసే పద్ధతులుగాని, భూసారాన్ని కాపాడే పద్ధతులుగాని, తమ నీటివనరులను సక్రమంగా ఉపయోగించుకొనే పద్ధతులుగాని, తమ పశు సంపద నభివృద్ధి చేసుకొనే పద్ధతులుగాని, బడుగు దేశాల్లో పెక్కింటికి తెలియనే తెలియవు. అందరు కలిసి తమకు కావలసిన వస్తువులు కొన్నందువల్ల కలిగే ప్రయోజనాలు తెలియచేసేందుకు ఆ దేశాల్లో సహకార సంఘాలు లేవు. అత్యవసరమైన ఉపకరణాలు కొనేందుకు కావలసిన డబ్బు అప్పుగా ఇచ్చే పరపతిసంఘాలూ ఆ దేశాల్లో లేవు. రైతులు పండించిన పంటలను అంగడికి తీసుకు పోవడానికి మంచిరోడ్లు లేవు. ప్రపంచంలో సుమారు 30,00,00,000 మంది మలేరియా వల్ల బాధపడు తూండడంవల్ల వారి శక్తి సామర్థ్యాలు కుంటుపడుతున్నాయి. మరొక 10,00,00,000 మంది రక్త వ్యాధులవల్ల బాధపడుతున్నారు. అనేక చెడ్డవ్యాధులు కారణాన ఏటేటా వేలాదిగా గుడ్డి పిల్లలు పుడుతున్నారు. సుమారు 1,00,00,00,000 మంది నిరక్షరాస్యులు.

అందుచేత బడుగుదేశాల్లో నిరక్షరాస్యత, అనారోగ్యం, పురాతన వ్యవసాయ పద్ధతులు, సాంఘికాచారాలు మొదలైన వాటిని సమూలంగా సంస్కరించే కార్యక్రమ మమలుజరపడం అత్యంతావశ్యకం. కాకపోతే, కొన్ని దేశాల్లో

మాత్రం టెన్నెసీవాలీ అథారిటీ వంటి కార్యక్రమాల నమలు పరచవచ్చు.

అయినప్పటికీ భవిష్యత్తులో చేయవలసిన పనులను గురించిన ఆలోచనలు ఉండవలసిందే. అలాంటివే లేకపోతే బడుగు దేశాలకు తరుణోపాయమే ఉండదు. ఏదో ఒక రోజున మన ఆర్థిక సహాయంతోను, సాంకేతిక సహాయంతోను, వారి కలలు నిజంకావచ్చు. కొన్ని శతాబ్దాల్లో అమల్లోకి రాగల పనుకొన్ని ప్రాజెక్టులు మన సహకారంతో కొన్ని దశాబ్దాల్లోనే అనుభవంలోకి రావచ్చు.

ప్రణాళికల కవసరమైన ధనమంతా సిద్ధంగా ఉంటే, రకరకాల పరిశ్రమలు క్రమంగా అభివృద్ధి చెందక తప్పదు. గతంలో కూడా ప్రజల కులాసానుబట్టే పరిశ్రమలు పెంపొందాయి. నిత్యజీవితావసరాలకు వినియోగపడే పరిశ్రమలు, జాతీయ శ్రేయస్సుకు వినియోగపడేవి చిరకాలం వర్ధిల్లాయి. మిగిలినవి అంతరించి పోయినాయి. అప్పటి ఆర్థిక వ్యవస్థలో ఎన్నిలోపాలున్నా అది చాలా ముఖ్యమైంది. అందుచేతనే బడుగు దేశాల్లో భవిష్యత్తులో పరిశ్రమల నిర్వహణాలో ప్రభుత్వం కంట్రోలు, ప్లానింగు ఉండుట మవసరము. అప్పుడప్పుడు దుందుడుకుగా కొన్ని అననుకూల ప్రాంతాల్లో పరిశ్రమలు నెలకొల్పాలనే వ్యామోహం కలగవచ్చు. ఏమైనా అది చాలా సున్నితమైన విషయం.

అయితే, మన నూతన మహత్తర ప్రణాళికవల్ల పరిశ్రమల నభివృద్ధి చేసే తొలిదశలో సాధారణంగా వచ్చే బాధలను

తొలగించడం సులభం. మన ఆశయాలనే విస్మరించి, ఆ యా కార్యక్రమాలకు సంబంధించిన వివరాలకే ఎక్కువ ప్రాముఖ్య మిచ్చే ప్రమాదంకూడా ఉన్నది. కనుక చతుర్థసూత్ర కార్యక్రమం ఈ రెండు లోపాలను సవరించగల దాన్నిబట్టి అది ఎంతవరకు పనిచేయగలిగిందీ నిర్ణయించ బడవలసి ఉంటుంది.

# దక్షిణ అమెరికా దేశాల సంపదలు

**ద**క్షిణ అమెరికా దేశాలన్నీ చాలా సారసంతమైనవి. ప్రపంచంలోని వివిధ దేశాలకు కాఫీ, కోకో, పంచదార, వెండి, రాగి మొదలైనవెన్నో ఆ దేశాలనుంచి ఎగుమతి అవుతున్నాయి. అమెజాన్ రబ్బరుకు పెట్టింది పేరు. దక్షిణ అమెరికా పశ్చిమతీరాన నైట్రేట్స్ పుష్కలంగా లభిస్తున్నాయి.

దక్షిణ అమెరికా వైశాల్యం 90,00,000 చదరపుమైళ్ళు; సుమారు 15,00,00,000 జనాభా. వారిలో ఎక్కువమంది శ్వేతజాతుల ఇండియన్ల మిశ్రమ సంతతివారు. బ్రెజిల్ వంటి దేశాల్లో మాత్రం నీగ్రో సంతతి ఎక్కువ కనిపిస్తోంది. మరికొన్ని దేశాల్లో అచ్చంగా శ్వేతజాతుల వారే ఉన్నారు.

లాటిన్ అమెరికన్లందరిలో పట్టుదల, కార్యదీక్ష సాధారణ లక్షణంగా కనిపిస్తుంది. ప్రతిచిన్న దేశంకూడా ఒక ఆర్థికాభ్యుదయ ప్రణాళికను, పారిశ్రామికాభ్యుదయ ప్రణాళికను నిర్ణయించుకొని, వాటిప్రకారం పనిచేస్తోంది.

ఆ యా దేశాలన్నింటికి సంబంధించిన అభ్యుదయ కార్యక్రమాలకై ఇప్పుడిప్పుడా దేశాల్లో కొన్ని కలిసి పని చేస్తూన్నాయి. ఉదాహరణకు, కొలంబియా వాణిజ్య నౌకలను తీసుకొందాం. అందులో నూటికి 45 వంతుల భాగం కొలంబియాకు, మరో 45 వంతుల భాగం వెనిజులాకు, 10 వంతులు ఈక్వెడారుకు కలవు. అదే విధంగా ఉరుగ్వేనది నుంచి విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే బ్రహ్మాండమైన కేంద్రాన్ని ఆర్జెంటైనా, ఉరుగ్వే, బ్రాజిల్ దేశాలు కలిసి నిర్మించుకొంటున్నాయి.

లాటిన్ అమెరికనులకు విద్యుచ్ఛక్తి కామధేనువు వంటిది. అందుచేత, అటువంటి కార్యక్రమాల నమలుపరచడానికి దేశ సరిహద్దులను వారెంత మాత్రం లెక్కచేయరు. అందరికీ ప్రయోజనాలుకలిగే ప్రణాళికలను ఆ దేశాలవారందరు కలిసి అమలుజరుపగలరు.

అయినా, ప్రస్తుతానికిమాత్రం ఆ యా దేశాలు తమ అభ్యుదయ కార్యక్రమాలను విడివిడిగానే అద్భుతంగా అమలు జరుపుతున్నాయి: దేశాభ్యుదయంపట్ల వారి కొక ప్రత్యేక తృష్ణ ఉన్నట్లు కనిపిస్తూంది. ఆ విధంగా జాతీయార్థికాభ్యుదయానికి మహత్తర కార్యక్రమాలమలుపరుస్తున్న లాటిన్ అమెరికాదేశాల్లో పెరూను ఉదాహరణగా ఎరల్ పార్కర్ హాన్సన్ పేర్కొంటున్నాడు.

నేషనల్ కార్పొరేషన్ను ద్వారాగాని, ప్రాంతీయ సంఘాల ద్వారాగాని దక్షిణ అమెరికాలోని పెక్కు దేశాలు

తమ జాతీయాభ్యుదయ కార్యక్రమాలనమలు జరుపుతున్నాయి. నిర్మాణంలో ఆ సంఘాలమధ్య అనేక తేడాలున్నా, అవి చేసే పనిమాత్రం ఒక్కటే. అమెరికా ఒక శతాబ్దంన్నరలో సాధించిన వ్యావసాయిక, పారిశ్రామికాభ్యుదయాలను దక్షిణ అమెరికా ఒక తరంలోనే సాధించగలగడమే వాటి ఆశయం.

మొత్తంమీద లాటిన్ అమెరికా దేశాలన్నింటిలో అభ్యుదయ ప్రణాళికలు అమలు జరుగుతున్నాయనేదే ముఖ్యమైన విషయం. ఒక చెంప ఆర్థిక పరిస్థితులు వడిదుడుకుగా ఉన్నా, మరొక చెంప ఆర్థికవేత్తలు, రాజకీయ నాయకులు, తదితర్లు వాటి మంచి చెడులనుగురించి తర్కవితర్కాలు జరుపుతున్నా, వివిధరంగాలలో ఆ యా దేశాల్లో పని వడి వడిగా జరిగిపోతూంది. అడవులను కొట్టివేసి రోడ్లువేస్తున్నారు. ఫ్యాక్టరీలు భుగభుగలతో పొగలు విడుస్తున్నాయి. రైతులు మంచి విత్తనాలు వాడుతున్నారు.

లాటిన్ అమెరికన్ల పాలిటి కామధేనువు అవతరించింది. మెక్సికో, చిలీ, బ్రాజిల్, ఆర్జెంటైనా దేశాల్లోనే 1955వ సంవత్సరానికి 50,00,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి అదనంగా తయారు కాగలదు. తత్ఫలితంగా ఆ యా దేశాలలోని ప్రజలకు ఇదివరకుకన్నా ఆహార వస్త్రాదులు ఎక్కువగా లభించగలవు. దక్షిణ అమెరికా అభ్యుదయానికై చేస్తూన్న శ్రమనుచూచి మనం బెదరినా, ఆ యా దేశాల అభ్యుదయం మాత్రం ఆగదు. ఆపుదామనుకున్నా మనం దాన్ని అరికట్ట లేము.

కాకపోతే, అనుభవంవల్ల మనం నేర్చుకొన్న విషయాలు వారికి నేర్పగలము. ప్రజాస్వామిక సంప్రదాయా లేర్పరచుకొనడంలోను, బానిసత్వం వర్జించి స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసుకొనడంలోను, పరస్పర ద్వేషం పోనాడి, మిత్ర సంబంధా లేర్పరచుకొనడంలోను వారికి మనం సహాయ పడగలం. వారికి అవసరమైన ధన, సాంకేతిక సహాయాలు మనం వారికి చేయగలము. అంతమాత్రాన మనం లేకుండా వారేమీ చేసుకోలేరని మాత్రం మనం భావించరాదు.

## ఆఫ్రికా దేశాల సంపదలు

ఆఫ్రికా అడవుల్లో మానవులను, వారి పశువులను పట్టపగలు నిస్సాక్షికంగా కబళించే రాక్షసి ఒకటుంది. అందుచేతనే సామాన్యమైన ఒక యూరప్ దేశమంత ప్రాంతం నిర్జనమయిపోయింది. ఆ రాక్షసే ట్సెట్సీ ఈగ. అది గుడ్లు పెట్టదు. కాని, తనవంటి ఈగలను మాత్రం తయారు చేస్తుంది. పచ్చిరక్తం త్రాగి అవి బ్రతుకుతాయి. అది కుట్టడమంటూ జరిగితే, ఇక బ్రతకడమనేది కల్ల. ఆ ఈగ కుట్టినప్పుడు ఒక రకమైన విషం మానవుల శరీరం లోకిపోయి వారు క్రమంగా కృంగి, కృశించి, నశించి పోతారు. పశువుల్నే ఆ ఈగలు కుట్టితే, అవి మరుక్షణంలోనే చచ్చిపోతాయి.

ఒకానొకప్పుడు ఆ చీకటి ఖండమంతా ట్సెట్సీ ఈగల బాధవల్ల నిద్రాణమైనట్లు కనిపించేది. ప్రపంచంలోని ఇతర

ప్రాంతాల్లో అనేక మార్పులు వచ్చిన పారిశ్రామిక, ఆధునిక యుగాల్లో ఆఫ్రికాలో రవ్వంత సందర్భైనా లేదు.

కాని, ఇటీవల ఆఫ్రికాకు ఆ నిద్రమత్తు వదిలింది. ఆ చీకటిఖండం ఇప్పుడు నిద్ర లేచింది. కళ్ళు నులుముకొని ఇతర ప్రాంతాల్లో వస్తూన్న పరిణామాలను పరిశీలిస్తూంది.

ట్సెట్సీ ఈగ నిర్మూలనానికి సైన్సులో ఇటీవల కనుగొనబడిన విషయాలు ప్రశంసనీయాలు. మలేరియా నివారణకు "పాలుడ్రిన్" అనే మంచి మందు కనిపెట్టిన ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ కంపెనీవారు ట్సెట్సీ ఈగలను చంపడానికొక తెల్లటి పొడి కనిపెట్టారు. దాని సహాయంతో 1949 లోనే 20,00,000 పశువులు ట్సెట్సీ ఈగ ప్రమాదంనుంచి రక్షించబడ్డాయి. మనుషులకుకూడా ఆ మందు పనిచేసేదీ లేందీ ఇంకా తెలియలేదు. కాని, దాన్ని వాడినందువల్ల ఆఫ్రికా పశుసంపదమాత్రం దినదినాభి వృద్ధిచెందుతూంద.

ప్రపంచంలోని పెద్దఖండాల్లో ఆఫ్రికా రెండవది. అయినా, అందులో మూడవవంతు అడవులు, మరొక మూడవవంతు ఎడారి ఉన్నాయి. మిగతా భూభాగమంతా శీటభూములమయం. ప్రపంచ జనాభాలో నూటికి 75 మంది మాత్రమే ఆ ఖండంలో ఉన్నారు. నూటికి 3 వంతుల వ్యవసాయోత్పత్తులు మాత్రమే అక్కడ తయారవుతున్నాయి. రైలు మార్గాలు, వాణిజ్యం చాలా తక్కువ. కనుక

సక్రమోపయోగానికి తీసుకురావలసిన వస్తుసంపద ఆ ఖండంలో ఇంకా చాలా వున్నది.

దాదాపు ఆఖండమంతా బడుగు ప్రాంతమే గనుక ఆదాయ వివరాలు సరిగ్గా తెలియవు. కాని, ఉత్తర రొడీసియాలో ఇటీవల సేకరించబడిన వివరాలు ఆఫ్రికాలోని ఇతర ప్రాంతాల ఆదాయ వివరాలు తెలుసుకోడానికి కొంతవరకు ఉపయోగించ గలవు.

ఉత్తర రొడీసియాలో 1938 లో 14,000 మంది విదేశీయులు, 14,00,000 మంది ఆఫ్రికన్లు ఉన్నట్లు ఆ లెక్కల వల్ల తేలింది. 14,000 మంది విదేశీయుల ఆదాయం 1,43,20,000 డాలర్లు.

ప్రపంచం మొత్తంలో తయారయ్యే 50,00,00,000 హార్సుపవర్స విద్యుచ్ఛక్తికి కావలసిన నీటిలో నూటికి 40 వంతులు ఆఫ్రికాలో ఉన్నది. దాంట్లో 100 వ వంతు మాత్రమే ఇప్పటికి వాడుకలోకి వచ్చింది. ఆధునిక పరిశ్రమల నభివృద్ధి చేయడానికి కావలసిన వాటిలో పెట్రోలు దక్షిణాఫ్రికాలోని రెడ్ సీవద్ద దొరుకుతూంది. యురేనియమ్ కూడా దక్షిణాఫ్రికాలో ఉన్నది. అయితే దాన్ని పరిశుభ్రం చేసి ఉపయోగించుకొనవలసి ఉన్నది.

అమెరికా పెట్టుబడికై ఎదురుచూస్తున్న ప్రాంతాలలో మధ్య ప్రాచ్యం, ఆఫ్రికా ఖండం ఒకే విధంగా ఉన్నాయని న్యూయార్క్ టైమ్స్ ఇటీవల వ్రాసింది.

ఆ చీకటిఖండంలోకూడా కమ్యూనిస్టులను నిరోధించ వలసి వున్నదనే విషయ మటుంచి, ప్రస్తుత ప్రపంచంలో విదేశీయులు పెట్టుబడిపెట్టి వ్యాపారంచేయ తగినదేశాల్లో ఆఫ్రికా నమ్మకమైంది. ఎందుచేతనంటే, వాణిజ్య పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీనం చేసుకొనే ప్రమాదం అక్కడ కన్పించడం లేదు. అందుచేత, లాభాలు కుప్పలు తెప్పలుగావచ్చే అవకాశా లున్నాయి. 1947 లో దక్షిణాఫ్రికా యూనియన్‌లో 40,00,00,000 డాలర్ల పెట్టుబడితో 3,721 కంపెనీలు నెలకొల్ప బడ్డాయి. ఆ పెట్టుబడిలో ఎక్కువభాగం బ్రిటన్, పశ్చిమ యూరప్ దేశాల వారిదే. 1948 లో దక్షిణ ఆఫ్రికా యూనియన్ ప్రభుత్వం అమెరికా వ్యాపారస్థులవద్దనుంచి 10,00,00,000 డాలర్లు తీసుకొన్నది.

అటు యూరప్ దేశాలవారికి, ఇటు అమెరికనులకుకూడా ఆఫ్రికా మంచి అంగడిగా వినియోగ పడగలదు. వారి పెట్టు బడులకు మంచి లాభాలు రాగలవు. అయితే, పురాతన కాలంలో వలస విధానం పెంపొందించే దృష్టి ఆఫ్రికన్లను దోచుకొందామనే ఆశతో వ్యాపారస్థు లక్కడికి వెళ్లితే వారికి ఆశాభంగం తప్పదు.

అయితే, ముందు వెనుక లాలోచించకుండా ఎంతో మంచి ఉద్దేశాలతో యూరపియన్ దేశాలవా రా దేశంలో అమలు జరిపిన ప్రాజెక్టులు ఆఫ్రికా భవితవ్యానికి ప్రమాదం కావా ? టాంగనీకాలో వేరుసెనగను ఇంకా బాగా పండించడానికి అనుగుణంగా బ్రిటిష్‌వా రమలు జరుపుతున్న

ప్రాజెక్టు పాశ్చాత్య దేశాల్లో ప్రభుత్వం యాజమాన్యాన నిర్వహించ బడుతున్న పెద్ద వాటిలో ఒకటి.

బడుగు దేశాల అభివృద్ధికి ఇదివరకు అమలు జరుపబడిన ప్రాజెక్టులలోకల్లా అది చాలా గొప్పదని లండన్‌లోని టైమ్స్ పత్రిక ఆ ప్రణాళికను ప్రశంసించింది. ప్రపంచానికి కావలసిన నూనెల్లో ఏటేట 6,00,000 టన్నులు తక్కువవుతూంది. బ్రిటనుకే ఇంకా 10,00,000 టన్నుల నూనె కావాలి. ఆ ప్రణాళిక పూర్తయితే 6,00,000 టన్నుల వేరుసెనగ నూనె అదనంగా లభించగలదని అనుకొన్నారు. 1956 వ సంవత్సరానికి టాంగనీకా, కేన్యా, ఉత్తర రొడీసియాలలోని బంజరు భూములు వేరుసెనగ వెయ్యడానికి తగిన భూములుగా తయారు కావలసి యున్నది.

ఆఫ్రికన్‌లకు ఆధునిక యంత్రాలతో వ్యవసాయం చేసే పద్ధతులు నేర్పగలరు. 8,000 ట్రాక్టరలతో ఆ ప్రాంతమంతా కొత్తగా వ్యవసాయానికి లభించ వలసి ఉన్నది.

ఆ ప్రాంతాన్నంతా 107 క్షేత్రాలుగా విడదీసి, ఒక్కొక్క క్షేత్రంలో 30,000 ఎకరాలు కేటాయించాలని అనుకొంటున్నారు. ఆధునిక పద్ధతుల్లో పనిచేసే వ్యవసాయ క్షేత్రాలకు కాయకష్టం చేసే వారు ఎక్కువమంది అవసరం లేదు. 20 మంది సుశిక్షితులైన ఆఫ్రికన్లు, 230 మంది మామూలు పనివారు సరిపోతారు. ఈ 300 మంది ఒక గ్రామంలో ఉంటారు. వారికి కావలసిన పాఠశాల, ఆస్పత్రి మొదలైన సౌకర్యాలన్నీ కలిగించబడగలవు.

ఆ ప్రణాళిక పూర్తయి వ్యవసాయ క్షేత్రాలు నెల కొల్పబడితే, టాంగన్యీకా విదేశాల కెగుమతిచేసే వేరుసెనగ ఎక్కువై వారి నిత్యజీవితావసర వస్తువులుకూడా పుష్కలంగా లభించగలవు. అటు బ్రిటనుకు కావలసిన ముఖ్యమైన ఆహార పదార్థాలుకూడా లభ్యంకాగలవు.

1946 లో ఆ ప్రణాళిక ప్రారంభమైనప్పటినుంచీ ఇప్పటి వరకు ప్రణాళిక సిద్ధాంతానికి, ఆచరణకు తేడా కనిపిస్తుంది. ఆ తేడా ఇంకా ఎక్కువవుతూనే వుందికాని, తగ్గడం లేదు. వేరుసెనగ అయితే బాగానే పండింది. కాని, వాటిని ఇతర ప్రాంతాలకు పంపించకపోతే వాటివల్ల ప్రయోజనం ఉండదు. అందుకేమొ రవాణా సౌకర్యాలు కావాలి. రోడ్లు మొదలైనవి ఇంకా పూర్తికాలేదు. బ్రిటన్‌లో అప్పుడు ఆహార మంత్రిగా పని చేస్తూన్న స్ట్రాచీ 1949 వేసవిలో ఆ ప్రణాళికను గురించి ఇలా చెప్పాడు :

“మనం అనుకొన్నదానికంటె ప్రతీది ప్రియమైంది. పైగా ఆఫ్రికా శీతోష్ణస్థితి చాలా బాధాజనకమైంది. ఆఫ్రికా భూములు ఎంత సారంవేసినా బాగా పండలేదు... మొదట మనం కొన్న వ్యవసాయ యంత్రాలక్కడి పరిస్థితులకు సరిపో లేదు. ఒక్కొక్కసారి ముందర నిర్ణయించుకొన్న భూములకు నీటిసౌకర్యం లేనందువల్ల వాటిని వదలివేయ వలసి వచ్చేది, ఏమైనా ఆ ప్రణాళిక బ్రిటన్ ఆహార సమస్యా పరిష్కారానికి ఉపయోగ పడదని ఇప్పుడు తెలిసి వచ్చింది. ఒకవేళ ఆ ప్రాంతంలో వేరుసెనగ ఎక్కువగా పండినా, తూర్పు ఆఫ్రికా

దాంట్లో చాలావరకు కొనగలదు. ఇంకా మరికొంత మిగిలినా, బ్రిటన్‌కంటె దగ్గర దేశాలు ఆ వేరుసెనగను కొనవచ్చు."

ఒక చెంప బ్రిటన్ లక్షలాదిపౌన్లు ఖర్చుచేసి టాంగనీకాలో ఆ ప్రణాళిక అమలు జరుపుతూంది. మరొక చెంప కానో, నైజీరియాలలో తగినన్ని రైలు మార్గాలుగాని, ఇతర రవాణా మార్గాలుగాని లేక బస్తాలకు బస్తాలు వేరుసెనగ పుచ్చిపోతూంది. ఇంతవరకు జరిగినదాన్ని బట్టి టాంగనీకా వేరుసెనగ అభివృద్ధి ప్రణాళిక విఫలమైనట్లు చెప్పక తప్పదు. అయితే మున్ముందు దాన్ని ఒక దోవకు లాక్కు రావచ్చు. కాని, ఎంతో డబ్బు ఖర్చుపెట్టి, ఎన్నో సంవత్సరాలు పనిచేస్తేనే గాని, దానివల్ల చెప్పుకోతగ్గ సత్ఫలితాలు కలుగుతాయన్న ఆశ లేదు.

బడుగుదేశాల్లో ముందు వెనుక ఆలోచించకుండా దుందుడుకుగా భారీ ఎత్తున ప్రణాళికలు అమలు జరుపరాదనే పై ఉదాహరణ స్పష్టంచేస్తూంది. అదే ప్రణాళిక చతుర్థసూత్ర కార్యక్రమం ప్రకారం అమలు జరిగియుంటే అక్కడిభూసారం ఎటువంటిదీ, పండినపంటను వివిధ ప్రాంతాలకు పంపించడానికి తగిన రైలుమార్గాలు మొదలైనవి వెయ్యడానికి అవకాశాలున్నాయా—ఇటువంటి విషయాలన్నింటినీ సాంకేతిక సహాయ నిపుణులు సావధానంగా పరిశీలించిన తరువాతనే ఆ ప్రణాళికను అమలు జరిపేవారు.

# ఆఫ్రికన్ మధ్యప్రాచ్యం

జిబ్రాల్టర్ జలసంధికి తూర్పుగా 4,000 మైళ్ళు పోతే, ఇండియా సరిహద్దులకు చేరుతారు. ఈలోగా అమెరికాకంటె దాదాపు రెట్టింపు విస్తీర్ణంవున్న భూమి కనుపిస్తుంది. ప్రపంచ ముస్లిం జనాభా 22½ కోట్లు. ఇందులో 20 కోట్లవరకు ఈ ప్రాంతంలోనే నివసిస్తున్నారు. ఇక్కడే సమీప, మధ్య ప్రాచ్యాల* నాగరికత ప్రభవించింది. ఇక్కడ కూడా నాగరికత విధ్వంసంకాగల ప్రమాదం వచ్చిందని కొందరు భావిస్తున్నారు.

మధ్యప్రాచ్యంలో బాబిలోనియన్, అసీరియన్, ఈజిప్షియన్, మెడేస్, పర్షియన్ రాజ్యాలు వర్ధిల్లినవి. గ్రీకులు,

* మధ్యప్రాచ్యం సరిహద్దులు నిర్ణీతమైనవి కావు. చిత్ర పటాలు తయారుచేసే వారు ఇష్టంవచ్చినట్లు వీటిని మారుస్తూ వుంటారు. యూరపియన్ రాజ్యాల సంరక్షణ కిందనున్న అరబ్ దేశాలు, ఆఫ్రికాలోని అరేబియన్ రాజ్యం ఈజిప్టు, ఇండియాకు పశ్చిమంగాను సోవియట్ రష్యాకు దక్షిణంగాను వుండే ప్రాంతం కలసి మధ్యప్రాచ్యంగా వ్యవహరించబడుతుంది. ఒకప్పుడు సమీపప్రాచ్య రాజ్యంగా వ్యవహరించబడిన గ్రీసు ఇప్పుడు దీనినుంచి తొలగించబడింది. ఇదేవిధంగా సోవియట్ యూనియన్ లోని మహమ్మదీయ ప్రాంతాలుకూడా తొలగించ బడినవి. కాగా, ఆఫ్రికాలో మధ్య ప్రాచ్యదేశాలుగా పరిగణించబడే దేశాలు ఇవి: స్పానిష్ మొరాకో: 18,350 చదరపుమైళ్ళు, 7,50,000 జనసంఖ్య; ఫ్రెంచి మొరాకో: 1,72,104 చదరపుమైల్లు, 89,90,428 జనసంఖ్య; ఆల్జీరియా: 8,47,552 చదరపుమైళ్ళు, 72,34,684 జనసంఖ్య; టునీషియా: 48,313 చదరపుమైళ్ళు, 26,08,313 జనసంఖ్య; లిబియా: 6,79,358 చదరపుమైళ్ళు, 8,88,401 జనసంఖ్య; ఈజిప్టు: 3,86,000 చదరపుమైళ్ళు, 1,74,23,000 జనసంఖ్య.

రోమనులు, మంగోలులు ఈ ప్రాంతంపై దండెత్తి వచ్చారు. మధ్యప్రాచ్యంలో ఆటోమాన్ సామ్రాజ్యం వీరజాతిని సృష్టించింది.

ప్రస్తుతం మలేరియా, సిఫిలిస్ వ్యాధులతోను, ట్రాకోమా నేత్రవ్యాధితోను ప్రజలు విపరీతంగా బాధపడుతున్నారు. బక్కచిక్కి అతిశోచనీయ పరిస్థితులలో జీవిస్తున్నారు. ఎముకల ప్రోగులు తప్ప ఇంకేమీ కనబడవు. 25 సంవత్సరాలకే వృద్ధాప్యం దాపురిస్తుంది. సర్వసాధారణంగా అవినీతికి ఆకరమైన ప్రభుత్వాల పరిపాలనకు తలవొగ్గవలసి వుంటుంది. అధికసంఖ్యాకులు నిరక్షరాస్యులు, వ్యాధిగ్రస్తులు కావడంచేత యుక్తాయుక్త జ్ఞానమే నశించింది. పుష్టికరమైన ఆహారమేలేదు. వారు జీవించేది దుర్భర పరిసరాలలోనే. ప్రాచీనకాలంనాటి మహాసౌధాల శిధిలాలలోనే ఇప్పుడు చిన్నచిన్న గ్రామాలు ఎక్కడికక్కడిగా కనుపిస్తూ వుంటాయి. వెనుక ఒకప్పుడు ఆనకట్టలు, అక్విడెక్టులు వున్న ప్రాంతాలలో ఇప్పుడు వాటిమీద మొలచివున్న పచ్చికలో గొర్రెలమందలు మేస్తూ వుంటాయి.

అయినప్పటికీ, ఇదే సామ్రాజ్య విస్తరణకాంక్షులకు కదనరంగం. అందుచేతనే, సమస్త ప్రపంచదృష్టి ప్రస్తుతం దీనిపైనే కేంద్రీకరించబడింది. మధ్యప్రాంచ్యంపైనే అమెరికా కీర్తిప్రతిష్ఠలు, శాంతి ఆధారపడి వుండగలవని అంటే, ప్రతి అమెరికన్‌కు అది విచిత్రంగానే తోచవచ్చు గాని, ఇది యదార్థం. మరొక దండయాత్ర వల్లగాని, లేదా ఒక విప్లవం

ద్వారాగాని అది కమ్యూనిస్టుల గుప్పిట చిక్కితే, దానిని ప్రతిఘటించేందుకై అమెరికా యుద్ధాన్ని ప్రారంభించడం తప్పనిసరి కాగలదు.

మధ్యప్రాచ్యంగుండా, సూయజ్ కాలువ ద్వారా నౌకల రాకపోకలకు అమెరికా, బ్రిటన్‌లకు మార్గం కావాలి.

మధ్య ప్రాచ్యంలో గల వైమానికాశ్రయాలకు, డెహ్రాన్‌లోని అమెరికన్ నౌకా స్థావరానికి ఎప్పుడుపడితే అప్పుడే వాటి సైనిక దళాలు వెళ్ళడానికి పూర్తి స్వేచ్ఛ వుండాలి. వైమానిక, నౌకా మార్గాలద్వారా ఏక్షణంలో పడితే ఆ క్షణంలో వాటికి గిడ్డంగి అనదగిన ఇండియాకు వెళ్ళడానికి అవకాశం వుండాలి.

వీటిసన్నింటికీమించి మధ్యప్రాచ్యంలో గల పెట్రోలు అమెరికా, బ్రిటన్‌లకు పూర్తిగా కావాలి. యుద్ధతంత్రరీత్యా అమెరికా పెట్రోల్ "గిడ్డంగులు" అమెరికాలోగాని, దక్షిణ అమెరికన్ రాజ్యాలలోగాని లేవనీ, ఎడారి ప్రాంతమైన సాదీ అరేబియాలోనే కలవని అమెరికన్ నౌకా, వైమానిక దళాల సమష్టి పెట్రోలియం బోర్డు తీర్మానించింది.

మంచు గడ్డకట్టకుండా సర్వదా నౌకాయానానికి పనికి వచ్చే సముద్రపు రేవులకు చేరడానికి రష్యాకు మధ్య ప్రాచ్యమే మార్గం. పీటర్ మహాచక్రవర్తి కాలనుంచి ఇట్టి రేవులను కొన్నింటిని హస్తగతం చేసుకోవాలన్న ఆసక్తి రష్యాకు కలదు. ఇప్పుడా అభిప్రాయం ప్రబలతరంగా వుంది కూడా. ఇరాన్ వంటి అతి ముఖ్యమైన దేశం శత్రుహస్తగతం

కాకుండా చూడ్డం అవసరం. విదేశాలలో విశేష ప్రాబల్యం పొందడంలో ఆరితేరిన రష్యా, బాల్కన్ రాజ్యాలనుంచి గ్రీసు, టర్కీ, ఇరాన్‌లవరకు పరిపూర్ణ ప్రాబల్యాన్ని పొందే వరకు విశ్రమించదు. గ్రీసు, టర్కీ, ఇరాన్‌లు రష్యన్ ప్రాబల్యంలో పడినపుడు, రష్యన్ ప్రాబల్యం హిందూ మహా సముద్రంవరకు విస్తరించకుండా దానిని అరికట్టడం అసంభవం.

వాషింగ్టన్, లండన్‌లకు పెట్రోల్ ఎంత ఆవశ్యకమో మాస్కోకుకూడా అంత ఆవశ్యకమే. రష్యన్ సైనికదళాలు ఇతోధికంగా ట్రక్కులను, టాంకులను వినియోగిస్తున్నాయి. రష్యన్ సమష్టి వ్యవసాయ క్షేత్రాలు విశేషంగా ట్రాక్టర్లను, ఇతర యంత్ర పరికరాలను వినియోగిస్తున్నవి.

అందుచేత, మధ్యప్రాచ్యం కల్లోలానికి ఆలవాలంగా, అస్థిమితంగా వుండగల పక్షంలో, ఇతరుల జోక్యం కలిగించుకొనడానికి ఆ విధంగా మరొక యుద్ధం ప్రారంభం కావడానికి విశేషంగా అవకాశం వుంది. మధ్యప్రాచ్యం తన కాళ్ళపై నిలబడి, సుస్థిరమై, శక్తి స్తోమతులు పెంపొందించుకుంటూ వుంటే, శాంతి సాధనకు ప్రధానోపకరణం కాగలదు. ఈ ఉద్దేశ్యం వున్నందునే 1946 లో సైనికదళ దినోత్సవం సందర్భంలో జరిగిన సభలో ప్రెసిడెంట్ ట్రూమన్ ఇలా అన్నాడు :—

"సమీప, మధ్యప్రాచ్యాలలో అతిక్లిష్ట సమస్యలు వున్నవి. ఈ ప్రాంతంలో ప్రకృతి సిద్ధమైన సాధన సంపత్తి విశేషంగా వుంది. భూగర్భసంపద చాలా విశేషమైంది. భూ, నౌకా,

వైమానిక మార్గాలకు అందుబాటులో వుంది. అందుచేత, దురాక్రమణను ప్రతిఘంటించడానికి తగినంత శక్తి లేకుండా, ఆర్థిక దృష్ట్యా నేమి, యుద్ధతంత్రరీత్యా నేమి అత్యంత ప్రాముఖ్యం కలిగి వున్న వాటిలో ఇది ఒకటి. అందుచేత, స్వీయ ప్రాబల్య సాధనకై కృషిచేస్తున్న ఇతర దేశాలు పోటీకి దిగడానికి సమీప, మధ్య ప్రాచ్యాలు రంగస్థలి కాగలవు. ఇట్టి పోటీ ప్రారంభమైననాడు అగ్ని విసుమించి యుద్ధరంగంగా మారడం అత్యంత సంభవం."

దీని నివారణకు ప్రెసిడెంట్ సూచించినవి రెండు మార్గాలు. సైనిక బలప్రయోగం ద్వారాగాని, ఇతర విధానాల ద్వారాగాని మధ్యప్రాచ్యంలోగల స్వతంత్ర రాజ్యాలను ఎంతమాత్రం ఒత్తిడి పెట్టకుండా వుండడం ఇందులో మొదటిది. స్వీయసాధన సంపత్తిని వృద్ధిపరచుకొని, జీవన వ్యయ ప్రమాణాన్ని అభివృద్ధి పరచుకోడానికి తగు విధంగా ఆ రాజ్యాలకు సహాయం చేయడం రెండవది.

ట్రూమన్ ఈ ప్రకటన చేసినప్పుడు రాజకీయ వ్యాఖ్యాతలు దీనిని అలక్ష్యం చేశారు. ప్రెసిడెంట్ చేసే ప్రకటనలన్నీ కేవలం రాజకీయపు టెత్తులు మాత్రమేనని, వాటిని వెంటనే మరచిపోవచ్చునని 1946లో రాజకీయ వ్యాఖ్యాతలు అనుకుంటూవుండేవారు. కాని, పైన నేను పేర్కొన్న ఆయన ఉపన్యాసభాగాలను అప్పుడు జాగ్రత్తగా పరిశీలించివున్న వారికి 1947లో ట్రూమన్ ప్రణాళిక ప్రకటించ బడినపుడుగాని, 1949లో నూతన మహత్తర ప్రణాళిక ప్రకటించబడినపుడుగాని ఎంతమాత్రం ఆశ్చర్యం జనించి వుండదు. బడుగు దేశాలకు సాంకేతిక, ఆర్థిక సహాయాలను

చేయడం లాభప్రదమైనదని లాటిన్ అమెరికాలో పొందిన అనుభవంవల్ల తేలింది. ఈ అనుభవాన్ని పురస్కరించుకొని, రాజకీయ పరిస్థితులద్వారా అవసరం ఏర్పడినందున ఇప్పుడు మధ్యప్రాచ్యానికి సహాయం చేయడం అతి ముఖ్యం.

వెనుకబడిన దేశాలకు ఆర్థిక, సాంఘికాభివృద్ధికి తగు సహాయం చేయడంకంటెకూడా అతిముఖ్యమైన సమస్యలను ఈలోగా అమెరికా ఎదుర్కొనవలసివచ్చింది. గ్రీసు, టర్కీలకు సైనిక సహాయం, పశ్చిమ యూరోపియన్ రాజ్యాల ఆర్థిక పునరుజ్జీవనంతో ఉత్తర అట్లాంటిక్ రక్షణ ఒడంబడికకు తగు ఏర్పాట్లుచేయడం మున్నగు సమస్యలను అమెరికా ఎదుర్కొనవలసివచ్చింది. ఈ సమస్యలను పరిష్కరించిన పిమ్మటనేగాని మధ్యప్రాచ్య ప్రజానీకానికి సహాయ సమస్యను అది పరిశీలించడానికి వీలుపడజాలదు.

బ్రిటిష్ లేబర్ ప్రభుత్వం మధ్యప్రాచ్య ఆర్థికాభివృద్ధి సాధనకుగాను ఒక పెద్ద ప్రణాళికను తయారుచేసింది. కాని, ఆ ప్రణాళికను అమలు జరుపడానికి అమెరికా పెట్టుబడిపెట్టి సాంకేతిక నిపుణులను పంపి, ప్రోత్సహించవలసి వుంటుంది. అమెరికా సహకరించనిదే ఇది అమలుజరిగే అవకాశమే లేదు.

ఈలోగా పాలస్తీనాలో యూదీయరాజ్యం అవతరించింది. ఇది ఆరబ్‌లకు అత్యాశ్చర్యకరమేగాక, అమిత విద్వేష కారణం కూడా.

పాలస్తీనాలో యూదీయరాజ్యం అవతరణ క్రైస్తవ సంఘానికి బలం చేకూర్చవచ్చు; నూతన వ్యవస్థకు ప్రాతిపదిక

కావచ్చు. అయినప్పటికీ, యూదు అరబ్ జాతుల మధ్య యుద్ధమే ప్రారంభం కాగలపక్షంలో అది అతి భయానకంగా పరిణమించగలదు. అందుచేత, మధ్యప్రాచ్యం వెనుకటికంటె ఇప్పుడే మరింత ప్రమాదానికి గురియై వున్నదనడం నిజం. కాబట్టి, ఇప్పుడు అరబ్, యూదీయ రాజ్యాల మధ్య పోరు నిలిచినందున, ఈ అవకాశాన్ని తీసుకొని, మధ్యప్రాచ్యాన్ని అభివృద్ధిపరచి, సుస్థిరత్వంపొంది, దానిని శాశ్వతంగా శాంతికి నిలయంచేయవచ్చు.

అరబ్ రాజ్యాలకు ఇజ్రాయల్ మార్గదర్శకంగా పరిణమించి, అవి ఆర్థికంగా, సాంఘికంగా అభివృద్ధిగాంచడానికి దోహద మివ్వవచ్చు. లేదా అరబ్ రాజ్యాలకు ఇజ్రాయల్‌పై మరింత మాత్సర్యం ప్రబలి, యుద్ధంద్వారా దానిని తుడిచి పెట్టడానికే అవి ప్రయత్నించవచ్చు. ఈసారి అరబ్, యూదీయ రాజ్యాలకు యుద్ధమే సంభవిస్తే, అది అక్కడి తోనే ఆగిపోక, సకల ప్రపంచానికి విస్తరించడం తథ్యం. ఈ విషయాన్ని వాషింగ్టన్ బాగా గుర్తించింది. అందుచేతనే, 1949 లో చతుర్థసూత్ర కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరుపుతూ ప్రెసిడెంట్ చేసిన ఉపన్యాసం లక్ష్యం ఒక్కటే. యూదు, అరబ్ రాజ్యాల మధ్య శాంతి నెలకొనివుంటే, ఆ రెండింటికీ అమెరికా ఆర్థిక సహాయాన్ని చేయగలదనే ఆశాభావాన్ని కలిగించడమే ఆ లక్ష్యం.

ముందుగా సాంకేతిక సహాయం జరగాలి. మధ్య ప్రాచ్యంలో తక్షణం పరిష్కరించబడవలసివున్న సమస్యలు

ప్రజారోగ్యాభివృద్ధి, విద్యాభివృద్ధి, రహదారి మార్గాల నిర్మాణం, వ్యవసాయాభివృద్ధి, చిన్న పరిశ్రమల సంస్థాపన మున్నగునవి.

1948 లో లెబనాన్‌లో నియ్యర్ ఈస్ట్ ఫౌండేషన్ సంస్థ ఆధ్వర్యాన ఒక ఎక్స్‌పెరిమెంటల్ స్టేషన్ నెలకొల్ప బడింది. బెక్కాలోయలో రామములగ తోటలకు పడుతున్న చీడపురుగును నాశనం చేయడానికి అది ప్రయత్నించి కృత కృత్యమైంది. ఇందువల్ల లక్షలకొలదీ ఖరీదుచేయగల అనేక టన్నుల ఆహారాన్ని రక్షించడమేగాక, చతుర్థసూత్ర కార్యక్రమాన్ని అమలు జరుపవగు కార్యక్రమాన్నికూడా ఈ ప్రక్రియద్వారా ఆ సంస్థ సూచించింది.

1947 లో ఈజిప్టులో కలరా వ్యాధిని ప్రపంచ ఆరోగ్య సంస్థ అరికట్టింది. దిగువ యూరప్ ఆర్థిక వ్యవస్థనే ఈ కలరా వ్యాధి చిన్నాభిన్నం చేసింది. యూరప్‌కుకూడా అది వ్యాపించ గల ప్రమాదం ఆసన్నమైంది. ఈ స్థితిలో ప్రపంచ ఆరోగ్య సంస్థ పూనుకుని ఆరువారాలలోనే దానిని పూర్తిగా అరికట్ట గలిగింది. ఇదికూడా మున్ముందు జరగవలసివున్న కార్య క్రమానికి సూచనయే.

1942 లో ఈజిప్టులోనే గాంబియే దోమలవల్ల అతి దారుణమైన మలేరియా వ్యాధి వచ్చింది. అప్పటికి కొద్ది సంవత్సరాల క్రితం బ్రాజిల్‌లో 12,000 చదరపు మైళ్ళ ప్రాంతాన్ని సర్వనాశనంచేసిన మలేరియా వ్యాధికంటేకూడా ఈజిప్టులో 1942లో ప్రారంభమైనది మరింత భయానకంగా

వుంది. ఈజిప్టు ఎగువభాగంలో నూటికి 90 మందికి ఈ వ్యాధి సోకింది. నైల్ లోయలోగల గ్రామాలలో సగటున పదింట ఏడుగురికి ఇది తగిలింది. రెండు సంవత్సరాలలోనే మరణించిన వారి సంఖ్య 1,35,000 దాకా పెరిగింది.

1944 లో రాక్ ఫెల్లర్ ఫౌండేషన్‌ను ఈజిప్టు ప్రభుత్వం సహాయ మర్థించింది. 1945 సంవత్సరం వచ్చేసరికి ఈజిప్టులో గాంబియే దోమ చూద్దామన్నా కనబడకుండా పోయింది. మురుగు కాలువలను త్రవ్వి, స్ప్రేగన్‌లతో విష క్రిములను సంహరించడంద్వారా మలేరియావ్యాధి నిర్మూలించబడింది. ఇప్పుడు ఈజిప్టులో మలేరియా లేనే లేదు.

మలేరియా బాధ తప్పిపోయినందున ఇప్పుడు వ్యవసాయంలో అధునాతన మార్గాలను అవలంబించడానికి, పరిశ్రమలను నెలకొల్పి అభివృద్ధి పరచడానికి, ఇరాన్‌కంటె సుఖంగా జీవించడానికి ఈజిప్టు సంసిద్ధంగా వుంది. ఇరాన్‌లో ఇప్పటికీ నూటికి 82 మంది మలేరియాతో పీడించబడుతున్నారు. కిటికీలు సైతం లేని కొట్టాలలో రైతులు నివసిస్తూ వుంటారు. వారు కట్టుకునేవి చింకి గుడ్డలే. కోళ్ళను పెంచడం పాపమని, కూరగాయలను పండిస్తే భూసారం తగ్గిపోతుందని వారి మూఢ విశ్వాసం.

ప్రజారోగ్యం, విద్య, వ్యవసాయాభివృద్ధులతో పాటు మధ్యప్రాచ్యానికి రహదారి మార్గాల అభివృద్ధికూడా అతి ముఖ్యమైనది. రోడ్లు, రైలుమార్గాలు, వైమానిక మార్గాలు లేకపోవడంవల్ల, వున్న కాలువలద్వారా నౌకల రాకపోకలు

సవ్యంగా జరగడానికి అవకాశంలేనందున మధ్యప్రాచ్యంలో వ్యాపారం స్తంభించి పోయింది. అలాగే మధ్యప్రాచ్య రాజ్యాలుకూడా స్తంభించి పోయినవి.

మధ్యప్రాచ్య సౌభాగ్యాభివృద్ధికి అతిస్వల్ప సంస్కరణలు చాలనడానికి ఈజిప్టులో ఆహారపదార్థాల గిడ్డంగులను పరిశీలిస్తే కారణం తెలుస్తుంది. ఈజిప్టులో రైతులు అందరూ సర్వసాధారణంగా తమకుపండిన ధాన్యాన్ని జనపనార గోతాలలో పట్టి, చుట్టూ ముళ్ళతీగె వేసివున్న దొడ్లలో అట్టే పెట్టుతున్నారు. ఈ దొడ్లలో మురుగు నీటిగుంటలు వుంటాయి. ఎలుకలకు, పురుగులకు అడ్డమేమీ వుండదు. ఈ దొడ్లను షోనాస్ అంటారు. వీటికి బదులు కాంక్రీట్‌తో గిడ్డంగులు కట్టితే ఒక్కగింజ అయినా పారుపోకుండా నిల్వచేసుకోవచ్చు. ఈ షోనాస్‌లకు 17 నెలలకు ఇచ్చే అద్దెతో దాదాపు 50 సంవత్సరాలవరకు వాడుకోడానికి అనువైన కాంక్రీట్ గిడ్డంగి నిర్మించవచ్చు.

ఇలాంటి అతిస్వల్పమైన సంస్కరణలు కూడా అమలు జరగనందున ప్రపంచం మొత్తంలో గతసంవత్సరం 3,30,00,000 టన్నుల ధాన్యం నాశనమైపోయింది. అంటే రోజుకు 15,00,00,000 మందికి సరిపడే ఆహారం నాశనమై పోయిందన్నమాట. ప్రజారోగ్యాన్ని, వ్యవసాయాన్ని అభివృద్ధి పరిచి, రహదారి మార్గాలను నిర్మించి, నిరక్షరాస్యతను నిర్మూలిస్తే మధ్యప్రాచ్యం మహోన్నతస్థితి నొందగలదు. ఇంతగా అది అభివృద్ధి పొందడం అసాధ్యమని ఇప్పుడు తోచక

పోయినా, ఈ పనులన్నీ జరిగిననాడు అట్టిస్థితిని అది పొందడం తథ్యం. అప్పుడు మధ్యప్రాచ్యం తిరిగి ప్రపంచంమొత్తానికి ఉద్యానవనసీమగా విరాజిల్లగలదు.

ఆఫ్రికన్ అడవులను ఆనుకునే ఉత్తరవైపున మధ్యధరా సముద్రప్రాంతం వున్నది. ఇక్కడే ఫ్రెంచి ధర్మకర్తృత్వం కిందగల మొరాకో, ట్యూనిస్, అల్జీరియాలు ఉన్నాయి. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో కదనరంగంగా పరిణమించిన లిబియా ఇక్కడే వుంది. దేశంలోగల 2,00,00,000 ప్రజలలో 1,70,00,000 మందికి సూదిమొనమోపినంత భూమి అయినా లేకపోవడం, దేశంమొత్తలోగల సారవంతమైన భూమిలో అయిదింట ఒకవంతు భూమి రాజుకే చెందివుండడం ఇక్కడే. మహాదృష్టవంతుడైన రైతుకు సాలీనా 25 పౌనులు మాత్రమే గిట్టేది ఇక్కడే.

## ఆసియా మధ్యప్రాచ్యం*

మధ్య ప్రాచ్య ప్రజలు పరస్పర సహకారంతో వ్యవహరించడం నేర్చుకునేవరకు మధ్య ప్రాచ్య ఆర్థిక సమస్యలు పరిష్కారం కావడం అసంభవం.

---

* పది స్వతంత్రరాజ్యాలను, ఆసియా ఖండానికి చెందిన ఈజిప్టు భూభాగాన్ని కలిపి ఆసియాలోని మధ్య ప్రాచ్యమని ఇక్కడ వ్యవహరింప బడింది.

ఇండియా సరిహద్దులో ఆఫ్ఘనిస్థాన్, దాని సరిహద్దులో ఇరాక్ వున్నాయి. ఇరాక్ సరిహద్దున ఇరాన్ వుంది. వీటికి పడమరగా టర్కీ,

1949 వేసవిలో ప్రెసిడెంట్ ట్రూమన్ ఇలా అన్నాడు:—

"భూమిలోను, ఫ్యాక్టరీలలోను ప్రజలు ఉత్పత్తి చేసిన వాటిలో వారు పడ్డ శ్రమకు తగిన భాగం వారికి లభించేటట్టుగా పరిస్థితులు మారిననాడే అభ్యున్నతిని సాధించవచ్చు. ఇటీవలి సంఘర్షణలకు గురిఅయిన సమీపప్రాచ్య దేశాలు, తమ విభేదాలను విస్మరించి, నిర్మాణయుతమైన మార్గాల ద్వారా పరస్పర సహకారంతో వ్యవహరించిననాడు శాంతిని, సుస్థిరత్వాన్ని సాధించడానికి వాటికి తగు ప్రాతిపదిక ఏర్పడగలదని

---

సిరియా, లెబనాన్, ఇజ్రాయల్, తూర్పు ఈజిప్టు, ట్రాన్స్ జోర్డాన్, ఎమెన్, సౌదీ అరేబియా లున్నవి.

ఆఫ్ఘనిస్థాన్:— టెక్సాస్ రాష్ట్రమంత వుంటుంది. జనసంఖ్య 1,20,00,000.

ఇరాన్:—విస్తీర్ణంలో వీటి అన్నింటిలోకి పెద్దది. యునైటెడ్ స్టేట్స్‌లోని పశ్చిమ మైదానమంత వుంటుంది. జనాభా 1,50,00,000.

ఇరాక్: కాలిఫోర్నియా అంత వుంటుంది. జనాభా 35,00,000.

టర్కీ:—వాషింగ్టన్, ఇడాహో మోన్‌టానా రాష్ట్రాలు మూడు కలిపితే ఎంత విస్తీర్ణం వుంటుందో అంత వుంటుంది. జనాభా 1,90,00,000

సిరియా, లెబనాన్‌లు:—విస్‌కాన్సిన్ రాష్ట్రమంత పెద్దవి. జనాభా 40,00,000.

ఇజ్రాయల్:—మేరీలాండ్ అంత వుంటుంది. 12,50,000 జనాభా.

ట్రాన్స్ జోర్డాన్:—ఇండియానా రాష్ట్రమంతది. జనాభా 4,00,000.

ఎమెన్, సౌదీ అరేబియాలు:—మిసిసిపీనదికి తూర్పుగాఉన్న యునైటెడ్ స్టేట్స్ ఎంత వుంటుందో అంత వైశాల్యంకలిగి వుంటవి. రెండింటిలోను కలిసి మొత్తం జనాభా 50,00,000.

విశ్వసిస్తున్నాను. ఇట్టికృషికి అమెరికా గట్టిసహాయాన్ని చేయగలదు.''

ఈ రాజ్యాల మధ్య పరస్పరసహకారం వున్నదని అనుకున్నప్పటికీ, మధ్యప్రాచ్యం ఆర్థికాభ్యున్నతిని సాధించడానికి తక్షణం అమలు జరుపదగు ప్రణాళికల విషయమై వీటి మధ్య ఎంతమాత్రం ఏకాభిప్రాయం వున్నట్టులేదు. ప్రతిదేశం ఆర్భాటంతో పెద్దపెద్ద ప్రణాళికలను తలపెట్టింది. 65,00,000 పౌనులఖర్చుతో దేశంమొత్తాన్ని అభివృద్ధిపరచడానికి ఇరాన్ తలపెట్టితే, పాలస్తీనా జోర్డాన్‌లోయ అభివృద్ధికి పెద్ద ప్రణాళికను తలపెట్టింది. వీటికి సహాయం చేస్తూ, ఇంత సాహసమైన కార్యాలకు వీటిని ప్రోత్సహిస్తున్నవి అమెరికన్ ఇంజనీరింగ్ కంపెనీలు. వాటిదృష్టిలో అభ్యుదయమంటే ఆనకట్టల నిర్మాణం, ఉక్కు ఫ్యాక్టరీల నిర్మాణం మాత్రమే.

చిన్న చిన్న అభ్యుదయ ప్రణాళికలకు కావలసిన పెట్టుబడి లభించడానికి, ఆ ప్రణాళికలను అమలు జరపడానికి అవసరమైన సాంకేతికసహాయం లభించడానికి చతుర్థసూత్ర కార్యక్రమం సాధనం కాగలదని అనేక మధ్యప్రాచ్యరాజ్యాలు ఆశిస్తున్నట్టు వినడం ఆశ్చర్యమేమీ కాదు. ఇప్పటికీ, ఆ యా దేశాలలోవున్న బ్యాంకింగ్ సంస్థలే పెట్టుబడి పెట్టాలి గాని, ఇట్టి ప్రణాళికలకు విడిగా పెట్టుబడి పెట్టడం చతుర్థసూత్ర కార్యక్రమం లక్ష్యం కాదని గ్రహించిననాడు ఆ దేశాలు నిరాశచెందడం కూడా ఎంతమాత్రం ఆశ్చర్యం కానేకాదు.

బడుగు దేశాలు తమ సుస్థిరత్వాన్ని, శక్తిని నిరూపించుకొనే వరకు వాటికి ప్రయివేట్ పెట్టుబడి లభ్యంకావడం అసంభవం.

## ఇరాన్

ఉత్కృష్టమైన ప్రణాళిక సైతం, అసమర్థులైన నిర్వాహకుల చేతిలో పడినప్పుడు ఎలా విఫలమైపోగలదో ఇరాన్‌లో దృష్టాంతం కలదు.

న్యూయార్క్‌లోని ఓవర్సీస్ కన్సల్టెంట్స్ ఇన్‌కార్పొరేటెడ్ సంస్థ 1949 ఆఖరులో ఇరాన్ అభివృద్ధికి ఒక పెద్ద ప్రణాళికను ప్రకటించింది. ఏడు సంవత్సరాలలో ఇరాన్‌లో వ్యవసాయ పారిశ్రామిక ఉత్పత్తులను నూటికి రెండుపందలదాకా వృద్ధిపరచడమే ఈ ప్రణాళిక లక్ష్యం. ఓవర్సీస్ కన్‌సల్టెంట్స్ సంస్థలో అమెరికాలోని ప్రముఖ ఇంజనీరింగ్ కంపెనీలకు భాగాలు కలవు. ఈ ప్రణాళికకు అయ్యే ఖర్చులను ఇరాన్‌లో ప్రజలవద్ద అప్పులుచేసి, పెట్రోల్‌పై వాలీనావచ్చే రాయల్టీలు 5,00,00,000 పౌనులనుంచి భరించాలని నిర్ణయించబడింది. ఇరాన్ జనాభాలో నూటికి 80 వంతుల మందికి వ్యవసాయమే జీవనోపాధి అయినా, ఇరాన్‌లోగల భూమిలో నూటికి 10 వంతులు మాత్రమే ప్రస్తుతం సాగులోవున్నదని ఓవర్‌సీస్ కన్‌సల్టెంట్స్ సంస్థ సూచిస్తున్నది. 4,00,000 ఎకరాలను కొత్తగా సాగుచేయడానికి, వ్యవసాయంలో కొత్త యంత్రపరికారలను విశేషంగా వుపయోగంలోనికి తేవడానికి, విద్యాబోధనలను విస్తరింప

జేయడానికి, గృహావసతి పెంచడానికి, మిల్లులు నిర్మించడానికి, ఎరువుల ఫ్యాక్టరీలు స్థాపించడానికి, సబ్బు, క్లోరిన్, కార్బన్ బ్లాక్ మున్నగు పరిశ్రమల నెలకోల్పడానికి కూడా ఈ ప్రణాళికలో అవకాశాలు కల్పించబడినవి. అయితే, దీనికి కావలసిన డబ్బు ఎక్కడిది? భారీ ప్రణాళికలకు విశేషంగా ఖర్చుపెట్టవలెనంటే ఇప్పుడు కొంత ఖర్చు చేయాలిగదా? ఇప్పుడేమీ లేనివారు ఏమి త్యాగం చేయగలరు?

ఇప్పటికి అదృష్టవశాత్తు ఇరానియన్ సప్తవర్ష ప్రణాళిక ప్రజానీకానికి వుపకరించే సూచనలు కానవచ్చినవి. ఆ ప్రణాళికనుఅమలు జరపవలసిన అమెరికన్ డైరెక్టర్ మాక్స్ధారన్ బర్గ్ స్థానిక పరిస్థితులను అభివృద్ధిపరచడానికి ప్రభుత్వం ఖర్చు పెట్టవలసిన డబ్బును ప్రణాళికకు వినియోగించడం తప్పిదమని నిష్కర్షగా ప్రకటించాడు. ఆయన అజమాయిషీ కింద, ఈ సప్తవర్ష ప్రణాళిక ముందుగా ప్రజారోగ్యాభివృద్ధిని, వ్యవసాయాభివృద్ధిని, రహదారుల అభివృద్ధిని సాధించగలదనీ, ఉక్కు ఫ్యాక్టరీలు, రైలు ఇంజన్ల ఫ్యాక్టరీలు మరికొంత కాలంవరకు నిలిపివుంచబడగలవనీ ఆశించవచ్చు. తక్షణమే సాధ్యమైన కార్యక్రమాన్ని అమలు జరపడానికి ఈ ప్రణాళిక ద్వారా ప్రయత్నిస్తే, మధ్యప్రాచ్యం అభివృద్ధికి చతుర్థసూత్ర ప్రణాళిక వివరించిన కార్యక్రమంతో సరితూగగలదు.

అంటే, టెహరాన్ సమీపంలో నియ్యర్. ఈస్ట్ ఫౌండేషన్ సాగించిన కార్యక్రమాన్నే ధారన్‌బర్గ్ అనుసరించడం మంచిదన్నమాట.

# టర్కీ

మాక్స్ థారన్ బర్గ్ ఇప్పుడు ఇరాన్‌కు నేర్పుతున్న గుణపాఠాల నన్నింటినీ టర్కీలో మూడేండ్లు వుండి, అక్కడి పరిస్థితులను పరిశీలించడంద్వారా ఆయన నేర్చుకున్నట్టివే. తన అనుభవాలన్నింటిని వివరిస్తూ "టర్కీ—దాని ఆర్థిక స్థితి" అన్న పుస్తకాన్ని ఆయన వ్రాశాడు. రహదారుల అభివృద్ధి పట్ల మధ్య ప్రాచ్యంలోగల ఆసక్తి ఇరాన్, ఇరాక్‌ల రైలు మార్గాలతో తన రైలు మార్గాలను కలపడానికి యత్నించడం ద్వారా టర్కీ వివరించింది. ఈ ప్రణాళికను తదితర ప్రణాళికలను టర్కీ ప్రభుత్వమే అమలు జరుపుతున్నది.

ఇప్పటికి అవసరమైన వస్తువులను వుత్పత్తి చేయడానికి కొన్ని పరిశ్రమలు స్థాపించబడినవి. కొయ్య నాగళ్ళకు, ఆధునిక ఫ్యాక్టరీలకు మధ్య గల అంతరాన్ని తొలగించేవరకు సాధ్యమైన ఆర్థిక కార్యక్రమం అమలు జరిగే అవకాశం కనిపించడం లేదు.

విదేశ పెట్టుబడులపై అమలులోగల విధి నిషేధాలను, ఇటాటిజమ్ అన్న పేరుతో విదేశీయుల పెట్టుబడికి అవరోధంగా నిలచిన శాసనాలను రద్దుచేసేవరకు టర్కీకి అమెరికా పెట్టుబడి లభించబోదని థారన్‌బర్గ్ పేర్కొన్నాడు. అంటే, టర్కీలో ప్రస్తుతం అమలులోవున్న ఏకపక్ష ప్రభుత్వ విధానానికి స్వస్తిజరిగి, రాజకీయరంగంలో ప్రభుత్వ పక్షానికి ఎదురుగా ప్రతిపక్షం ఏర్పడి పెట్టుబడి పెట్టడానికి, టర్కీవాసులే ముందుకు రావాలన్నమాట. అప్పుడు వేలాది టర్కీవాసులకు

పరిశ్రమల నిర్వహణలోను, ఇంజనీరింగ్, వ్యవసాయాలలోను ఆధునిక పద్ధతులలో శిక్షణ లభిస్తుంది.

చిన్న చిన్న పరిశ్రమలతో అభివృద్ధి కార్యక్రమాన్ని ప్రారంభించవలసిందిగా టర్కీకి థారన్‌బర్గ్ వినతిచేశాడు. టర్కీ మొత్తానికి సరిపడే ఫోర్కులనుగాని, వాగెన్‌లు గాని తయారు చేయడానికి ఎంత సాధన సంపత్తి కావలెనో లెక్కవేస్తూ కూర్చొనక, ఒక ఫ్యాక్టరీని స్థాపించి దానిని నడపవలసిందనీ, కేవలం అనవసరం కాగల 5,00,000 టన్నుల ఉక్కు వుత్పత్తిచేసే ఫ్యాక్టరీని నిర్మించడం ఎలాగని తలలు పగులగొట్టుకొనక ఇప్పుడు అవసరమైన చోటల్లా 50 టన్నుల ఇనుము నుత్పత్తిచేసే చిన్నచిన్న ఫౌండ్రీలను స్థాపించ వలసిందనీ ఆయన సలహా నిచ్చాడు. కాని, ముందుగా నిపుణులను కార్యరంగంలోకి తీసుకొనిరావలసిందని కూడా ఆయన హితబోధచేశాడు. అనగా ప్రభుత్వ నిర్వహణకు నిపుణులనూ, ప్రతిశాఖను నిర్వహించేందుకు నిపుణులనూ ముందు తీసుకొని రావాలని, వారు టర్కిష్ యువకులకు శిక్షణనివ్వాలని ఆయన సూచించాడు. కొత్త రైలుమార్గం నిర్మించేందుకై అనేకలక్షలు పెట్టి ఇంకా ఎక్కువ సామగ్రిని ఖరీదుచేయడానికి మారుగా రైలురోడ్ల నిర్మాణాన్ని అందులో ఆరితేరిన నిపుణునికి అప్పగించమన్నాడు. దేశం మొత్తంలో ఇరిగేషన్ వసతులకు పెద్ద ఎత్తున ప్రాజెక్టుల నిర్మాణానికి ఆలోచనలు జరిపేముందుగా దాదాపు మూడువంతులు కట్టడం పూర్తి

అయి, పని ఆగిపోయి, అనేక సంవత్సరాలుగా పడివున్న వాటిని ఉత్పత్తిచేసి, వాటిని ఉపయోగంలోకి తెమ్మని చెప్పాడు.

వచ్చే అయిదు సంవత్సరాలలో విద్యుచ్ఛక్తి వుత్పత్తి ఆరున్నర రెట్లు పెంచడానికిగాను టర్కీ ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్ ఇన్‌స్టిట్యూట్ ప్రణాళికను తయారుచేసింది. ఆ ప్రణాళికను థారన్‌బర్గ్ హర్షించాడు. అయితే, తొందరపాటు తగదనీ, మెల్లిమెల్లిగా ముందుకు పోవాలిగాని ఒకేసారి దూకడం తగదనీ వారించాడు.

థారన్‌బర్గ్ సలహాను యథాతథంగా టర్కీ ఆమోదించక పోవచ్చు. అమెరికన్‌ల దృష్టి ప్రకారం స్వేచ్ఛా వాణిజ్యం టర్కీలో ఇంతలో అవతరించకపోవచ్చు. కాని, ఇటాటిజమ్‌కూ స్వేచ్ఛా వాణిజ్యానికి మధ్యేమార్గం ఒకటి రూపొందడం, టర్కీ ప్రభుత్వం, ప్రయివేట్ వాణిజ్య సంస్థలు పరస్పర ఒడంబడికలతో పరిశ్రమలను నిర్వహించడం మాత్రం తథ్యం. ఇప్పుడు తయారైన మహోద్భుత ప్రణాళికలు కొన్ని చాలాకాలందాకా అమలుకు రాకపోవచ్చు. కాని, అన్నీ అసలే అమలులోనికి రాకుండా వుండడం అసంభవం. అయితే, వాటికి మారుగా తక్షణమే లాభించగల మరికొన్ని ప్రణాళికల అమలు జరుపడం ద్వారా భారీ ప్రణాళికలు మరికొంతకాలం వాయిదా వేయబడవచ్చు. వాటిని వేగంగా కాక, మెల్లిమెల్లిగా అమలోనికి తేవచ్చు.

అమెరికన్ ప్రభుత్వమేమి, వాణిజ్య ప్రతినిధులేమి ఒక్క టర్కీలోను, మధ్యప్రాచ్యంలోను మాత్రమేగాకుండా

అమెరికాను అనుగమించడానికి ఆకాంక్షిస్తున్న ప్రపంచ మంతటిలోను ఇదే విధానం అనుసరించబడ్డానికి వత్తిడి తేవాలి.

## అరేబియా

**అ**మెరికా ఆర్థిక సహాయాన్ని అపేక్షించకుండానే మధ్య ప్రాచ్యరాజ్యాలు కొన్ని భారీ ప్రణాళికలను తయారుచేసుకొన డానికేమి, వాటిని అమలు జరపడానికేమి తగు శక్తిస్తోమతలు వాటికి వచ్చినవి. ఆ దేశాలలో పెట్రోల్ గనులు వున్నందుననే ఇది సాధ్యమైంది. పెట్రోల్‌ను కొనడానికిగాను అమెరికన్ కంపెనీలు మూల్యాన్ని సంతోషంతో డాలర్లలో చెల్లిస్తున్నవి.

విదేశాలలో పెట్టుబడి పెట్టడంలో అగ్రస్థానం పొందిన అరేబియన్ అమెరికన్ ఆయిల్ కంపెనీ 1948 లో రోజుకు 2,60,00 బారెల్స్ పెట్రోల్‌ను తీస్తున్నది. సాదీ అరేబియాలో గల 51 పెట్రోల్ నూతులను మాత్రమే అది ఆడిస్తున్నది. ఆరమ్‌లో పనిచేస్తున్న అరేబియన్ కార్మికులకు రోజుకొక అమెరికన్ డాలరు చొప్పున కూలి గిట్టుతున్నది.

సాదీ అరేబియా అంతా ఎడారి మయంగానే వున్నా, డహ్రాహాన్‌కు సమీపంలో గల డమ్మామ్ వద్ద సాదీ అరేబియా ప్రభుత్వం లోతుగా రేవును నిర్మిస్తున్నది. ఈ రేవునుంచి 350 పొడవున రైలుమార్గం అరేబియా రాజధాని రియాధ్ వరకు నిర్మించబడుతున్నది. ఇదిగాక మధ్య ధరాసముద్రం

వరకు 1,200 మైళ్ల పొడవున పెట్రోల్ పంపు వేయబడింది. ఈ లైన్ ద్వారా ఈ సంవత్సరంనుంచి రోజుకు 3,00,000 బారెల్సుకు సరిపడే పెట్రోల్ ఎగుమతి చేయబడుతుంది. అరేబియన్ అమెరికన్ ఆయిల్ కంపెనీ 1,100 మైళ్ల పొడవున, సాదీ అరేబియా ప్రభుత్వం 1,200 మైళ్ల పొడవున రోడ్లను నిర్మిస్తున్నవి.

చతుర్థసూత్ర కార్యక్రమంలో అరేబియన్ రాజ్యాలకు అంత పెద్ద ఎత్తున కార్యక్రమం రూపొందించబడలేదు. నీటి పారుదల సౌకర్యాలను ఏర్పాటు చేయడమే ఈ కార్యక్రమం తొలి అంశం.

అరేబియాకు అతి ముఖ్యమైనది నీరు. పూర్వకాలంనాటి శిథిలమైవున్న రిజర్వాయర్లను చూస్తే, ఒకప్పుడు అరేబియాలో సారవంతమైన భూమి వుండేదనీ, పంట బాగా పండేదని అనిపిస్తుంది. తిరిగి అరేబియా అంతా సారవంతంగాను, సస్యశ్యామలంగాను చేయాలన్న తలంపు అనేకమంది అమెరికన్లకు కలిగింది.

# ఆఫ్ఘనిస్థాన్

**మారిసన్ — నూడ్సెన్** అన్న పేరుతో ఒక అమెరికన్ ఇంజనీరింగ్ కంపెనీ వుంది. ఫీజు ఇస్తానంటే దేశం మొత్తాన్ని అదేపళంగా ఎత్తి, 500 ఏండ్లనాటికి దేశం పరిశ్రమలలో ఎంత వృద్ధి గాంచగలదో అక్కడ ఇప్పుడే పడవేస్తానని చెప్తుంది.

అది ఇప్పుడు చేసుకునివున్న కంట్రాక్టులు లక్షలు, కోట్లు దాటి వేలాదికోట్ల డాలర్ల మొత్తానికి చేరాయి. ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో కోట్లాది ప్రజల భవితవ్యానికి సంబంధించిన అనేక ప్రాజెక్టులను నిర్మిస్తానని అది వాగ్దానం చేసింది. ఈ కంపెనీ సంగతి కొద్దిమంది ఇంజనీర్లు తప్ప ఇంకెవ్వరూ విని అయినా వుండలేదు.

ఇండియా, రష్యాల మధ్యన వున్న ఆఫ్ఘనిస్థాన్ ద్వితీయ ప్రపంచ సంగ్రామసమయంలో రోడ్ల నిర్మాణాన్ని, పారిశ్రామికాభివృద్ధిని తలపెట్టింది. ఇందుకుగాను ఆఫ్ఘనిస్థాన్ అమెరికా సహాయాన్ని అర్థించడాన్ని రష్యా అడ్డగొట్టివుండేదే. కాని, అప్పట్లో, స్టాలిన్‌గ్రాడ్ రక్షణకై సతమత మవుతున్న రష్యా ఆఫ్ఘనిస్థాన్ గొడవను అంతగా పట్టించుకోలేక పోయింది. అందుచేతనే పబ్లిక్ వర్క్సు మంత్రి మహమ్మద్ లూడిన్ పాట పెట్టాడు. మారిసన్ — నూడ్‌సెన్ పాట పాడి గెలిచింది. వెంటనే ఆఫ్ఘనిస్థాన్‌కు సర్వేదళాలు వెళ్లాయి.

1946 వసంత ఋతువులో 1,60,00,000 పౌనుల కంట్రాక్టుపై సంతకాలు జరిగింది. 13,50,00,000 పౌనులతో దేశం మొత్తంలో రోడ్లను, ఇరిగేషన్ కాలువలను, ప్రాజెక్టులను, పరిశ్రమలను నిర్మించడానికి ప్రాతిపదకగానే ఈ తొలి కంట్రాక్టుపై సంతకాలు జరిగినవి. 1947లో రోడ్డు నిర్మాణ కార్యక్రమం ప్రారంభించబడింది. 200 మంది అమెరికన్ ఇంజనీర్లు దేశీయుల సహాయంతో రోడ్లను నిర్మిస్తున్నారు.

పాత బ్రిటిష్ సైనిక మార్గానికి ఉత్తరంగా 65 మైళ్ల పొడవున నిర్మించబడుతున్న ఒక రోడ్డు ఖాందహార్ నుంచి, పాకిస్థాన్ సరిహద్దులోనున్న సిలిన్ బాల్ డాక్ వరకు వెళ్తుంది. ఈ కొత్త రోడ్డుమీదుగా ఆఫ్ఘన్ మోటారులు తమ దేశంలో పండిన మెలాన్‌లను (యాపిల్ వలె వుండే పండ్లను) ద్రాక్షపండ్లను మూడుగంటలలోపునే మార్కెట్‌కు చేర్చగలవు. లోగడ, గిర్‌షిక్‌కు నైరుతిదిశగా 75 మైళ్ల పొడవున వున్న రోడ్డు ద్వారా వెళ్లడానికి 12 గంటలు పట్టేది.

మారిసన్-నూడ్‌సెన్ స్థానికులకే సాంకేతిక విషయాలలో శిక్షణనిస్తున్నది. ఇప్పుడు తలపెట్టినవన్నీ నిర్మించబడిన తరువాత వానిని కాపాడే బాధ్యత అప్పగించి, అవసరమైన మరమ్మత్తులు చేయడానికి తగు సామర్థ్యం ఆఫ్ఘన్‌లకు చేకూర్చడమే ఈ కంపెనీ ఉద్దేశ్యం.

దీనికి తోడు చిత్రంగా కనుపించేదేమంటే, అమెరికన్ ఉపాధ్యాయులు ఆఫ్ఘనిస్థాన్‌కు వెళ్లి, విద్యాప్రచారానికి తలపెడుతున్నారు. ఆఫ్ఘనిస్థాన్‌లో అమెరికన్ ఉద్యోగులతో విద్యాలయాలను నెలకొల్పడానికే గాక ఆఫ్ఘనిస్థాన్ నుంచి అమెరికాకు విద్యార్థులనుకూడా పంపిస్తున్నారు.

అయితే, ఇరాన్‌లోనవలెనే ఆఫ్ఘనిస్థాన్‌లోకూడా పునాది పూర్తికాక ముందే పై అంతస్థు నిర్మాణం పూర్తి అయ్యే ప్రమాదం కానవస్తున్నది. చతుర్థసూత్ర కార్యక్రమంలో ఆఫ్ఘనిస్థాన్‌కు ఒకే ఒక సంస్కరణ తలపెట్టబడింది. ఆఫ్ఘనిస్థాన్‌లో గృహాలన్నీ మట్టితోకట్టిన మిద్దెలే. మట్టికప్పులు ఎండి,

పగిలి పడిపోతూ వుంటాయి. అందుచేత ప్రజల ఆరోగ్యం చెడుతూ వుంటుంది. కాబట్టి మట్టితో ఇటుకలు చేసుకోవడం వారికి నేర్పితే, చాలావరకు వారి గృహాలను రక్షించినట్టే కాగలదు. ఆఫ్ఘనిస్థాన్‌లో విద్యాభివృద్ధి సమస్య అంటే కేవలం విద్యాలయాలకు భవనాలు నిర్మించడం కాదు. తగినంతమంది ఉపాధ్యాయులు లేరు. కావలసినంతమంది ఉపాధ్యాయులు చేరేవరకు ఆధునిక పద్ధతులపై అక్కడ విద్యాబోధన జరగడం దుస్తరం. ఆధునిక పద్ధతులపై విద్యాబోధన జరగనిదే, ఆఫ్ఘనులు బాధ్యత స్వీకరించి, ఆర్థికాభివృద్ధి ప్రణాళికలను అమలు జరుపుకోవడం అసంభవం.

## సిరియా

ఆర్థిక స్తోమతులేనిదే గబగబా పరిశ్రమలను వృద్ధిచేయడం వల్ల పొందే నష్టం సిరియాలో అనుభవపూర్వకంగా కనుపిస్తున్నది. యుద్ధం రోజులలో సిరియన్ కేపిటలిస్టులు టెక్స్టైల్, గ్లాస్ మిల్లులను విశేషంగా స్థాపించారు. వస్త్రాలు గాని, గ్లాసులు గాని కొనుక్కోడానికి సిరియన్‌లకు తగినంత డబ్బు లేనేలేదు. పరిసరాలలో వున్న అరబ్ రాజ్యాలలో కూడా అవి చెల్లడం లేదు. దీని ఫలితంగా మధ్య ప్రాచ్యంలో సర్వదా తిష్ఠ వేసుకునివుంటున్న దారిద్ర్యం మరింత వృద్ధిపొంది సిరియాను ఇరాక్‌లో విలీనం చేయాలన్న ఆందోళన బయలుదేరడం, మూడు సైనిక విప్లవాలు వాటిల్లడం సంభవించింది.

సిరియా సమస్యను తిరిగి ఆదినుంచి పరిశీలించి పరిష్కరించడానికి ఐక్యరాజసమితి నిర్ణయించింది. మురుగునీటి వనరులు, ఇరిగేషన్ సౌకర్యాలతో అదనంగా 1,75,000 ఎకరాల భూమిని సాగుచేయడానికి దోహదమివ్వగల ఒక చిన్న ప్రణాళిక రూపొందించబడింది. దీనికిగాను 1,30,00,000 డాలర్లు ఖర్చు కాగలవు. భూమి ఖరీదును నూటికి నూరువంతులదాకా పెంచడం ద్వారా ఈ ఖర్చును రాబట్టవచ్చు. తొలి కార్యక్రమం సవ్యంగా జరిగితే, మిగతా కార్యక్రమం అమలు జరిగే సంగతి ఆలోచించబడుతుంది.

## పాలస్తీనా

ప్రథమ ప్రపంచ సంగ్రామం పూర్తి అయ్యేసరికి తతిమ్మా మధ్యప్రాచ్య రాజ్యాలతోపాటు పాలస్తీనాకూ దారిద్ర్యానికి నిలయమైంది. నేడు ఇజ్రాయల్ స్వతంత్ర రాజ్యమే అయినా అది దారిద్ర్యంలోనే వున్నది. 1948 జులైనుంచి 1949 డిసెంబరులోపుగా ఉత్పత్తి నూటికి 20 వంతులు పెరిగినా దాని దారిద్ర్యమేమీ తగ్గనే లేదు.

మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం పాలస్తీనాలో 60,000 మంది యూదులువుంటే, ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయ్యేనాటికి 5,00,000 మంది అయినారు. ఇప్పుడు దానికి రెట్టింపు వున్నారు. వీరు రోడ్లు నిర్మించి, పరిశ్రమలు నెలకొల్పి ఎంతగానో దేశాన్ని వృద్ధి చేశారు.

విదేశ పెట్టుబడులను ప్రోత్సహించడానికై ఇజ్రాయిల్ అనేక పనులు చేస్తున్నది. విదేశ వాణిజ్య సంస్థలు కొత్తగా నిర్మించుకొనే భవనాలకు మునిసిపల్ పన్ను మినహా యిస్తున్నది. ఆ సంస్థలు తెప్పించుకొనే యంత్రాలపై సుంకం విధించడమే లేదు. అయితే, ఆ యంత్రాలను నెలకొల్పిన వారు 8 సంవత్సరాల అనంతరం వాటిని వదలివేయాలని మాత్రం షరతు పెట్టింది. అయినప్పటికీ అమెరికాలో వలెనే ఇజ్రాయల్‌లోకూడా కూలి రేట్లు చాలా ఎక్కువ కావడం వల్ల, ఆధునిక పరికరాలు లేనందువల్ల, వ్యాపారానికి అమిత ఖర్చులు పడుతున్నందువల్ల, ఇవన్నీ కాక ఇజ్రాయల్ ఎటు తిరిగీ తుదకు సోషలిజమ్‌ను నెలకొల్పడానికి యత్నిస్తున్నందువల్ల అక్కడ వ్యాపారం లాభసాటి బేరంకాదని విదేశ పెట్టుబడి దారులు భావిస్తున్నారు.

## ఇరాక్-టిగ్రిస్, యూఫ్రెటీస్‌వాలీ

అతి ప్రాచీనమైన బాబిలోనియాలో 3,00,00,000 జన సంఖ్య వున్నట్టు అంచనా వేయబడింది. అదే ఇప్పుడు ఇరాక్‌గా వ్యవహరించబడుతున్నది. ఆనాటి జనసంఖ్యలో పదవవంతుకూడా ఇప్పుడు లేదు.

మానవ చరిత్రలోకెల్ల అపూర్వంగా పరిణమించబడి, మహోన్నతమైన నాగరికతకు ప్రసిద్ధిగాంచిన ఆ దేశం క్రమేపీ శుష్కించి, ప్రజలందరూ వ్యాధిగ్రస్తులై అతి శోచ నీయ స్థితిలో వున్నారు. ఈజిప్ట్‌వలె ప్రకృతి సృష్టించిన వైప

రీత్యావల్ల బాబిలోన్ శిథిలమైపోలేదు. అతి సామాన్యమైన ఇరిగేషన్ వసతులను ఏర్పాటు చేస్తే అది తిరిగి వెనుకటి మహోన్నత స్థితిని పొందగలదు.

భూసారం క్రమేపీ తగ్గిపోయినట్టుంది. ఇరిగేషన్ కాలవలలో ఇసుక పేరుకొని అవి క్రమేపీ పూడిపోయినవి. ఇంజనీరింగ్ అనుభవ మేమీ లేనందున ఒకదాని తరువాత మరొకటిగా ఇరిగేషన్ కాలువలను బాబిలోనియన్‌లు వదలివేశారు. బాగ్దాద్ నగరంనుంచి మోసల్ నగరంలోపునే ఇలా వదలివేయబడిన కాలువలు 98 దాకా వున్నాయి. ఈ కాలువలలో పూర్తిగా పూడిక తీసి తిరిగి నీరు పారించవచ్చు. అయితే, దేశం మొత్తంలో ఎత్తుగా వున్న ఈ కాలువలన్నింటికీ పూడికలు తీయడం చాలా పెద్దపని. జీర్ణించి, నీరసించిపోయి వున్న జాతి కిది అసాధ్యమైన పని. అనేక శతాబ్దాలక్రితం దాడిచేసిన మంగోల్‌లు స్త్రీలను పసిపాపలను చిత్రవధ గావించడంతోపాటు ఇరిగేషన్ వసరులను సర్వనాశనం చేశారు. అప్పుడు దేశం పొందిన నష్టాన్ని కూడదీసుకొనడం దుస్తరమైపోయింది. అప్పటి కింకా మిగిలివున్న ఆనకట్టలు కాలక్రమేణా శిథిలమైపోతూ వుంటే వాటి సంగతే పట్టించుకున్న వారు లేరు. అలాగే శృంగారవన సీమగా పేరు గాంచిన ఈ దేశం కళావిహీనమై, తోటలన్నీ ఎండి, నశించిపోయి, ఎడారిగా మారిపోయింది. దానితోపాటే అక్కడి మనుష్యులుకూడా క్రమేపీ జంతువులుగా మారిపోయారు.

మొత్తం భూమి 19,39,50,00,000 ఎకరాలు వుండగ దీనిలో ఇరిగేషన్‌కు పనికివచ్చేది 2,00,00,000 ఎకరాలు మాత్రమే. టిగ్రిస్ నదిపై గల కుట్ ఆనకట్టనుంచి యూఫ్రేట్స్ నదిపై గల హిండియా ఆనకట్టనుంచి ఈ భూమికి నీరు లభిస్తుంది. మరొక పది ఆనకట్టలను కట్టడానికి ప్లానులు తయారు అయినవి. ఇందువల్ల అదనంగా 3,75,000 ఎకరాలు సాగుకావచ్చు. ఇదేవిధంగా రహదారి మార్గాలను, రైలుమార్గాలను మెల్లి మెల్లిగా వృద్ధి పరచుకుంటూ తూర్పున ఇరాన్‌నుంచి పడమరవున్న సిరియన్ రేవు పట్టణం ట్రిపోలీవరకు రవాణా సౌకర్యాలు ఏర్పాటు చేయడానికికూడా ఇరాక్ ప్రయత్నిస్తున్నది.

భూమి అత్యంత సారవంతమైనదే అయినా దాని ననుభ వించడానికి ప్రయత్నమే జరగడంలేదని చెప్పాలి. 40 ఏళ్ళ క్రితం బ్రిటిష్ ఇంజనీరు సర్ విలియం విల్‌కాక్స్ అప్పటికే శిథిలమై వున్న ఇరిగేషన్ వనరులను పరిశీలించి, 15,00,00,000 డాలర్ల ఖర్చుతో 2,80,00,000 ఎకరాలను సాగుచేయవచ్చు నన్నాడు.

ఇరాక్‌ను పునశ్శక్తిమంతం చేయడానికి ప్రతిపాదించ బడిన ప్రణాళికలలో న్యూయార్కు ఇంజనీర్ లాజరస్ వైట్ సూచించినది అతి ప్రధానమైనది. ఒక్క ఇరాక్‌కు మాత్రమే గాక సిరియా, లెబనాన్, ట్రాన్స్ జోర్డాన్. టర్కీల అభివృద్ధికి ఇది దోహదమిచ్చి, జోర్డాన్‌వాలీ అథారిటీకింద అభివృద్ధిపొందే ప్రాంతానికికూడా ఉపకరించగలదు.

సిరియాలోని మెస్కీన్ వద్ద యుఫ్రేట్స్ నదికి ఆనకట్ట కట్టి, ఆ నదీజలాన్ని మళ్ళించి, పెద్దపెద్ద సొరంగాలద్వారా ఎడారి మీదుగా పారించి డమాస్కస్ కు చేర్చడం వైట్ ప్రణాళికలో ముఖ్యాంశం. మార్గమధ్యంలో జోర్డాన్, లిటానీ, యార్ మక్ నదులుకూడా దీనిలో వచ్చి పడగలవు.

ఇలా మెస్కీన్ వద్ద యుఫ్రేట్స్ నదిని మళ్ళించినప్పుడు అక్కడ 34,000 చదరపు మైళ్ళు విస్తీర్ణం వుండగల సరస్సు ఆర్మీనియా పర్వత శ్రేణిలోని ఆరారాత్ శిఖరంపై ఏర్పడుతుంది. కనుక నీటికోసం ఇజ్రాయల్ ఆందోళన పడవలసిన అగత్యమే వుండదు.

ఇజ్రాయల్ వలెనే ఇతర దేశాలుకూడా లాభం పొందగలవు. ఆరారాత్ శిఖరం 16,9000 అడుగుల ఎత్తున వుండగలదు కనుక వరదల కంట్రోల్ కు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి గాను టర్కీకి చెందిన భూభాగంలో ఆనకట్ట కట్టవచ్చు. లాకులుకూడా నిర్మిస్తే వందలకొలది మైళ్ళవరకు ఈ నదిలో పడవలు తిరగడానికి వీలవుతుంది. టిగ్రిస్ నదిలో కలుస్తున్న ఉపనదులకు ఆనకట్టలు కట్టడంద్వారా టిగ్రిస్ నదికి చేరే నీటినికూడా ఈ నదికి చేర్చవచ్చు. అదనుకు తగినట్టు వ్యవహరిస్తే మధ్యప్రాచ్యం స్థిరపడేటట్టు మనం చేయవచ్చు. మధ్యప్రాచ్యం స్థిరపడిననాడు ప్రపంచం మొత్తం స్థిరపడినట్టే కాగలదు.

# ఆసియాను ఆసియావాసులే రక్షించుకోవాలి

## ఎ. ఆగ్నేయ ఆసియా

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరంనుంచి ఇంతవరకు జరిగిన దాన్నిబట్టి చూస్తే దూరప్రాచ్యం కమ్యూనిజం బారినుంచి రక్షింపబడగలదని ఆశించడానికి తగు కారణ మేమీ కనుపించదు. దూరప్రాచ్యాన్ని అమెరికా రక్షించ గలదని అనుకోడానికి ఆస్కారమే లేదు.

చైనీస్ నేషనలిస్టు ప్రభుత్వం క్రుళ్లిపోయిన యాపిల్ పండువలె రాలిపోయింది. కాని, సత్యం ఒక్కటే. ఒకప్పుడు జపాన్‌ను చైనీస్ ప్రజలు ప్రతిఘటించినట్టు, ఇప్పుడు కమ్యూనిస్టులనుకూడా వారు ప్రతిఘటించివుంటే, ఇంత తొందరలో కమ్యూనిజానికి చైనా లొంగిపోయేది కాదన్నదే అది.

మనం మరింతగా డబ్బుపెట్టి, సైనికబల సంపత్తిని పంపి, కమ్యూనిస్టులను చైనా చాయలకు రానివ్వకుండా మనం చేసి వుంటే, అది మనకు అనవసరమైన భారంగా తయారయ్యేది. ఏ దేశాన్ని అయినా, ఎంతోకాలం దేని నుంచి అయినా అమెరికా రక్షించజాలదన్నది సత్యం. ఆసియా విషయంలోను, ఆఫ్రికా, మధ్యప్రాచ్యం, యూరప్‌ల విషయంలోను ఇది సత్యం. ఏ దేశానికైనా మనం చేయ గలిగిందేమంటే, ఆ దేశం ఆత్మరక్షణకుగాను పోరాటం సాగించడానికి తగు అవకాశాన్ని చేకూర్చడం మాత్రమే.

అనాదినుంచి మనతో అత్యంతస్నేహంగా వుంటున్న చైనానే మనం రక్షించజాలక పోయినప్పుడు ఫ్రెంచి

ఇండోచైనాకు గాని, లేదా ఇండియా, పాకిస్థాన్‌లకు గాని మన మేమి చేయగలం?

కమ్యూనిజంనుంచి ఆగ్నేయ ఆసియాను రక్షించడానికి రకరకాల ఫలితాల నివ్వగల రకరకాల ఆయుధాలు మనవద్ద వున్నాయి.

(1) ప్రజాస్వామ్యం, ధనికవాదాల మహాత్మ్యాన్ని ఇంకా మనం విశదీకరిస్తూనే వుండవచ్చు. దురదృష్టవశాత్తు ఇప్పటికే దానిలో దేనినో ఒక దానిని పరిహరించి ఒక దానినే స్వీకరించ గల స్తోమత్తు మనకులేదు.

(2) ఆ దేశాల ప్రభుత్వాలకు మనం ఆర్థిక సహాయాన్ని చేయవచ్చు. నిస్సందేహంగా మనం ఆ సహాయాన్ని చేయాలి. ఆర్థిక సహాయంలో ఎలాంటి ఫలితం వుండగలదో పరిశీలించ డానికి 1945 నుంచి 1945 లోపున చైనాకు మన మిచ్చిన 3,00,00,000 డాలర్ల సంగతి పరికిస్తేచాలు.

(3) ఆ దేశాలలో సంస్కరణలను అమలు జరప వలసిందిగా మర్యాదగా, మన కేమీ పట్టనట్టుచెప్తూ, వాటిని మనం ప్రోత్సహించవచ్చు—ఇది మనం చైనాలో చేయనే చేశాము.

(4) జాతీయతత్వాన్ని, మాతృదేశ భక్తిని మనం ప్రోత్సహించ వచ్చు. తమకు కొత్తగా సిద్ధించిన స్వాతంత్ర్యం వల్లకూడా తామేమీ ప్రయోజనం పొందలేదని ఎంతకాలం వరకైతే ఆ దేశాల ప్రజలు గ్రహించలేకుండా వుంటారో అంత కాలంవరకే ఇది పని చేస్తుంది.

(5) ఆసియాలో కోమిన్‌టరన్ వ్యతిరేక కూటాన్ని ఏర్పరచి, దానికి సైనిక బలసంపత్తితో సహా సకల విధాల సహాయం చేయగల మని మనం హామీ నివ్వవచ్చు. కమ్యూనిస్టు విప్లవాలు అప్పటి కప్పుడే ఉద్భవించేవి కనుక మనం ఎవరితో పోరాడగలం.

ఈ ప్రతిపాదనలలో అన్నీగాని లేదా కొన్నిగాని సర్వదా వినబడుతూ వుంటాయి. కాని ఇవి అన్నీ ప్రమాదాన్ని కొంతకాలందాకా ఆపి వుంచడానికి ఉపకరించేవే గాని, వాటితో పాటు ప్రజల జీవనవ్యయ ప్రమాణాన్ని వృద్ధి చేయడానికై విజ్ఞతా పూర్వకంగా తయారు చేయబడిన ప్రణాళికలను అమలు జరపనిదే, ఇంతకంటే వీటివల్ల మరేమీ ప్రయోజనం వుండదు.

యునైటెడ్ స్టేట్స్ ఒక్కటే, పట్టుపట్టి ప్రాచ్యఖండ వాసుల జీవనవ్యయ ప్రమాణాన్ని పెంచజాలదు.

కాగా, దూరప్రాచ్యం అభ్యుదయానికి అవరోధంగా నిలిచిన ఆటంకాలను తొలగించి వేయడమే ఇప్పుడు అమెరికాకు ప్రధానంగా పరిణమించిన కార్యక్రమం.

ధనికవాదంవల్ల ఏమి లాభం చేకూరగలదో చేసి చూపించవలసిందని పాకిస్థాన్ ఆర్థిక మంత్రి గులాం మహమ్మద్ వివరిస్తూ, కిందివిధంగా అన్నాడు:—

"యునైటెడ్ స్టేట్స్‌లో చదరపు మైలుకు 42 మంది ప్రజలు వున్నారు. మరి మా దేశంలో 229 మంది వున్నారు. మీ ఉన్నత జీవన వ్యయ ప్రమాణాన్ని రక్షించుకోవడమే

ప్రధానమని మీరు భావిస్తే, మీ ఏడుపు మీరు ఏడవండని, మరొకరి సహాయాన్ని అర్థించడానికి మా దేశప్రజలు ప్రయత్నిస్తున్నారు."

తనశక్తి యుక్తులను వున్నవాటికంటే విశేషంగా యునైటెడ్ స్టేట్స్ భావిస్తున్నదని, కమ్యూనిజమ్ నివారణకు అమెరికా చేయగల సహాయం ఒకటేనని చెబుతూ ఆ సహాయాన్ని పాకిస్థాన్ ఆర్థిక మంత్రి గులామ్ మహమ్మద్ ఇలా వివరించాడు :

"ఆసియా ఖండంలోని ఏ దేశంకూడా ఇతరుల సహాయం లేనిదే, ఇంతవరకు ఒకే పంట పండుతున్న మేరలో రెండు పంటలను పండించ జాలదు. అట్టి సహాయాన్ని అమెరికా చేయడం సముచితం."

నిజంగా జరగవలసిందింతే అయితే, దీనికి సమాధానం సిద్ధంగానే వుంది. ప్రాచ్యఖండంలో ఆహారోత్పత్తి నధికం చేయడానికి తగు మార్గాలు వున్నాయి. అమలు జరపబడు తున్నాయి.

పశువులకు . తగిలే పెద్దరోగం ఏ విధంగా నివారించ బడిందో పరిశీలిస్తే దీని ప్రయోజనం తెలియగలదు. ఆసియా మొత్తంలో ఏడాదికి 20,00,000 పశువులు దీనివల్ల మరణిస్తూ వుంటే, ఒక్క చైనాలోనే ఏడాదికి 10,00,000 పశువులు మరణిస్తున్నవి. ఈ వ్యాధిని ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో సెయింట్ లారెన్స్ నదిపై గల ఒక లంకలో స్థాపించబడిన అమెరికన్ పరిశోధక కేంద్రం నిర్మూలించ

గలిగింది. ఈ కేంద్రం తయారుచేసిన వాక్సిన్‌ను ప్రపంచ వ్యవసాయ, ఆహారసంస్థ విశేషంగా ఉపయోగిస్తున్నది. ఈ విధంగా ప్రపంచం మొత్తంలో పది సంవత్సరాలలో ఈ వ్యాధి సమూలంగా నాశనం చేయబడగలదు.

ఇక వరిపంట సంగతి—ప్రపంచంలోని సగం జనాభాకు బియ్యమే ముఖ్య ఆహారం. ఇప్పుడు ప్రపంచం మొత్తంలో కరువుగా వుండేది బియ్యానికే. యుద్ధకాలంలో విడిచిపుచ్చబడిన 150 లక్షల ఎకరాల మాగాణి భూమిలో ఇంకా సేద్యం ప్రారంభమే కాలేదు. వరిపంట పండించడానికి అనువైన మరొక 250 లక్షల ఎకరాలభూమి బంజరుగా పడివుంది. ప్రతి సంవత్సరం పురుగువల్ల నాశనమయ్యేదికానీ, నిల్వకు తగిన సదుపాయాలు లేనందువల్ల నాశనమయ్యేదికాని 1,20,00,000 టన్నుల బియ్యందాకా వుంటుంది. అంటే ప్రపంచం మొత్తంలో వర్తకానికి లభించేదానికంటే ఇలా నష్టమయ్యేదే నాలుగురెట్లు వుంటుందన్న మాట. తగు రవాణా సౌకర్యాలు లేనందువల్ల మిగిలిన బియ్యమంతాకూడా మార్కెట్లకు చేరడం లేదు. ఎక్కువ మరపట్టడంవల్లగాని, లేదా అన్నం వండడానికి తగిన పద్ధతులు అందరికి తెలియక పోవడంవల్లగాని నూటికి 10 నుంచి 25 వంతులవరకు బియ్యం పారుపోతున్నది.

ధాన్యం ఉత్పత్తి పెంచడానికి కోట్లకొలది డాలర్లతో ప్రణాళికలను తలపెట్టవలసిన పని లేదు. ఆధునిక పద్ధతులను అనుసరించడం ద్వారా, ఇప్పుడు అందుబాటులో గల సాధన సంపత్తితోనే నూటికి పదివంతులదాకా ఉత్పత్తి

నధికం చేయవచ్చునని ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ వివరిస్తున్నది. ఇక పోతే, వ్యాధి నివారణ మార్గాలను అనుసరించడం ద్వారా నూటికి 50 వంతులు దాకా ఉత్పత్తి పెంచవచ్చు.

ధాన్యం నిల్వచేయడానికి కొత్త మార్గాలను ఒకసారి ప్రజలకు చూపిస్తే, వారంతట వారే ఆ పద్ధతుల నవలంబించి, తగు ఏర్పాట్లు చేసుకోగలరు. ఇదే విధంగా పురుగులనుంచి ధాన్యాన్ని కాపాడ్డంలోనేమి, తరుగు పోకుండా పుష్టి తగ్గి పోకుండా ధాన్యం మరపట్టించడంలోనేమి, ఆహారపు పుష్టి తగ్గిపోకుండా అన్నం వండడంలోనేమి వారికి శిక్షణనిస్తే, వారంతట వారే ఆ తర్వాత ఆ పద్ధతుల నవలంబించి బియ్యం పారుపోకుండా జాగ్రత్తపడగలరు.

బియ్యం ఎక్కువయినపుడు మనుష్యులకు పుష్టి చేకూరుతుంది. అప్పుడు మలేరియావంటి వ్యాధులను తట్టుకోడానికి వారికి శక్తి వస్తుంది. సయామ్‌లో ఏటా [illegible]0,00,000 మందికి మలేరియా తగులుతుంది.

ఇండియా సాలీనా 4,00,00,000 టన్నుల ధాన్యాన్ని ఉత్పత్తి చేస్తుంది. దాదాపు 25,00,00,000 డాలర్ల ఖర్చుతో 25,00,000 టన్నుల ధాన్యాన్ని ఏటా దిగుమతి చేసుకుంటుంది. అయినా ప్రజలకు కడుపునిండా తిండి వుండదు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో ప్రారంభమైన రేషనింగ్ ఇంకా తొలగించబడలేదు. ఇప్పటికీ 20 కోట్ల మందికి రోజుకు పది ఔన్సుల రేషన్ మాత్రమే ఇవ్వబడుతున్నది. అయినప్పటిక

ఇండియా మొత్తానికి సరిపడే ఆహార పదార్థాలు ఉత్పత్తి కావాలంటే ఇప్పటి ఫలసాయం నూటికి పదివంతులు పెరగ వలసి వుంటుంది. అనగా, ఇప్పుడు సాలీనా 4,00,00,000 టన్నులు మాత్రమే పండుతున్నందున 4,44,00,000 టన్నుల వరకు పంట పెరిగితే చాలునన్నమాట.

అధికోత్పత్తిని సాధించడానికి ఇండియాకు శక్తి కలదా లేదా అన్న సమస్యకే అవకాశం లేదు. భారతీయ రైతు ఎకరానికి 1,133 పౌనుల ధాన్యం పండిస్తూవుంటే అమెరికన్ రైతు ఎకరానికి 2,293 పౌనుల వరకు పండిస్తున్నాడు. ఇండియాలో ఎకరానికి 1,133 పౌనులకు మించి ధాన్యం పండకుండా వుండడానికి ప్రకృతిసిద్ధమైన అవరోధాలు ఏమీ లేనే లేవు. భూమికూడా సారంలో తక్కువైనదికాదు. అమెరికాలో భూమికి ఎత్తులు పెట్టినట్టే ఇండియాలోకూడా ఎత్తులు పెట్టితే అక్కడకూడా అమెరికాలో తీసినంత ఫల సాయం తీయవచ్చు.

ఇండియాలో అధికోత్పత్తిని—అధిక ఫలసాయాన్ని సాధించడానికి ఎంతగా అవకాశం వున్నదో అంత అవకాశం ఆసియాఖండం మొత్తానికి వుంది. ఒక్క ఇరిగేషన్ ద్వారా మాత్రమే నూటికి 50 వంతులనుంచి 100 వంతులదాకా ఇండియాలో అధిక ఫలసాయాన్ని తీయవచ్చునని, ఎరువుల వాడకంద్వారా నూటికి 20 నుంచి 30 వంతులదాకా అదనపు పంట పండించవచ్చునని 1945 లో ఇండియా వ్యవసాయ (ఆహార) ఉత్పత్తిశాఖ డైరెక్టర్ డి. ఆర్ సేథ్ అంచనా

వేశారు. ఇప్పటికింకా 90 లక్షల ఎకరాల భూమి—అనగా ఇండియా మొత్తంలో సేద్యానికి పనికివచ్చే భూమిలో నూటికి 26 వంతులుదాకా ఇప్పటికీ సాగులోనికి రానేలేదు.

ఉత్తర భారతంలో స్థాపించబడిన మిషనరీ అలహాబాద్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూట్ పొందిన అనుభవంవల్ల వ్యవసాయంలో అధునాతన మార్గాలను అనుసరించడానికి ఆసియా వాసులు ఉత్సహిస్తున్నారని స్పష్టమవుతున్నది. నాగేటి చాలు వెడల్పు ఇప్పటికంటె దాదాపు రెట్టింపు చేయడానికి ఉపకరించే ఉక్కు నాగళ్ళను ఈ ఇన్‌స్టిట్యూట్ తయారు చేసింది. వెంటనే ఈ నాగళ్ళకోసం రైతులు ఎగబడ్డారు. పాడిగొడ్లను అన్యజాతులతో కట్టించడంద్వారా లోగడ ఒక్కొక్క పశువు ఇస్తున్న పాలకంటె ఇప్పుడు మూడు రెట్లు ఎక్కువగా పాలను ఆ ఇన్‌స్టిట్యూట్ తీయగలిగింది. అది చూచి రైతులు తమ పశువులనుకూడా ఇతర జాతులచే తొక్కించడంద్వారా సంకర జాతులను సృష్టించి, అధికంగా పాల నుత్పత్తి చేయగలుగుతున్నారు.

అతి సామాన్యమైన, సద్యః ఫలితాన్నివ్వగల ఈ కార్యక్రమాలవల్ల దూరప్రాచ్యం మొత్తానికి అవసరమైన ఆహారంలో అతి స్వల్పభాగాన్ని మాత్రమే పండించడం సాధ్యపడుతూంది.

అధికోత్పత్తి సాధనకు భూమి సంస్కరణలు అమలు జరగడం అత్యావసరం. భూమినంతనీ పెద్దపెద్ద ఖండాలుగా చేస్తేనేగాని వ్యవసాయక్షేత్రాలను నెలకొల్పి, వాటిని

నిర్వహించడానికి తగినంత భూమి లభ్యంగాదు. ఎరువుల వాడకం పద్ధతిలోకూడా మార్పులు రావాలి. రైతులకు అందు బాటులో వుండే ధరలకు కృత్రిమ రసాయనిక ఎరువులు దొరికి తేనేగాని ఇది సాధ్యంకాదు. ఇరిగేషన్‌కు ఇప్పటికంటె ఎక్కువగా నీరు సరఫరా కావాలి. ఏనాటికైనా యంత్రాలను వ్యవసాయ క్షేత్రాలు ఉపయోగించాలి. ఈ సంస్కరణలన్నీ జరిగిననాడు ఆహారాన్ని అత్యధికంగా ఉత్పత్తి చేయవచ్చు.

అయితే, ఈ సంస్కరణలలో కొన్నింటికి అమితంగా డబ్బు ఖర్చుపెట్టవలసి వుంటుంది.

ఆగ్నేయ ఆసియాలో మామూలు రైతుకు సగటున అయిదేసి ఎకరాలు మాత్రమే వుంది. అమెరికాలో ఒక్కొక్క వ్యవసాయ క్షేత్రంకింద సగటున 145 ఎకరాలు దాకా వున్నాయి. సర్వసాధారణంగా ప్రతి భూఖండం అనేక భాగాలుగా విభజించబడుతూ వుంటుంది. అందుచేత, ఒక్కొక్కరి పొలం పీలికలవలె తేలుతూ వుంటుంది. భూసంస్కరణలను అమలుజరిపి, సహకార సంఘాలు స్థాపించి, రైతులచేత అధికంగా పండించేటట్టు చేయగలమని చైనాలో కమ్యూనిస్టులు ప్రచారం చేయడంవల్లనే వారికి విశేష ప్రాబల్యం చేకూరింది. దూరప్రాచ్యంలోని తదితర దేశాలకు కూడా చైనాకు పట్టిన గతి తప్పవలెనంటే ఆ దేశాలలో తక్షణమే భూసంస్కరణలు అమలు జరపడం, సహకార సంఘాలను స్థాపించడం అత్యావసరం. భూసంస్కరణలు ఎంత

అవసరమో అంతగానూ మేలురకం ఎరువుల వాడకాన్ని ప్రచారం చేయడం అవసరం.

ప్రాచ్యఖండంలోని వ్యవసాయ పద్ధతులు అన్నిరకాల పరీక్షలకు ఆగి, సుస్థిరమైనవిగా తేలినవని సర్ ఆల్బర్ట్ హొవార్డ్ పేర్కొన్నది యదార్థమే కావచ్చు. ఇందుకు ఉదాహరణలను పేర్కొంటూ, చైనాలో వ్యవసాయ భూమి చిన్నచిన్న ఖండాలుగా విభజించబడి సాగు చేయబడుతూ వచ్చినందునే 40 శతాబ్దాలు గడిచినా ఇంకా సారం విరిగి పోకుండా వున్నదని ఆయన పేర్కొన్నాడు. కాని, ఇతరులు చూపించిన భోగట్టాలు అంత ఉత్సాహవంతంగా లేవు. చైనాలో 13,40,00,000 ఎకరాల భూమి, ఇండియాలో 16,70,00,000 ఎకరాలభూమి బీటలు వారి సేద్యానికి పనికి రాకుండా పోయిందని వారు చెబుతున్నారు. ఆగ్నేయ ఆసియా అంతటిలోను భూమి ఇలా బీటలు వారడం మామూలు. ఇండియాలో భూమి బీటలు వారడానికి ప్రధాన కారణం పశువుల పేడ ఎరువుగా తిరిగి పొలానికి దక్కకుండా వంట చెరకుగా ఉపయోగించబడ్డమే కారణం. వరిగడ్డి మురగవేసి ఎరువుగా భూమికి వినియోగించడానికి మారుగా పశువులకు మేతగా ఉపయోగించబడుతుంది. వంట చెరుకును కొనుక్కోడానికిగాని, పశువులకు ఇంకొక మేత కొనడానికి గాని రైతులవద్ద తగినంత డబ్బులేదు కనుక, వారి కెంత చెప్పినా వారీ రెండింటినీ మానరు.

వ్యవసాయానికి యంత్రాల వినియోగంకూడా తక్షణం జరగవలసిన సంస్కరణయే. ఇతర బడుగుదేశాల వలెనే ఇక్కడకూడా యంత్రాల వినియోగంద్వారా మహోద్భుతాలను సాధించవచ్చు. గ్రామీణ సహకార సంఘాలు విడివిడిగాను, లేక సమష్టిగా కొందరికి అప్పులు ఇవ్వడంద్వారా ట్రాక్టర్లను, థ్రాషర్స్‌ను, రీపర్స్‌ను, తదితర వ్యవసాయ పరికరాలను కొనిపించి, అవి ఉపయోగించబడేటట్టు చూడాలి.

ఆసియాలో ఆగ్నేయ ప్రాంతం మధ్యప్రాచ్యంకంటె ఒక అడుగు ముందువేసింది. ఏమైనా భారీ ఎత్తున అమలు జరిగే ప్రణాళికలవల్ల లాభాన్ని పూర్తిగా అనుభవించగల స్థితిలో అది వున్నమాట వాస్తవం. ప్రాంతీయ పురోభివృద్ధి సాధనకై ఆ యా ప్రాంతాల మహోద్భుత కార్యక్రమాలు తలపెట్టబడినవి. అప్పుడే కొన్ని కార్యరూపం పొందుతున్నవి. వీటిలో నీటి పారుదల ప్రాజెక్టులకు అత్యధిక ప్రాధాన్యమివ్వబడుతున్నది.

తూర్పు సింహళంలో అమెరికన్ ఇంజనీరింగ్ ఫరమ్ మారిసన్—నూడ్‌సన్ ఇరిగేషన్‌కు, వరద కంట్రోల్‌కు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి పెద్ద ఆనకట్టను—గల్ జయాడామ్‌ను నిర్మిస్తున్నది. ఇప్పుడు ఒక్కొక్క అమెరికన్ ఉపయోగించే విద్యుచ్ఛక్తిలో నూరింట ఒక వంతును మాత్రమే సింహళ దేశస్థుడు ఉపయోగిస్తున్నాడు. ఈ ప్రాజెక్టు 1953 నాటికి అదనంగా 1,20,000 ఎకరాలను సాగులోనికి తీసుకొనివచ్చి

5,00,000 మందికి ఆహార పదార్థాలను సరఫరా చేయడమే గాక ఇప్పటికంటె ఇరవై రెట్లు ఎక్కువగా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయగలుగుతుంది. ఇప్పుడు మరొక 2,50,000 ఎకరాలను సాగుచేయడానికి, 50,000 కిలోవాట్స్ విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేయడానికి అనువైన మరొక ప్రణాళిక గురించి పరిశీలన జరుగుతున్నది. సయాంలో దేశం మధ్యన గల మైదానం ప్రాంతంలో ముఖ్యంగా వరి పండుతుంది. ఇక్కడ అదనంగా 50,00,000 ఎకరాలను సాగు కిందకు తీసుకొని 14 ప్రణాళికలను అమలు జరపడానికి యత్నిస్తున్నారు.

ఈ ప్రణాళిక లన్నింటిలోనికి పెద్దవీ, వెంటనే అమలు జరగగలవని ఆశించతగినవీ ఇండియాలో వున్నాయి. ఇండియా మొత్తానికి సరిపడే ఆహార పదార్థాల నుత్పత్తి చేయడానికి ఇప్పటికంటె అదనంగా 44,00,000 టన్నుల నుత్పత్తిచేస్తే సరిపోనున్నప్పటికీ, అంతవరకే గాక 1,00,00,000 టన్నుల దాకా అధికంగా ఉత్పత్తి చేయడానికి ఇండియా ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది.

ఇండియాలో గల పెద్ద నదులు దాదాపు అన్నింటిపైన—అనగా కోసి, తిస్టా, గోదావరి, తుంగభద్ర, ధీరంగరా, చాంబాల్, దామోదర్, కేశవ్, భాక్రా, లార్జీలపై అనకట్టల కట్టడానికి ప్లానులు తయారు అయినవి. ఇవి వరదలను కంట్రోల్ చేయడానికి, భూసారాన్ని రక్షించడానికి మాత్రమేగాక అదనంగా 5,00,000 ఎకరాలను సాగుచేయడానికి, సాలీనా 76,00,00,00,000 కిలోవాట్స్—అవర్

విద్యుచ్ఛక్తిని అదనంగా ఉత్పత్తి చేయడానికి ఉపకరించ గలవు. ఇప్పుడు ఉత్పత్తి అవుతున్న దానికంటె నాలుగురెట్లు అధికంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కాగలదన్నమాట. అప్పుడు పారిశ్రామిక దారుఢ్యంలో అగ్రరాజ్యాలతో సమాన స్థాయికి ఇండియా చేరగలదు.

ప్రస్తుతం ప్రపంచం మొత్తానికి అవసరమైన ఆహార పదార్థాలు నూటికి పదివంతులు మాత్రమే కొరతగా వున్నవని నారిస్ డాడ్ అంచనా వేశాడు. ప్రాచ్య ఖండానికి సంబంధించి నంతవరకు జనసంఖ్య ఇప్పటి నిష్పత్తిలోనే వృద్ధిగాంచ నున్నప్పటికీ, ఈ లోటు పూడడమేగాక అది మిగులు ప్రాంతంగా పరిగణించగలదని కూడా ఆయన చెప్పాడు.

అయితే, మలయా, బర్మా, సింహళం, ఫ్రెంచి, ఇండో–చైనా, థాయిలెండ్ లకు, కమ్యూనిస్టు చైనాకు మధ్య "సైనిక కుడ్యాన్ని" మనం నిర్మించనిదే ఆ దేశాలలో ఇంతలో వ్యవసాయానికి ఆధునిక పద్ధతులు అవలంబించబడగల సూచనలు కానరావు. ఈ కారణంచేతనే వాషింగ్టన్ లో అత్యంత ప్రాబల్యం కలిగివున్న కొందరు పెద్దలు మనంచేసే సహాయాన్నంతా ఇండియా, పాకిస్థాన్ లపైనే కేంద్రీకరించాలని సలహా నిచ్చారు. ఈ రెండు దేశాలలోను ప్రభుత్వాలు సుస్థిరమైనవని, ఆ దేశాల కమ్యూనిస్టు ఉద్యమం ఇంకా నిలదొక్కుకో లేదని చెప్తూ, ఇప్పుడు వాటికి మనం ధారాళంగా ఆర్థిక సహాయాన్ని చేయడంద్వారా కమ్యూనిస్టు విప్లవాన్ని

గాని, లేదా కమ్యూనిస్టు దండయాత్రనుగాని సంభవించ కుండానే నిరోధించవచ్చునని వీరు వాదిస్తున్నారు.

చైనీస్ కమ్యూనిస్టులు తాము పొందిన విజయాలను పూర్తిగా హరాయించుకోడానికి కొన్ని సంవత్సరాలు పట్టగలవనీ, ఈలోగా, ఆసియా ఖండానికి కొంత వ్యవధి లభించగలదనీ, ఈ వ్యవధిలో భూ సంస్కరణలను, అధి కాహారోత్పత్తినీ సాధించవచ్చునని అనుకున్నప్పటికీ, ప్రాచ్య ఖండం జీవన వ్యయ ప్రమాణాన్ని వృద్ధిచేయడానికి ఇంత మాత్రమే సరిపోజాలదు.

ఆహారోత్పత్తి పెరుగుదలతో నాటి జనసంఖ్యకూడా వృద్ధి గాంచగలరని తెలుసుకున్నాము. కాబట్టి ఆధునిక వ్యవసాయ విధానాలను అమలు జరపడంతోపాటుగానే అతి లాభప్రదం, అభ్యుదయకరం మాత్రమే గాక త్వరితంగా దేశాన్ని సౌభాగ్యవంతం చేయగల పారిశ్రామిక ప్రణాళికలు అమలు జరపడం, సాంఘిక సంస్కరణలుకూడా సాగిపోవడం సంభవించనిదే జనసంఖ్య పెరగడమే తటస్థిస్తే దారిద్ర్యం తగ్గకపోగా దాని ననుభవించేవారి సంఖ్య పెరుగుతుంది.

పరిశ్రమలు నెలకొన బడుతున్నప్పటికీ, ఆ కార్యక్రమం మందకొడిగా సాగి, చాలాకాలంవరకు జనాభా పెరుగుదల నిష్పత్తి తగ్గకపోతే, ఈ పరిశ్రమలు స్థాపించబడినప్పటికీ, ఆసియా రాజ్యాలు దారిద్ర్యంలోనే క్రుంగుతూ వుండగలవని అంతర్జాతీయ కార్మికసంస్థ కార్యాలయం ప్రకటించింది.

పశ్చిమ యూరప్‌లో పారిశ్రామిక విప్లవం సంభవించిన తరువాత 75 సంవత్సరాలవరకు జనన నిష్పత్తి ఏమాత్రం తగ్గకుండా అలాగే వుండిపోయింది. అయితే మరణాల నిష్పత్తి మాత్రం తగ్గింది. ఇదే ఆసియాలోకూడా సంభవిస్తే ఆసియా ఆర్థికాభివృద్ధికి అది తీరని ప్రతిబంధకం కాగలదు.

అందుచేతనే, ఇండియా పారిశ్రామికాభివృద్ధికి తయారు చేయబడిన బొంబాయి ప్రణాళికలో అక్కడక్కడ మెల్లి మెల్లిగా పరిశ్రమలను నెలకొల్పడానికి గాక, ఒక్కుమ్మడిగా ఆదాయం మూడురెట్లు పెరిగి, 15 సంవత్సరాలలో ప్రజల సగటు ఆదాయం దాదాపు రెట్టింపుదాకా పెరిగి పోయేందుకు దోహద మివ్వగల విధంగా పారిశ్రామికాభివృద్ధి లక్షించ బడింది. ఇండియాలో వ్యవసాయమే ప్రధాన జీవనోపాధి. జన సమర్థం వున్నది. అనేక శతాబ్దాలపాటు అభివృద్ధి స్థంభించి పోయింది. అది ఇప్పుడు యూరప్, అమెరికాలకంటే కూడా వేగంగా పారిశ్రామికాభివృద్ధిని సాధించడానికి యత్నిస్తున్నది. కాగా దానికి అనేక ప్రతిబంధకాలు ఎదురుకావడం సహజం.

అయితే, గత వంద సంవత్సరాలుగా లేని సౌలభ్యాలు కొన్ని ఆగ్నేయ ఆసియాకు ఇప్పుడు లభించినవి. ఉత్పత్తి విధానాలలో అనేక ప్రయత్నాలు జరిగి, అవి స్థిరరూపం పొందినవి. కనుక కొత్తగా ప్రయోగాలను జరపవలసిన అవసరం లేకుండా పోయింది. విస్తృత ప్రాంతానికి పరస్పర సహాయ భూతంగా వుండగల అభివృద్ధి కార్యక్రమాలను లక్షించి, ఒకదాని తరువాత మరొకటి అమలు జరపవచ్చు.

విదేశాలనుంచి పెట్టుబడి, యంత్రాలు మాత్రమే గాక, సాంకేతిక నిపుణులుకూడా వచ్చి అవసరమైన సహాయాన్ని చేసి, దేశీయులకు శిక్షణ ఇచ్చేందుకుకూడా అవకాశంవుంది. వీటన్నింటినుంచి ఆగ్నేయ ఆసియాకు కావలసినంత మానవ బలం వుంది. దాని శక్తి స్తోమతులను పాశ్చాత్య రాజ్యాలు సరిగా అంచనా వేయలేకపోయినా, ఈ సంపత్తిని విశేషంగా ఆగ్నేయ ఆసియా వినియోగించుకోవచ్చు.

ఇండియాకు సంబంధించినంతవరకు పారిశ్రామికాభివృద్ధిని లక్షించడానికి అవసరమైన పునాది తయారయి వుంది. అనేక విధాల ఇండియా వెనుకబడియు ఇప్పటికీ పరిశ్రమల విషయంలో చైనాకంటె 100 సంవత్సరాలు ముందెత్తున అది నిలచివుంది. భారతీయుల ఆదాయం క్రమేపీ వృద్ధి పొందుతూ రావడమే దీనికి తార్కాణం. 1867–68 సంవత్సరంలో సాలీనా తలకు 44.2 రూపాయలు ఆదాయమైతే, 1895 నాటికి 55.2 రూపాయలవరకు, 1929 నాటికి 78 రూపాయలవరకు పెరిగింది. 1935 లో ఇండియాలో గల పెట్టుబడి అమెరికాలో తలకు సగటున వున్న పెట్టుబడిలో అయిదవ వంతుకు చేరింది. అయితే, చైనాలో సగటున తలకు వున్న పెట్టుబడికంటె ఇండియాలో వున్న పెట్టుబడి మూడురెట్లు ఎక్కువ.

పారిశ్రామికాభివృద్ధికి ప్రధాన ప్రాతిపదిక కొత్త సాధన సంపత్తి. అందుచేతనే దూరప్రాచ్యంలో తలపెట్టబడిన హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టుల ప్రాముఖ్యం మరింత ఇనుమడించ గలదు.

ఆసియాలో ఇప్పుడు యంత్రశక్తి ఎంత తక్కువగా వినియోగించబడుతున్నదో అమెరికన్ ప్రజాసామాన్యం ఊహించలేదు. ఆసియాఖండం మొత్తంలో హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులద్వారా ఉత్పత్తిచేయడానికి వీలైన విద్యుచ్ఛక్తిలో మూడింట అయిదోవంతు మాత్రమే ఇప్పుడు వినియోగించబడుతున్నది. ఇండియా, పాకిస్థాన్‌లు రెండింటి లోను కలిసి దాదాపు 40 కోట్ల ప్రజలు వుంటే, వారందరూ కలసి ఏడాది మొత్తంమీద వాడే విద్యుచ్ఛక్తి 15 కోట్లమంది అమెరికన్లు కలసి ఒక్క వారంలో ఉపయోగించేది మాత్రమే. ఇండియా, పాకిస్థాన్‌లలో గల ప్రజలలో నూటికి 90 మందికి విద్యుచ్ఛక్తి అందుబాటులోనే లేదు. సగటు లెక్కచూస్తే ఆసియావాసులు ఒక్కొక్కరు వాడే విద్యుచ్ఛక్తికి 180 రెట్ల విద్యుచ్ఛక్తి ఒక్కొక్క అమెరికన్ వాడుతున్నాడు.

అందుచేతనే, బొంబాయి ప్రణాళికలో కొత్తగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రం సంస్థాపన ప్రధానంగా పరిగణించబడింది.

ఆ తరువాతనే రహదారి రవాణా మార్గాలను అభివృద్ధి లక్షించబడింది. బండ్లు, గాడిదలు, కంచర గాడిదలు, నెత్తి మూటలు మాత్రమే ప్రధాన రవాణా సాధనాలుగా పరిగణించ బడుతున్న దేశంలో పండినచోటనే పంట ముఖ్యంగా చెల్లవలసి వుంటుంది. ఒక లోయలో పంట అత్యధికంగా పండి మురిగిపోతూ వుండవచ్చు; ఆ లోయకు అవలనేవున్న పర్వత శ్రేణిపై కాటకంతో ప్రజలు చచ్చిపోతూ వుండవచ్చు.

రహదారుల విషయంలోకూడా చైనాకంటే ఇండియాయే కొంచెం మెరుగు. షాంగ్‌హైలోవున్న మిల్లు యజమానులకు టెన్నీ రాష్ట్రంలోని రైతులు పూరకనే ధాన్య మిచ్చినప్పటికీ దానిని అక్కడినుంచి తెప్పించుకోడానికి అయ్యే ఖర్చును భరించడంకంటే సీటిల్‌నుంచి ధాన్యాన్ని ఆ మిల్లు యజమానులు షాంగ్‌హైకి దిగుమతి చేసుకోవడమే చౌక. హాంగ్‌చౌ రాష్ట్రంలోని మైదాన ప్రాంతంలో బియ్యపు బస్తా 10 డాలర్లు అమ్ముతూవుంటే అదే రాష్ట్రంలోని పర్వత ప్రాంతాలపై అదే బియ్యపుబస్తా 15 డాలర్ల వరకు అమ్ముతూ వుంటుంది. చైనాలో ఏ వస్తువునైనా 50 మైళ్ళదూరం రవాణా చేయడానికి అయ్యేఖర్చు సర్వ సాధారణంగా ఆ వస్తువు ధరను మించి వుంటుంది.

ఫ్యాక్టరీలు నిర్మించబడక పూర్వమే విద్యా ప్రచారం ముమ్మరంగా సాగాలి. ఫ్యాక్టరీలలో తయారైనవానిని కొనేవారుండాలి. వీనిని కొనడానికి ప్రజలకు చేమెల్లా వుండాలి. అధునాతన పద్ధతులద్వారా ఆహారోత్పత్తికి పూనినపుడు ఆహార పదార్థాల ధరలు పెరుగగలవు కనుక, ఆ ధరలకు సైతం వాటిని కొనగల తాహత్తు కార్మికులకు వేతనాలు పెంచడంద్వారా కలిగించాలి. ఇలా కాని పక్షంలో అధికోత్పత్తి సాధనాలద్వారా అదనంగా ఉత్పత్తి అయ్యే ఆహారమంతా ఖర్చుకాకుండా దిగబడిపోయి, ఆ విధంగా ధరలు పడిపోయి తిరిగి క్లిష్ట పరిస్థితి ఏర్పడగల ప్రమాదం కలదని ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థ హెచ్చరించింది.

అందుచేతనే, వెనుకబడివున్న దేశాల అభివృద్ధికై లక్షించబడే భారీ ప్రణాళికకూడా ఒకేసారిగా వందలాది సమస్యలను పరిష్కరించడానికి కృషిచేయాలి. ఇందులో దేనిని వదలివేసినా ప్రమాదమే తటస్థిస్తుంది.

ఆగ్నేయ ఆసియాలోని అభివృద్ధి ప్రణాళికలను ప్రయివేట్ కంపెనీలుకాక ప్రభుత్వాలే అమలు జరపడానికి యత్నిస్తున్నవి. అమెరికాలోకూడా ఇట్టి ప్రణాళికలను ప్రయివేటు కంపెనీలు నిర్వహించడం లేదు. కాకపోతే ప్రాంతీయ అధికార సంఘాలు వాటిని నిర్వహిస్తున్నవి. ఒక్కొక్కసారి సమస్త దేశక్షేమం దృష్ట్యా, ఒక్కొక్కసారి ప్రపంచం మొత్తం క్షేమందృష్ట్యా ఆ ప్రణాళికలను పరిశీలించి నిర్ణయాలు చేయవలసి వుండడమే దీనికి కారణం. మరి అట్టి సందర్భంలో ఇట్టి ప్రాజెక్టుల నిర్మాణానికి అమెరికన్‌లు ప్రయివేటుగా పెట్టుబడులు పెట్టడం మంచిదా ?

అత్యవసర పరిస్థితులలో—ఇండియాలో సంభవించినట్టే— ప్రయివేట్ పెట్టుబడులకు ప్రోత్సాహం కలిగించడానికి గాను ముందుగా పబ్లిక్ పెట్టుబడులతో కార్యక్రమం ప్రారంభించ వలసి వుంటుందని గ్రహించడం అత్యవసరం. ఇట్టి పరిస్థితులలో ఈ పెట్టుబడి పెట్టినందుకుగాను దేశీయ ప్రైవేటు పెట్టుబడులకు, విదేశీయ ప్రైవేటు పెట్టుబడులకు మధ్య ఎలాంటి భేదాన్ని పాటించకుండా వుండాలని హామీ కోరడం సమంజసమే కాగలదు. అలా కానిపక్షంలో ఆసియాలో అమెరికన్‌లకు

అత్యంత వాంఛనీయమైన స్వేచ్ఛా వాణిజ్యం స్వరూపమే కనిపించకుండా పోవచ్చు.

డాలర్ల అవసరాన్ని ఇండియా గుర్తించడంచేత, స్వేచ్ఛా వాణిజ్యంపై విధి నిషేధాలను అది సడలించడమేగాక పది సంవత్సరాలదాకా పెట్టుబడులకు హామీ నిచ్చింది. ఆ తరువాతకూడా పెట్టుబడులు సురక్షితంగా వుండగలవో లేవో చెప్పడం, ఇప్పుడు వూహించడానికి అతీతమైన అనేక పరిస్థితులపై ఆధారపడి వుంటుంది. దేశంలో గల సాధన సంపత్తిని ఎంతవరకు ప్రయివేటు పెట్టుబడులద్వారా అభివృద్ధి పరచవలెనన్నది ప్రజల లక్ష్యంపైన, ఆశయాలపైన ఆధారపడి వుంటుందని "పసిఫిక్ ఎఫెయిర్స్" పత్రిక 1949 జూన్ సంచికలో "ఇండియా ఆర్థికాభివృద్ధికి అవకాశం" అన్న శీర్షిక కింద డి. ఆర్. గాడ్గిల్ వ్రాసిన వ్యాసంలో పేర్కొన్నాడు.

ఆసియా వాణిజ్య వేత్తలకు స్నేహితులవలెను, మార్గదర్శకులవలెను, వారి క్షేమాభిలాషులవలెను అమెరికన్ పెట్టుబడిదారులు వ్యవహరించగలరు. అమెరికన్ వాణిజ్య వేత్తలు దాదాపు అందరూ తమ కార్మికులకు బాగా వసతులు కల్పించి, తమ వుద్యోగులను గౌరవించడమే తమకు అత్యంత లాభప్రదమైన మార్గమని గుర్తించగలిగారు. భారతీయ పారిశ్రామిక వేత్తలు కూడా ఈ సత్యాన్ని గుర్తించగలిగినా రనుకోవడం అనుమానాస్పదమే. భారతీయ పారిశ్రామిక వేత్తలు బహు కొద్దిమంది. వారందరూ కన్సర్వేటివులే. వారింకా ఈ గుణపాఠాన్ని నేర్చుకొనవలసి వుంటుంది.

పారిశ్రామికాభ్యున్నతి సాగినకొలదీ ఆసియాలోని అమెరికన్ పెట్టుబడిదారులు పోటీని నివారించి, ఆసియావాసుల జీవన వ్యయ ప్రమాణం అభివృద్ధి గాంచడానికి తగు సహాయాన్ని చేయవచ్చు.

ఇండియా రైల్వే మార్గాల పునర్నిర్మాణానికీ, కొత్త మార్గాల నిర్మాణానికీ గతసంవత్సరం అమెరికా ప్రైవేట్ పెట్టుబడిదారులు అప్పు పెట్టారు. అంటే, అప్పుడు ఇండియాను ఎదుర్కొన్న క్లిష్ట సమస్యలను పరిష్కరించడానికి మాత్రమే కాక పారిశ్రామికాభ్యుదయానికికూడా వీరు సహాయం చేశారన్నమాట. సమంజసమైన కార్యక్రమానికి, నష్టపడకుండా అప్పు పెట్టడంకంటే ప్రపంచం మొత్తానికి చేయగల మేలు ఏమీ వుండబోదని, ఇదే చతుర్థసూత్ర కార్యక్రమం అమలు జరపడం కాగలదని "న్యూయార్క్ టైమ్స్" పత్రిక వ్యాఖ్యానించింది.

అయితే, అనేక విషయాలలో ప్రయివేటు పెట్టుబడి పెట్టడానికి తగిన అదను ఇంకా రాలేదు. ఈ నూతన మహత్తర ప్రణాళికను ప్రజారోగ్యాన్ని చక్కబరచి, వ్యవసాయాన్ని సమర్థనీయంగా నిర్వహించే పరిస్థితులకు దోహద మివ్వగలట్టి పెట్టుబడులకు ప్రోత్సాహం కల్పించే విధంగా సాంకేతిక ప్రవీణులు తయారుచేయాలి.

దూరప్రాచ్యానికి చతుర్థసూత్ర కార్యక్రమంలో సూచించబడిన దానిలో ప్రధానమైనది హైడ్రో ఎలక్ట్రిక్

పవర్‌ను ముందుగా భూసార రక్షణకు, తదనంతరం పారిశ్రామికాభివృద్ధికి ఎలా వినియోగించుకోవాలో చూపించి, వివరించ గల ప్రాజెక్టు నిర్మాణం. ఇట్టి ప్రాజెక్టును నిర్మించడానికి ప్రణాళిక 1950 లో పూర్తి అయి, ఆ మరుసటి సంవత్సరం నుంచి దేశంలో ఏడాదికొక్కటి చొప్పున ఇట్టి ప్రాజెక్టులు నిర్మించబడవచ్చు.

మళ్ళీ చెప్తున్నాను. పాశ్చాత్యరాజ్యాలు ఇతరులకు మార్గదర్శకం కాగలిగింది ఇట్టి చిన్నచిన్న ప్లాంటులను మాత్రమే నిర్మించి, వాటి నెలా ఉపయోగించుకోవాలో బోధించ గలిగినప్పుడే. ఇక ఆ తరువాత కార్యక్రమాన్ని ఏ దేశానికి ఆ దేశమే నిర్వహించుకోవాలి.

కమ్యూనిస్టులనుంచి ఆసియాను మనం రక్షించలేము. కాని, మన సహాయంతో ఆసియా వాసులే కమ్యూనిజం నుంచి ఆసియాను రక్షించుకోగలరు.

## ఆసియాను ఆసియావాసులే రక్షించుకోవాలి

ఎ. ఓషియానియా, చైనా

**తూ**ర్పు ఆసియాలో జపాన్‌తో ప్రారంభమై ఫార్మోజా, ఫిలిప్పీన్స్, యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఇండోనీసియా, న్యూగినీల మీదుగా ఆస్ట్రేలియా, న్యూజిలెండ్‌లవరకు చిన్న చిన్న లంకలు అనేకం ఉన్నాయి.

ఈ లంకలలోకూడా అభివృద్ధి ప్రణాళికలు అత్యవసరంగా అమలు జరపబడాలని అర్థించబడుతున్నది. 1949 లో ఐక్య రాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో ఫిలిప్పీన్స్ ప్రతినిధి జనరల్ కార్లోస్ రోములో ఉపన్యసిస్తూ దూరప్రాచ్యంలోని వెనుక బడివున్న దేశాలలో వ్యావసాయిక, పారిశ్రామిక రంగాలలో అభివృద్ధిని సాధించవలసిన ఆవశ్యకతను వివరించి, ఈ దేశాలను తక్షణం పరిశీలించి, ప్లానులు తయారు చేయడానికి అమెరికన్ నిపుణులను పంపించడం, అమెరికన్ సాంకేతిక శాస్త్ర నిపుణులను పంపించి పరిశ్రమల నిర్వహణలలో ఆ యా దేశాల వాసులకు శిక్షణ నిప్పించడం వెంటనే జరుగ వలసివున్న కార్యక్రమాలని పేర్కొన్నాడు.

ఆస్ట్రేలియన్ ఆర్థిక శాస్త్రవేత్త డగ్లస్ బెర్రీకూప్‌లాండ్ తయారుచేసిన ప్రణాళిక మరింత ఆశావహమైనది. అమెరికా, బ్రిటన్‌లు కలసి దూరప్రాచ్యంలో అభివృద్ధి ప్రణాళికలను అమలు జరపాలని, ఇందుకు అవసరమైన పెట్టుబడి అమెరికా ప్రభుత్వం, ప్రయివేట్ పెట్టుబడిదారులు కలిసి పెట్టాలని ఆయన సూచించాడు. ఆస్ట్రేలియా ఒక్కటే 10,00,00,000 నుంచి 15,00,00,000 డాలర్లదాకా అమెరికన్ పెట్టుబడిని ఉపయోగించుకో గలదని అన్నాడు. ఇండియా, పాకిస్థాన్, సింహళాలకుకూడా ఈ ప్రణాళిక వర్తించాలన్నాడు. ఆసియా దేశాల అభివృద్ధికి ప్రణాళికలు అమలు జరుపబడితే ప్రపంచం లోని దాదాపు సగం జనాభా అభ్యుదయానికి కార్యక్రమాలు అమలు జరిగినట్టే కాగలదు.

ఇట్టి కార్యక్రమం పాశ్చాత్య రాజ్యాలు, అమెరికా కలసి పెట్టనున్న పెట్టుబడితో ప్రారంభించబడవచ్చు. కాని ఇంత వరకు దూరప్రాచ్యంలో విశేషంగా ధనం పెట్టుబడి పెట్టడానికి అమెరికా తటపటాయిస్తున్నట్టు కనబడుతున్నది. యూరప్‌కు పెట్టుబడి పెట్టడానికి కాళ్ళు విరగ దొక్కు కుంటున్నది. ఓషియానియా అభివృద్ధికి తయారుచేయబడే ప్రణాళిక చాల వరకు జపాన్‌పై ఆధారపడి వుండవచ్చు. జపాన్‌ను దాని పరిసరాలలోగల దీవులను విశ్వసించడానికి ఇంకా చాలాకాలం పట్టవచ్చు.

జపాన్ దీవులు పరస్పర సహకారంతో వ్యవహరించినా, ఆగ్నేయ ఆసియా అభివృద్ధి ప్రణాళికలకు సహాయభూతంగా, ఆ కార్యక్రమానికి అనుసంబంధించి వుండేటట్టుగానే ఈ దీవుల అభివృద్ధి ప్రణాళికలు రూపొందించబడినా, దానివల్ల పెద్దగా ఒరిగేది ఏమీ వుండకపోవచ్చు. ఈ దీవుల శ్రేణికి "హృదయ" మనదగిన చైనా కల్లోలానికి మూలస్థావరమై వున్నంతకాలం ఈ దీవులు సురక్షితంగా వుండజాలవు.

అమెరికా స్వయంగా తయారుచేసి, పెట్టుబడిపెట్టే ప్రణాళికలను అమలు జరపడానికి యత్నిస్తే, అమెరికాపై అవిశ్వాసం ప్రబలడానికే అది ఉపకరిస్తుంది.

కాని, ఈ లక్ష్య సాధనకు ఇతర మార్గాలు వున్నాయి. ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సైనిక రంగాలలో అమలు జరప వలసిన కార్యక్రమాన్ని గురించి ఆసియా రాజ్యాలు తమలో

తాము ఒక ఒడంబడికకు వస్తే, చతుర్థసూత్ర కార్యక్రమం ప్రకారం అధికాహారోత్పత్తికి, ఎరువుల, పరిశ్రమల అభివృద్ధికి, జీవన వ్యయ ప్రమాణాల అభివృద్ధికి అమెరికా సాంకేతిక సహాయాన్ని చేయడమే అది. చైనా మినహా దూరప్రాచ్యం సుస్థిరంగామనగలదని నమ్మకం ఏర్పడినపుడు క్రమేపీ పెట్టుబడి పెట్టడానికి అమెరికన్‌లు ముందుకువస్తారు. పరిస్థితులు స్థిరపడి నపుడు ప్రపంచ బ్యాంకికూడా అభివృద్ధి ప్రణాళికల అభివృద్ధికై ధారాళంగా అప్పులు ఇవ్వవచ్చు. ఆర్థిక, సాంఘిక రంగాలలో ఆసియా దేశాలను శీఘ్రగతిని అభివృద్ధి పరిచినట్లయితే ఆసియారాజ్యాల సమాఖ్య కమ్యూనిస్టు చైనాపై ప్రాబల్యం కూడా సంపాదించవచ్చు.

ఇట్టి కార్యక్రమ నిర్వహణకు అమెరికా పూర్తిగా సహాయం చేయవచ్చు. అయితే, ఆసియావాసులు మాత్రమే ఆసియాను రక్షించుకొనవలసి వుంటుంది.

అమెరికన్‌ల పరిస్థితికంటెకూడా తమ పరిస్థితియే మెరుగని న్యూజిలెండ్‌వాసులు అనుకుంటున్నారు. అక్కడ నిరుద్యోగ సమస్యయే లేదు. కొత్తగా వలసలకు సమ్మతించక పోతే, ఆర్థికాభివృద్ధికి గరిష్ఠ ప్రమాణాన్ని నిర్ణయించి, అక్కడితో కార్యక్రమాలను నిలిపివేయవలసిన స్థితికి అది చేరింది. పోగా, న్యూజిలెండ్, ఆస్ట్రేలియాలలో పరస్పరం అనుసంబంధించి వుండగల అభ్యుదయప్రణాళికలను అమలు జరపవలసిన ఆవశ్యకత అంతగా లేదు.

న్యూజిలెండ్ పారిశ్రామికాభివృద్ధికి కొన్ని ప్రణాళికలను తయారుచేసుకొంటున్నది. కాగితపు పరిశ్రమను, హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులను వృద్ధి చేయడానికి ముఖ్యంగా లక్షిస్తున్నది. ఆస్ట్రేలియాలో 1947-48 నాటి ఆదాయాన్ని పరిశీలిస్తే ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభం కాక ముందుకంటే ఆ సంవత్సరానికి సగటు ఆదాయం దాదాపు రెట్టింపు అయిందని, ఆదాయంలో సగంవంతు పెట్టుబడులకు వినియోగించబడుతుందని తేలుతుంది. ప్రపంచ రాజ్యాలలో భాగ్యవంతమైనవాటిలో ఆస్ట్రేలియా ఒకటి. మొన్నమొన్నటి దాకా ఎందుకూ పరికిరాకుండా వున్న చైనాగడ్డిని బట్టల పరిశ్రమలతోనే పోటీ చేయడానికి తగు సాధనంగా ఆస్ట్రేలియన్‌లు మార్చగలిగారు. చైనాగడ్డితో ఇంకా గ్యాస్ వత్తులను మాత్రమే అమెరికా తయారుచేయగలుగుతూ వుంటే, చైనాలో అది పరుపులు, చేపలు పట్టడానికి పనికివచ్చే చిన్నపడవలు, వలలు, లేసులు తయారుచేయడానికి ఉపయోగించబడుతున్నది. రైమో అన్న పేరుతో ప్రసిద్ధి గాంచి, ఆసియా మొత్తంలో దొరికే ఈ గడ్డి నూలుదారం కంటేగాని, సిల్కుదారంకంటేగాని దాదాపు 8 రెట్లు గట్టిగా వుంటుందని, జనపనారకంటె మూడు రెట్లు గట్టిగా వుంటుందని తేలింది. అయితే, దానిలో వుండే జిగురును, ఈనలను వేరుచేయడానికి చాలా వ్యయప్రయాసలకు లోను గావలసి వుంటుంది.

సిడ్నీ వర్తకుడు మార్క్ ఎం. వైజ్ దానితో చౌకగా జిగురును, ఈనలను వేరుచేసి, మిగిలిన దూదివంటి మెత్తని పదార్థంతో దారంతీసి, సిల్కుకంటె సన్నగాను, గట్టిగాను వుండగల బట్టలను తయారుచేసే విధానాన్ని కనిపెట్టాడు. దీనితో ప్రపంచంలో వస్త్ర పరిశ్రమ స్వరూపమే మారిపోయి, ఆస్ట్రేలియా ఆదాయం కోట్లకొలది పెరిగిపోవచ్చు.

ఆస్ట్రేలియన్ అడవులలో దొరికే కలప చాల గట్టిగా వుంటుంది. కనుక గృహోపకరణాలను, ఇతర వస్తువులను చేసుకోడానికి అది పనికిరాదు. కాబట్టి, విదేశాలనుంచి మొత్తం కలపను దిగుమతి చేసుకుంటుంది. అమెరికా, కెనడాల నుంచి ఈ కలప దిగుమతి చేసుకోడానికి డాలర్ల కొరత ప్రతిబంధకంగా నిలచినందుకే అది స్వయంగా మెత్తని కలపనిచ్చే అడవుల పెంపకాన్ని ప్రారంభించింది. చాలాకాలం క్రితమే న్యూజిలెండ్ ఇందుకు ఉపక్రమించినా, దానికంటె ఆస్ట్రేలియా చాలా ముందుకు పోయింది.

ఇక ప్రాజెక్టుల విషయంలో స్నోవే రివర్ ప్రాజెక్టు నిర్మాణానికి ప్రణాళిక తయారైంది. దానితో దేశంలో విద్యుచ్ఛక్తి రెట్టింపు కాగలదు. 100 మైళ్ళ పొడవుగల గొట్టాలు పెట్టి ఆల్ప్స పర్వతాలగుండా స్నోవే నదిని పారించి, ఏడు ఆనకట్టలు కట్టి, 17,20,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడమేగాక 18,00,000 ఎకరాలకు సరిపడగల నీటిని సాగుకు ఇవ్వడం ఈ ప్రణాళిక లక్ష్యం. ఇందుకు 55,00,00,000 నుంచి 64,00,00,000 డాలర్లవరకు

ఖర్చు అవుతుంది. ముఖ్యంగా రక్షణ కార్యక్రమం కిందనే ఈ ప్రణాళిక రూపొందించబడింది. భూమిలోపల నిర్మించబడే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి యంత్రాగారాలు ఎలాంటి ప్రమాదానికి లోనుగాకుండా పర్వత ప్రాంతంలో వుండగలవు.

ఆస్ట్రేలియానుంచి జపాన్‌వరకు గల ప్రాంతంలో పరిశ్రమలు వృద్ధిపొందడానికి తగువిధంగా సంఘం అభ్యున్నతి గాంచవలసి వున్నది. ప్రాచ్యఖండంలోని అన్ని దేశాలలోనికి అమెరికాకు అత్యంత సన్నిహితంగా వుండి అన్నివిధాలా అమెరికాను అనుసరించే ఫిలిప్పీన్స్‌లోకూడా ప్రజారోగ్యాభివృద్ధికీ, అధునాతన వ్యవసాయ విధానాల బోధనకు, విద్యాభివృద్ధికి విశేషంగా కృషి చేయవలసి వున్నది. ఈ రంగాలలో అభివృద్ధిని సాధించిననాడు పరిశ్రమల అభివృద్ధితో ఉద్భవించగల ఆర్థిక స్థితిని ఫిలిప్పీన్స్ తట్టుకోలేదు. ఈలోగా అభివృద్ధి ప్రణాళికలుకూడా అమలు జరగగలవు. 1,00,00,00,000 డాలర్ల ఖర్చుతో అమలు జరపడానికి తయారుచేయబడిన పంచవర్ష ప్రణాళిక 12,00,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని అదనంగా ఉత్పత్తిచేస్తుంది. ఒక ఎరువుల ఫ్యాక్టరీని నిర్మించగలదు. ఇప్పుడు సాలీనా విదేశాలనుంచి 93,000 టన్నుల ఎరువులను అది దిగుమతి చేసుకుంటున్నది. ఈ ఫ్యాక్టరీ తయారు అయితే, ఆ దిగుమతులను నిలిపివేయవచ్చు. క్రొత్త పరిశ్రమలనుకూడా స్థాపించడంతో యుద్ధానికి పూర్వం టోకియో, షాంగ్‌హై నగరాలకు పట్టిన భాగ్యాన్ని ఇప్పుడు మనిలాకు అబ్బేటట్లు చేయవచ్చునని ఫిలిప్పీన్స్ ఆశిస్తున్నది.

కొత్తగా అవతరించిన యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఇండోనీసియా తన అభివృద్ధి కార్యక్రమాలకు పూర్తిగా అమెరికాలోని ఎక్స్‌పోర్టు ఇంపోర్టు బ్యాంకిమీద, ప్రపంచ బ్యాంకిమీద ఆధారపడివుంది. ఈ రెంటిని అప్పు అడుగుతున్నది. తగరం, రబ్బరు ఎగుమతులు పెరిగితే, దానికి డబ్బు చేతిలో యెల్లాగా ఉంటుంది. ఇప్పటికే ఈ ఎగుమతులు బాగా పెరిగినవి. న్యూగినీలో పెట్రోల్ నూతులను శోధించడానికి విశేషంగా కృషి జరుగుతున్నది. 2,000 దీవులలో పెట్రోల్ దొరకగలదని అంచనా వేయబడింది. ఇప్పటికి నాలుగు దీవులలో మాత్రమే నూతులు త్రవ్వబడినవి. ఈ మొత్తం దీవు లన్నింటిలోను పెట్రోల్ తీయబడినపుడు ప్రాచ్య ఖండం మొత్తానికి సరిపడే పెట్రోల్‌ను అదే సరఫరా చేయగలదు. ఇప్పుడు ఆసియావాసులు తలకు ఏడాదికి నాలుగు గ్యాలన్ల పెట్రోల్‌ను మాత్రమే ఉపయోగిస్తున్నారు. ఒక్కొక్క అమెరికన్ సగటున రెండు రోజులలో నాలుగు గ్యాలన్‌లను ఉపయోగిస్తాడు. మున్ముందు ఆసియాలోకూడా పెట్రోల్ వాడకం పెరిగి, తలకు నాలుగునుంచి 8 కి, 8 నుంచి 50 కి, 50 నుంచి 100 కి ఇలా సగటు నిష్పత్తి పెరగవచ్చు. విద్యుచ్ఛక్తి వాడకంలో పెరుగుదల అభ్యున్నతిని సూచించినట్టే, పెట్రోల్ వాడకం పెరుగుదలకూడా పురోగతినే సూచిస్తుంది. ఒక్కొక్కసారి తల్లకిందులుగా నిలబడి ఆసియాను పరిశీలించడం అమెరికన్‌లకు అలవాటు. అలా తల్లకిందులుగా నిలబడి చూచినపుడు జపాన్ సమస్యలను

పరిష్కరించి, దానిని రక్షించితే, ఆసియా మొత్తాన్ని రక్షించవచ్చునని అమెరికన్‌లకు తోచవచ్చు. కాని, జపాన్ ఆసియా ఖండంలో ఒక భాగం మాత్రమే. ఆసియా ఖండం మొత్తాన్ని రక్షించగలిగినపుడు జపాన్‌కూడా దానిల్లోనే ఒకటై వుంటుంది. ఆసియా ఖండం చేయిజారిపోయినపుడు జపాన్‌కూడా పోకుండా ఒక్కటే మిగిలివుంటుందని అనుకోవడం భ్రమ. పరస్పరం అనుసంబంధించివుండి సర్వతోముఖాభివృద్ధిని సాధించగల ఆర్థిక కార్యక్రమాలు అమలు జరిగినప్పటికీ, దూరప్రాచ్యం కల్లోలానికి గురికాకుండా సుస్థిరంగా వున్నప్పటికీ, జపాన్‌లో ప్రజలు సామాన్యమైన జీవన వ్యయ ప్రమాణం కలిగివుంటే విశేషంగా వస్తువులను దిగుమతి చేసుకోనవలసి వుంటుంది. దీనికయ్యే ఖర్చును భరించడానికి అది ఎగుమతులను విశేషంగా వృద్ధి చేయవలసి వుంటుంది. జపాన్‌లో నియమించబడిన ఆర్థిక సుస్థిరత్వ సాధక సంఘం ఇందుకు అంచనాలు వేస్తూ 1947 నాటికంటె దిగుమతులు మూడురెట్లు, ఎగుమతులు తొమ్మిదిరెట్లు పెరిగితేనే ఈ లక్ష్య సాధన అసంభవమని, ఇందుకుగాను జపాన్‌కు అమెరికా 2,00,00,00,000 డాలర్లను అప్పుపెట్టాలని పేర్కొన్నది. జపాన్ వెంటనే ఇన్‌ఫ్లేషన్‌ను అరికట్టి, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి నధికంచేసి, ఇప్పటి కొరతను పూడ్చుకొని, రహదారి మార్గాలను వృద్ధిచేసుకొంటేనేగాని ఈ లక్ష్య సాధన సులభం కాజాలదనికూడా సలహానిచ్చింది. ఆసియావాసుల దృష్టిలో పారిశ్రామికంగా అభివృద్ధిగాంచిన

దేశాలలో జపాన్ ఒకటి అయినప్పటికీ, అమెరికన్‌ల దృష్టిలో, ఇప్పుడిప్పుడే పరిశ్రమలను వృద్ధిచేసుకుంటున్న దేశాలలో ఒకటిగానే జపాన్ పరిగణించ బడుతున్నది. అమెరికాలో ముగ్గురికి ఒకటికిమించి టెలిఫోన్ వుంటే, జపాన్‌లో వందమందికి ఒకటిన్నర టెలిఫోన్ మాత్రం వుంది. టెలిఫోన్ సౌకర్యాలు లేనందున సాలీనా 10,00,00,000 డాలర్లను జపాన్ వర్తకులు ఖర్చు పెట్టవలసి వస్తుందని జపాన్ ఆర్థికాభివృద్ధి సాధక సంఘం అంచనా వేసింది. ఒక టెలిఫోన్‌వుంటే జరిగిపోయేపనికి ఇప్పుడు ఇద్దరేసి ఉద్యోగులను నియమించి, పోషించవలసి వస్తున్నది.

1953 నాటికి జపాన్ సాధించదలచుకొన్న లక్ష్యాలన్నీ చాలా విశేషమైనవిగానే కనిపిస్తున్నా, అవి దానికి అసాధ్యమైనవికావు.

అయితే, జపాన్‌కు ముడి వస్తువుల కొరతవుంది. 1936 లో తనకు కావలసిన పెట్రోల్‌తో వాటిని పదివంతులను మాత్రమే అది ఉత్పత్తి చేసుకోగలిగింది. 1943లో జపాన్‌లో గల ఉక్కు ఫ్యాక్టరీలలో మూడవవంతు ముడిపదార్థాలు లేక పోవడంవల్ల పని నిలిపివేసినవి. అల్యూమినియం పూర్తిగా విదేశాలనుంచి దిగుమతి కావలసిందే. బొగ్గు లేనేలేదు. ముడి పదార్థాలకొరకే ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో దిగి ఓడి పోయిన జపాన్ ఇక వాటిని ఖరీదుచేసి ఇతర దేశాలనుంచి తెప్పించుకోవలసిందేగాని ఇంకొక మార్గాన ఆ ముడిపదార్థాలను తెచ్చుకోజాలదు.

విద్యుచ్ఛక్తికూడా దానికి పరిమితంగానే వుంది. జపాన్‌లో ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తిలో నూటికి 75 వంతులు హైడ్రో ఎలెక్ట్రిక్ ప్లాంట్ల ద్వారానే. అయితే, జపాన్‌లోని నదులు చిన్నవి కావడంచేత ఈ ప్లాంట్లుకూడా చిన్నవే. వ్యవసాయానికి పనికివచ్చే ప్రతి అంగుళం మేర అమూల్యమైనదిగానే పరిణమించబడే దేశంలో రిజర్వా యర్ల నిర్మాణానికి కావలసినంత స్థలం దొరకడం అసంభవం. పైగా భూకంపాలు సర్వసామాన్యం కనుక పెద్ద హైడ్రో ఎలెక్ట్రిక్ యంత్రాలపై జపాన్‌కు మమకారంలేదు కూడా.

కొరియా, మంచూరియాల మధ్యగల యాలూనదిపై ప్రపంచం మొత్తానికే పెద్దది అయిన పెద్ద హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టును జపాన్ కట్టింది. ఇదే సూహియో ప్రాజెక్టు. 6,00,000 కిలోవాట్స్ శక్తితో సాలీనా 3,80,00,00,000 కిలోవాట్ అవర్స్ విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసేది. ప్రపంచం మొత్తంలో అగ్రస్థానాన్ని వహిస్తున్న గ్రాండ్ కౌలీ రిజర్వా యరు, తర్వాత ద్వితీయ స్థానాన్ని ఆక్రమించేది సూహియో రిజర్వాయరే. అయితే, ఒకప్పుడు జపాన్‌కు ఇండోనీసియాలో వున్న పెట్రోల్ గనులు, ఉత్తర చైనాలోని ఇనుము గనులు దాని చేతినుంచి జారిపోయినట్టే సూహియో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రంకూడా జపాన్ చేతినుంచి జారిపోయింది.

ఆహార పదార్థాల ఉత్పత్తిలో యుద్ధానికి పూర్వంగల సామర్థ్యాన్ని జపాన్ అప్పుడే సాధించగలిగింది. 1948 లోను, 1949 లోను కూడా 30,00,00,000 బుషెల్స్‌వరకు

పండించింది. అంటే దేశం మొత్తానికి కావలసిన బియ్యంలో నూటికి 80 వంతులదాకా అదే పడించుకో గలిగిందన్నమాట. మూడేండ్లలో భూసంస్కరణలను అమలుజరిపి 50,00,000 ఎకరాలను భూస్వాములవద్దనుంచి తీసుకొని వాటిని సాగుచేసే రైతులకు ఇచ్చివేసింది. ఇందువల్లనే ఆహారోత్పత్తి శీఘ్రంగా పెరిగిందని చెప్పవచ్చు. వరి సాగు అయ్యే ప్రాంత మంతటి లోను మేలురకం విత్తనాలే ఉపయోగించబడుతాయి. ఇది కూడా ఒక కారణమే. ఇండియాలో సాగు అయ్యే భూమిలో నూటికి అయిదవవంతులోను, చైనాలో నూటికి ఒకటవ వంతులోను మాత్రమే మేలురకం విత్తులు ఉపయోగించ బడుతున్నవి.

ఇప్పుడు చైనా కమ్యూనిస్టుల చేతిలోనికి పోయింది కనుక దాని సంగతేమిటి ?

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం చైనీస్ రిపబ్లిక్ నిర్మాత డాక్టర్ సన్ యెట్ సేన్ ఒక ప్రణాళికను తయారు చేశాడు. ఆధునిక వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్టడానికి, పరిశ్రమలను నెలకొల్పడానికి ఆ ప్రణాళిక లక్ష్యించింది. అది అనేకమందికి ఆశ్చర్యం కలిగించింది. మూడు పెద్ద రేవుల నిర్మాణానికి, అనేక చిన్న చిన్న రేవుల నిర్మాణానికి, అధునాతన పద్ధతులపై నగరాల నిర్మాణానికి, ఉక్కు, ఇనుము ఫ్యాక్టరీల నిర్మాణానికి, సిమెంట్ ఉత్పత్తికి, టెలిగ్రాఫ్ టెలిఫోన్ సామగ్రి ఉత్పత్తికి, రేడియో మిషన్‌ల నిర్మాణానికి దానిలో అవకాశాలు కల్పించబడినవి. 20 సంవత్సరాల

లోపున అమెరికన్ల సహాయంతో సన్‌యెట్‌సేన్ లక్ష్యాలను తాము సాధించగలమని ఇటీవలివరకు చైనీస్ అనుకుంటూ వచ్చారు.

. కాని, ఆ ప్రణాళిక నిర్మాతలు అనుకున్న విధంగా యుద్ధానంతర పరిస్థితులు సాగనే లేదు. తుదకు చైనాను దానికి పరిపూర్ణంగా సహాయం చేయగల అమెరికానుంచి కమ్యూనిస్టులు వేరుచేసివేశారు.

50 సంవత్సరాలుగా చైనీయులు అమెరికన్‌లు ప్రాణ స్నేహితులుగా వున్నారు. ఏ రాజ్యం అడుగులకు మడుగు లొత్తకుండా చైనా సర్వతంత్రంగా మనగలగడం అమెరికాకు సర్వదా శ్రేయస్కరం. ఈ లక్ష్యసాధనకోసమే ప్రపంచం మొత్తానికి ఎదురుతిరిగి చైనా సరసను అమెరికా నిలిచి పోరాడింది. చైనీస్ స్వాతంత్ర్యసాధనకు, చైనీస్ సమైక్యతా సాధనకు వెనుకటివలెనే ఇకముందుకూడా నిరంతరం అమెరికా పోరాటం సాగిస్తూనే వుంటుంది. తమను కాపాడు తున్నందుకు మాస్కో అడుగుతున్నమూల్యం ఎంత భార మైనదో త్వరలోనే చైనీస్ గుర్తించగలరనీ, అమెరికన్‌ల గుణసంపత్తినికూడా గుర్తించగలరనీ ఆశించవచ్చు.

ఎప్పటికైనా ఆ రోజువచ్చి, చైనాకు సహాయం చేయ డానికి అమెరికాకు అవకాశం చిక్కితే, ఆ సహాయం ఎలా జరగవలెనో అప్పుడే ప్రణాళికలు తయారు అయి సిద్ధంగా వున్నాయి.

నిర్మాణ కార్యకలాపం ప్రారంభమే తరువాయిగా వున్న ఈ ప్రణాళికల ప్రకారం ఆనకట్టలు నిర్మించబడితే కొద్ది సంవత్సరాల లోగానే చైనాలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 15 రెట్లు వరకు పెరగగలదు. అంటే 1,15,00,00,00,000 కిలో వాట్స్ అవర్స్ విద్యుచ్ఛక్తి అదనంగా ఉత్పత్తి కాగలదన్నమాట. ఇది 1936 లో ఫ్రాన్స్, జర్మనీ, రష్యా, బ్రిటన్‌లు కలిసి వాడుకొన్నంత కాగలదు. చైనాలోని నదులలో ఉత్పత్తి అయ్యే ఈ విద్యుచ్ఛక్తి వినియోగించు కొనేందుకు 1,00,00,00,000 మంది ధృఢకాయులైన కార్మికులు రోజుకు 8 గంటల చొప్పున, వారానికి ఆరు రోజులు పనిచేయవలసి వస్తుంది.

యాంగ్సీ, టీ-టు-హెూ, మా-పీ-హెూ, మింగ్-కియాంగ్‌ల ఎగువ ప్రాంతంలోను, క్వాన్-హీన్, టాంగ్-లాంగ్-చువాన్, లుంగ్-ఛీ-హెూ, ఎల్లోనదుల ఎగువ భాగంలోను పెద్దపెద్ద డామ్‌లు నిర్మించబడగలవు.

వీటన్నింటిలోనికి పెద్దది, అత్యంత లాభప్రదమైనది షాంగ్‌హైకు 600 మైళ్ళు దూరంలో యాంగ్సీ నదిపై నిర్మించబడుతుంది. ఇది ఇంజనీరింగ్ చరిత్రలోనే అపూర్వమైనది కాగలదు. 1,00,00,000 ఎకరాలను సాగుచేసి, అనేక శతాబ్దాలుగా చైనాను ముంచెత్తుతున్న వరదలను అరికట్టి, సముద్రంనుంచి వచ్చే నౌకలు సరాసరి చుంకింగ్‌కు వెళ్ళడానికి మార్గం కల్పించగలదు. 1,00,00,00,000 డాలర్ల ఖర్చుతో నిర్మించబడగల హైడ్రో ఎలెక్ట్రిక్ ప్లాంట్ ద్వారా

81,00,00,00,000 కిలో వాట్స్ అవర్స్ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కాగలదు. మెటలర్జికల్ పరిశ్రమలను స్థాపించ డానికి, రైళ్లను నడపడానికి, పంటభూమికి నత్రజని ఎరువును తయారుచేయడానికి ఈ విద్యుచ్ఛక్తి ఉపకరించగలదు. గ్రాండ్ కౌలీ డామ్‌ను, హూవర్ బోన్ విల్లీ, ఇంకా అనేక ఈస్టు ఇండియన్ డామ్‌లను నిర్మించిన అమెరికన్ ఇంజనీరు జాన్ శావేజ్ యాంగ్సీ ప్రాజెక్టునుగురించి వ్రాస్తూ ఇంజనీరుగా తన జీవితానికి ఈ ప్రాజెక్టు పరాకాష్ఠ కాగల దన్నాడు. ఈ ప్రాజెక్టు నిర్మాణంతో ప్రారంభించబడగల ఎరువుల ఫ్యాక్టరీలు ఉత్పత్తిచేసే సరుకు ప్రపంచం మొత్తంలోనికి విశేషంగావున్న చైనా భూములకు సరిపోవడమే గాక, అమెరికాలోని 10,00,00,000 ఎకరాలకుకూడా సరఫరా చేయడానికి అవకాశం వుంటుందని జాన్ శావేజ్ అన్నాడు. ఇలా 15 సంవత్సరాలలో ఎగుమతి చేయబడే నత్రజనివల్ల యాంగ్సీ ప్రాజెక్టు మొత్తానికి అయ్యేఖర్చు తిరిగి రాగలదని అన్నాడు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలంలో అమెరికా విదేశ ఆర్థిక సహాయశాఖ చీఫ్ ఇంజనీరు ఆలెక్స్‌టాబ్ చైనా అభివృద్ధికి మరొక ప్రణాళికను ప్రతిపాదించాడు. 625 ఫ్యాక్టరీలను, 260 థర్మల్ స్టేషన్‌లను నిర్మించడానికి అది దోహదమిస్తున్నది. ఆయన కోరికపై వీటిని నిర్మించడానికి తమ కెంతఖర్చు అయ్యేదీ వివరాలతో అమెరికన్ కంపెనీలు తెలియజేసినవి. ఇందులో థర్మల్ స్టేషన్‌లు కొన్ని నిర్మించ

బడినవికూడా. బొగ్గు ఉత్పత్తితో ఈ కార్యక్రమం ప్రారంభం కావలసి వుంటుంది. ప్రపంచం మొత్తంలో బొగ్గులో నాల్గవ వంతు చైనాలోనే వున్నట్టు అంచనా వేయబడింది. ఈ కార్యక్రమం అమలు జరపడానికి అమెరికన్ సాంకేతిక నిపుణులను పంపి, ఆ పరిశ్రమల నిర్వాహణలో చైనీస్‌కు ముందు శిక్షణ ఇవ్వవలసి వుంటుంది.

పారిశ్రామికాభివృద్ధితోపాటు సంఘంకూడా అభివృద్ధి చెందవలసి వుంటుంది. రేవు పట్టణమైన షాంగ్‌హై వంటి నగరాలు అప్పుడే పారిశ్రామికాభివృద్ధిని, దానితోపాటు సంఘంలో కలిగే పరిణామాలను రుచిచూచినవి. ఒక వంద సంవత్సరాలక్రితం బ్రిటిష్, అమెరికన్ పారిశ్రామిక నగరాలు ఏ స్థితిలో వున్నవో ఇప్పుడు ఆ స్థితికి ఈ రేవుపట్టణాలు వచ్చినవి. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం షాంగ్‌హై నగరాన్ని వర్ణిస్తూ మారిస్‌కుక్ వ్రాసినది అక్షరాలా దీనిని బలపరుస్తుంది.

ఆరోగ్యాభివృద్ధి కార్యక్రమాలు, ఆధునిక వ్యవసాయ పద్ధతులలో శిక్షణ, విద్యా ప్రచారం మున్నగునవి చైనాకు కూడా అత్యావసరములే.

చైనా కమ్యూనిస్టుల స్వాధీనం కాకపూర్వం ఐక్యరాజ్య సమితి తాలూకు ఆర్థిక సహాయ సంఘం చైనాలో గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాలను అమలు పరచింది. అప్పటి అనుభవాన్నిబట్టి చైనావాసులు వ్యవసాయాన్ని అభివృద్ధి

పరచుకో గలరని, పయోజన విద్యాప్రచారం విరివిగా సాగగలదని, ప్రజారోగ్యాన్ని అభివృద్ధి పరచుకోగలరని, స్థానిక ప్రభుత్వాలను నిర్వహించుకో గలరని నిర్ధారణ అయింది.

చతుర్థసూత్ర కార్యక్రమం ప్రకారం చైనాకు కూడా సహాయం లభించగల సమయం ఇంతలో ఆసన్నంకాగలదని ఆశించడానికి అవకాశమే లేకపోయినా, చైనా ఆర్థిక సహాయసంస్థ అనుసరించిన కార్య విధానాన్నే ఆసియా మొత్తంలో అనుసరించడం మంచిదని చతుర్థసూత్ర కార్యక్రమ నిర్వాహకులు అనుకుంటున్నారు. ఆర్థిక సహాయ సంస్థ అమలుజరిపిన కార్యక్రమం మహాద్భుతాలను సాధించ లేక పోయినా చైనీయులకు స్వయంకృషిపై ఆధారపడడాన్ని నేర్పింది.

కమ్యూనిస్టు చైనాను నిరోధించడానికై ఆసియా రాజ్యాల సమాఖ్యను తక్షణం ఏర్పాటుచేయడం అత్యవసర మని తోస్తుంది. ఈ సమాఖ్యను ఏర్పాటు చేసినంత మాత్రం చేతనే ప్రయోజన మేమీ లేదు. ఆ సమాఖ్య ఆసియా ఖండం మొత్తంలో ప్రజారోగ్యాన్ని వృద్ధిపరచి, స్త్రీ పురుషులందరినీ విజ్ఞాన వంతులను, బలిష్ఠులనుచేసి, అప్పుడు అంతర్జాతీయ సహకారంతో భారీ పరిశ్రమలను నెలకొల్పి, సంఘాన్ని అభివృద్ధి చేయగలిగినపుడే కమ్యూనిజమ్ బారినుంచి ఆసియాను రక్షించడం సాధ్యంకాగలదు. దూరప్రాచ్యం పునరుజ్జీవం పొందడంలో చతుర్థసూత్ర కార్యక్రమం తక్షణం

సాధించే మహాద్భుత మేమీ లేదు. ఒక్క రాత్రిలోనే దారిద్ర్యాన్ని నిర్మూలించ జాలదు లేదా ఒక్క రాత్రిలోనే కమ్యూనిస్టులను రష్యన్ సరిహద్దులదాకా తిరగ గొట్టలేదు.

అయినప్పటికీ చతుర్థసూత్ర కార్యక్రమం చైనీస్ రైతులకు ట్రాక్టర్లను ఎలా ఉపయోగించవలసిందీ నేర్ప గలదు. చైనా, ఫిలిప్పీన్స్, కొరియా, బర్మా, థాయిలెండ్, ఈస్ట్ ఇండీస్ దీవులను పీల్చి పిప్పిచేస్తున్న భయంకరమైన వ్యాధులను నివారించుకొనడంలో ఆ దేశవాసులకు శిక్షణ నివ్వగలదు. ఆ వ్యాధులను నిర్మూలించడానికి కూడా అది దోహద మివ్వగలదు.

తూర్పు బెంగాల్‌లో సైనిక దళాలు ఉపయోగించే చిన్న పంపును చూడ్డానికి వందలకొలది మైళ్ళనుంచి రైతులు నడచివచ్చి దానినిచూచి వెళ్లారు. ఇట్టి చిన్న చిన్న యంత్రాలను ఉపయోగించే విధానాలను ఆసియాలోని ప్రతి స్వతంత్ర దేశంలోను చతుర్థసూత్ర కార్యక్రమం ప్రచారం చేయగలదు. బ్యాంగ్‌కాక్‌కు 20 మైళ్ళ దూరంలోగల మేనమ్‌నదీ ముఖద్వారంవద్ద ఇసుక తిన్నెలు ఏర్పడినందున నౌకల రాకపోకలకు అవరోధం ఏర్పడింది. ఆ ఇసుక తిన్నెలను త్రవ్వివేయడ మెలాగో అది చేసి చూపించగలదు.

అన్ని సమస్యలకు దారిద్ర్యమే ప్రాతిపదిక అని చెప్ప డానికి వీలులేదు. ఇండియాలో ఇండియనులు, సింహళంలో సింహళీయులు, ఇండోనీసియాలో ఇండోనీసియనులు దారి

ద్రాన్ని నిర్మూలించ గలిగిన దానికంటె ముందుగానే చైనాలో దారిద్ర్యాన్ని కమ్యూనిస్టులు నిర్మూలించగలిగితే అప్పుడు భారతీయులు, సింహళీయులు, ఇండొనీసియనులు కమ్యూనిస్టులుగా మారిపోగలరు. అలాగాక చైనా పరిసర రాజ్యాలు ఆర్థికంగా పురోగమిస్తూ చైనా అలాగే స్తంభించి పోయివుంటే, అప్పుడు కోమిన్‌టాంగ్‌కు పట్టినగతే కమ్యూనిస్టులకు కూడా పట్టుతుంది.

చైనా ఆర్థికాభివృద్ధి సాధనకై కమ్యూనిస్టులు అమలు జరపనున్నవి ముఖ్యమైనవి కొన్ని వున్నాయి. కోట్లాది రైతులచేత వ్యవసాయం మాన్పించి, రైతులను భవనాలు, విమానాశ్రయాలు మున్నగునవి నిర్మించడానికి నియోగించ వచ్చు. వ్యవసాయంలో అధునాతన పద్ధతుల నవలంబించడం ద్వారా ఇన్ని లక్షలమంది వ్యవసాయ వృత్తినుంచి తొలగించ బడినా, ఆహారోత్పత్తి తగ్గకుండా చేయవచ్చు. అందుచేత కమ్యూనిస్టుల పరిపాలనలో కూడా ఆర్థికంగా చైనా ఎంతమాత్రం అభివృద్ధి గాంచజాలదని ఆశించడం కేవలం అవివేకమే కాగలదు. యంత్రాలు లేకుండా మహాద్భుతాలను సాధించడం అసంభవమని అనుకొనరాదనీ, అమెరికాలో యంత్రాలద్వారా అమిత ఖర్చుతో ఉత్పత్తి చేయబడేవి చైనావంటి దేశంలో మానవ బలగంతో అతిచౌకగా తయారు కాగలవనీ సోవియెట్ సెంట్రల్ ఆసియా ఆర్థిక శాస్త్రవేత్త వారెన్‌విల్ హెల్మ్ 1950 ఫిబ్రవరి 1 వ తేదీనాటి ఫారెన్‌పాలిసీ రిపోర్టులో వెనుకబడిన దేశాల

అభివృద్ధి కార్యక్రమం అన్న శీర్షికకింద వ్రాసిన వ్యాసంలో హెచ్చరించాడు.

అయితే, ఒకవేళ కమ్యూనిస్టుచైనా పెద్ద ఎత్తున పెట్టుబడులతో భారీ పరిశ్రమలు నెలకొల్పబడినా ఆసియా ఖండంలోని మిగతా ప్రాంతం నిరాశ చెందవలసిన అవసరం లేదు. మిగతా దేశాలుకూడా తమదేశాలలో గల సాధన సంపత్తితో అభ్యుదయ కార్యక్రమాలను అమలుపరచుకొని పురోగమించవచ్చు. ఇందుకు కావలసిందల్లా వాటికి ధైర్యసాహసాలు, పట్టుదల మాత్రమే. స్వేచ్ఛగా, సంఘంలో కార్మికులు తదితరులతో సమానంగా పరిగణించబడ్డం అత్యవసరం. రష్యా, చైనాలలోవలె కార్మికులకు ఇష్టమైనా కాకపోయినా పనిచేసితీరాలని వారిని నిర్బంధించ తగదు. శ్రమకుతగిన ప్రతిఫలంతో స్వేచ్ఛగా పనిచేసే కార్మికుడే, కాలంగడచినకొద్దీ యజమాని కనుసన్నల ప్రకారం నిరంతరం కృషిచేసే బానిసకంటె ఎక్కువ ఉత్పత్తి చేయగలుగుతాడు. స్వతంత్ర ఆసియాలో గల మానవబలగానికి తోడు కమ్యూనిస్టు చైనాకు లభ్యం కాజాలని యంత్రాలు, పెట్టుబడి మాత్రమే గాక సాంకేతిక నిపుణుల సహాయం, పాశ్చాత్య ప్రజాస్వామిక రాజ్యాల సహాయంకూడా లభించ గలదు. ఈ సాధన సంపత్తినంతా పరికిస్తే యంత్రసహాయం లేకుండా ప్రజలే స్వయంగా కృషిచేసినా, వారి జీవనవ్యయ ప్రమాణాన్ని అభివృద్ధి పరచడం ఎంతమాత్రం కష్టం కాదని తేలగలదు.

# స్వతంత్ర యూరప్ - మొండెంలేని తల

యూరప్‌కు యుద్ధానంతరం డాలర్ల కొరత తెగని సమస్యగా పరిణమించింది. అంటే, అమెరికాతో పోల్చినపుడు యూరప్ వెనుకబడివున్న దేశంగా పరిణమించిందన్న మాట యూరోపియన్ దేశాలన్నీ రెండు మహాసంగ్రామాలలో సర్వనాశనమై పోయినందున యూరప్ వెనుకబడి పోయిందంటే ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. అమెరికాతో పోటీచేయగల విధంగా ఇప్పుడే యూరప్ ఉత్పత్తులను సాధించలేకుండావుంది. అంతేకాక, యూరప్‌లో తయారైన వస్తువు లన్నింటినీ ఖరీదుచేయడానికి యూరోపియన్ ప్రజలకు తగిన ఆర్థిక స్తోమతుకూడా లేదు.

కరెన్సీని ఎన్నిరకాలుగా మార్చినా, సుంకాల విధింపు విధానాలను ఎంతగా సంస్కరించినా, ఎంత పొదుపరితనంతో వ్యవహరించినా ఏమీ లాభంలేదు. మీరు ఒకజత మేజోళ్ళు తయారుచేసే సరికి నేను మూడుజోళ్ళు తయారుచేస్తూవుంటే, నేను మేజోళ్ళను మెల్లిగా తయారుచేయడమో లేక మీరు గబగబా తయారుచేయడమో సంభవించే వరకు ఎంతకాలం గడిచినా, మీకూ మాకూ మధ్య ఏర్పడగల అంతరం ఎలా తగ్గుతుంది ?

వలస రాజ్యాల కొనుగోలుశక్తి నభివృద్ధి పరచి, యూరప్ తయారుచేసిన వస్త్రాల నన్నింటినీ ఆ దేశాలచేత ఖరీదు చేయించడానికి చతుర్థసూత్ర కార్యక్రమం ఉపక

రిస్తుంది. అప్పుడు డాలర్ల కొరత యూరప్‌ను బాధించదు. అయితే, తమ వలస రాజ్యాలకు అమెరికన్ వస్తువులు దిగుమతి కాకుండా విపరీతమైన విధి నిషేధాలను యూరోపియన్ రాజ్యాలు అమలు జరిపినపుడుగాని ఇది సాధ్యంకాదు. ఇది జరిగిననాడు అంతర్జాతీయ సామరస్యానికి అది దోహద మివ్వ జాలదు.

అందుచేత, అమెరికా దిగుమతులను పెంచుకొనడం ద్వారాను, యూరప్‌కు యాంత్రిక వ్యాపారాన్ని ప్రోత్స హించడం ద్వారాను, ముడివస్తువులను విశేషంగా సరఫరా చేయడం ద్వారాను యూరప్‌ను డాలర్ల కొరతనుంచి తప్పించ గలుగుతుంది.

ఈ పని అమెరికా చేయాలికూడా. ఇందుకుగాను, అతి చౌకగా యూరప్ ఆహార పదార్థాలను, వస్తువులను ఇతోధికంగా ఉత్పత్తిచేయడం అవసరం. యూరప్‌లో ఉత్పత్తి అయినవాటిలో అధికభాగం యూరప్‌లోనే చెల్లిపోవాలి.

ఉత్పత్తులు పెరగడం, ధరలు తగ్గడంతోపాటు అవి చెల్లడానికి మార్కెట్ విస్తృతంగా వుండాలి. కరెన్సీ మారకం గారడీలతో, రక్షణ సుంకాలతో యూరోపియన్ మార్కెట్ చొరరానిశక్యంగా వుంది.

యూరప్‌కు ఆహార పదార్థాల దిగుమతులు తగ్గాలంటే భూ సంస్కరణలను అమలుజరిపి, ఎక్కువగా పంటలు పండించడానికి అది కృషి జరపవలసిందే. ప్రాచ్య, పాశ్చాత్య

ఖండాల మధ్య ఉత్పత్తిలో గల అంతరంతో సంభవించగల ప్రమాదంనుంచి తప్పించడానికిగాను అమెరికన్ పారిశ్రామిక విధానాలను యూరప్ అనుసరించవలసిందే.

పరిశ్రమల నిర్వహణలో సామర్థ్యం పెంచడానికీ, రహదారిమార్గాల నభివృద్ధి పరచడానికీ, భోగట్టాలను సేకరించడానికీ, పరిపాలనా విధానాలను పటిష్ఠం చేయడానికీ, వ్యవసాయాన్ని అభివృద్ధి పరచడానికీ గల మార్గాలను అన్వేషిస్తూ యూరప్ ఖండంలో ఇప్పుడు ఆర్థిక సహకార సంస్థ తాలూకు ప్రతినిధులు జరుపుతున్నారు.

చతుర్థసూత్ర కార్యక్రమం లక్ష్యాలు సిద్ధించడానికి యూరప్‌లో రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో తీవ్రమైన సంస్కరణలు అమలు జరగవలసి వున్నవి. ఉదాహరణకు: తూర్పు, పశ్చిమ జర్మనీలనుగాని, లేదా తూర్పు, పశ్చిమ యూరప్‌లనుగాని నూతన మహత్తర ప్రణాళిక సమైక్య పరచలేదు. కాని అది సాధించగలిగినవి చాలా వున్నాయి.

(1) వ్యవసాయ క్షేత్రాలకు సాంకేతిక సహాయాన్ని పంపడంద్వారా అధికోత్పత్తిని సాధించి, యూరప్‌కు కావలసిన ఆహారంలో అధికభాగం అక్కడే ఉత్పత్తి అయ్యేటట్టు చెయ్యగలదు.

(2) పరిశ్రమలకు పెట్టుబడులు పెట్టి, సాంకేతిక సహాయాన్నివ్వడంద్వారా ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచవచ్చు.

(3) ప్రాంతీయ అభివృద్ధి ప్రణాళికలను ప్రోత్సహించడం ద్వారా అక్కడ తయారైన వస్తువులు అక్కడే చెల్లిపోయే ట్టు ప్రోత్సాహించవచ్చు. సక్రమంగా సర్వతో ముఖాభి వృద్ధి ప్రణాళికలు అమలు జరిగిన ప్రాంతాలలో ఉత్పత్తి అయ్యే వస్తువులు ఆ ప్రాంతంలోనే చెల్లిపోతూ, ఉత్పత్తి, ప్రజల సౌభాగ్యం కూడా పెరగాలి.

(4) టెక్నికల్, ఇంజనీరింగ్ ప్రాజెక్టుల నిర్వహణకు అంతర్జాతీయ సహకారాన్ని సమకూర్చగలదు. అది సంభ వించిన నాడు పశ్చిమ యూరప్ ఒక ఫెడరేషన్‌గా అవతరించి, తూర్పు యూరప్‌తో వెనుకటి వర్తక సంబంధ బాంధవ్యాలు నెలకొనడానికి అవకాశం వుంటుంది. ఇనుప తెర వెనకాలవున్న తూర్పు యూరోపియన్ రాజ్యాలు ముడిసరుకులను, ఆహార పదార్థాలను సరఫరా చేయకపోతే, పశ్చిమ యూరప్ మొండెంలేని తలవలె వుంటుంది.

## వ్యవసాయ క్షేత్రాలకు సాంకేతిక సహాయం

భూసార రక్షణ, ఆహార పదార్థాల ఉత్పత్తుల విషయంలో సాంకేతిక విజ్ఞానాన్ని ఏ దేశం నిగ్గు తేల్చలేదు. అన్నీ ఇప్పుడిప్పుడే అందుకు కృషి ప్రారంభిస్తున్నాయి.

ప్రపంచం మొత్తంలో సామర్థ్యవంతంగా నడుప బడుతున్న వ్యవసాయ క్షేత్రాలు బ్రిటన్‌లో వున్నాయి. అవి యంత్రాలను ఉపయోగిస్తున్నవి. అమెరికా మనిషికి సగటున

ఎంత ఉత్పత్తి చేస్తున్నదో బ్రిటన్‌కూడా అంత ఉత్పత్తి చేస్తున్నది. అయినప్పటికీ, తన సామ్రాజ్యంపై ఆధారపడి వుండవలసిన అగత్యాన్ని తప్పించుకోడానికి 1953 నాటికి వ్యవసాయ ఉత్పత్తులను నూటికి 50 వంతులదాకా పెంచడానికి అది కృషి చేస్తున్నది.

పారిశ్రామికంగా అభివృద్ధి పొందిన దేశాలలో విప్లవాత్మకమైన సాంకేతిక విధానాలద్వారా ఆహారోత్పత్తి పెరిగే ఆశలు గోచరిస్తూ వుంటే, ఇటలీ, గ్రీసులలో ఆహారోత్పత్తిని సాధించడానికి అతి సామాన్యమైన సూత్రాలు అనుసరించబడుతాయి. నారిస్ ఇ. డాడ్ యూరప్‌లో పర్యటన చేస్తూవుండగా కొంతమంది రైతులు పంటవేయడానికి ముందు నేలను చదునుకూడా చేశారన్న సంగతి గ్రహించగలిగాడు. భూమి చదునుగా లేక ఎగుడుదిగుడుగా వున్నందున కొన్ని విత్తులు చాలా లోతుకు పోయి, కొన్ని పైకి వుండడం సంభవిస్తుంది. కొయ్యతోలితే నేల చదును కాగలదని, ఇది చాలా తేలికపని అని, ఇందుమూలంగా నూటికి పదివంతులదాకా ఉత్పత్తి పెరగగలదని నారిస్‌డాడ్ అన్నాడని 1950 మార్చి నెలలోని "రీడర్స్ డైజెస్ట్" లో ఎడ్విన్ ముల్లర్ ఒక వ్యాసం వ్రాశాడు.

వ్యవసాయాభివృద్ధికి అవసరమైన సాంకేతిక సహాయం చతుర్థసూత్ర కార్యక్రమంద్వారా జరిగినంతమాత్రంచేతనే ఆర్థిక, సాంఘిక వ్యవస్థలలో గల వైపరీత్యాలన్నీ తొలగిపోజాలవు. ఆసియాలోవలెనే యూరప్‌లోకూడా సర్వత్రా

ఆర్థికాభివృద్ధిని సాధించి, నియంతృత్వానికి దారితీయజాలని రాజకీయ వ్యవస్థను నెలకొల్పవలెనంటే భూసంస్కరణలను తక్షణమే అమలు జరపడం అత్యవసరం. భూస్వాముల దుష్ట చర్యలవల్లనే కమ్యూనిస్టులకు ప్రాబల్యం చిక్కుతున్నది. భూస్వామ్య సంస్కరణలు అమలు జరగక పోవడంవల్లనే 1917 లో రష్యాలో విప్లవం దిగ్విజయం పొందగలిగింది. ప్రస్తుతం భూస్వాములకింద గల 37,50,000 ఎకరాల భూమిని రైతులకు ఇచ్చివేస్తానని డీ గాస్పెరీ ప్రభుత్వం వాగ్దానం చేసింది. ఈ వాగ్దానాన్ని అది ఎంత తొందరగా చెల్లించు కుంటే అంత త్వరితంగా ఇటలీ అభివృద్ధి పొందగలదు.

ఇటలీలోకంటె గ్రీసులో గ్రామాభ్యుదయ కార్యక్రమం అమలు జరగవలసిన అవసరం ఎంతగానో వుంది. గ్రీసు ఆర్థిక సమస్యలను పరిశీలించి వచ్చిన సంఘం 1947 లో సమర్పించిన నివేదికలలో రైతుకు తలకు 1.31 ఎకరాలకు మించి లేదని పేర్కొన్నది. కాటకప్రమాదానికి, మిడుతలదండు ప్రమాదానికి గురి అవుతున్న గ్రీసు 1940 నుంచి 1949 వరకు కదన రంగంగా మారి మరింత నాశనమైంది. కనుకనే గ్రామాభ్యుదయ ప్రణాళికలను అమలు జరపడానికి కృషి సాగుతున్నది. ఇందులో పశుగణాభివృద్ధి కార్యక్రమం అగ్రస్థానాన్ని వహించింది. గ్రీక్ గ్రామాల నభివృద్ధి పరచడానికి ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ ఒక ప్రణాళికను సిద్ధ పరచింది.

ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థ రూపొందించిన ప్రణాళికలకు ఆర్థిక సహాయాన్ని చేయడానికి చతుస్సూత్ర కార్యక్రమం దోహద మివ్వదు గాని, గ్రీసు అంతర్యుద్ధాన్ని నివారించడానికి కోట్లాది డాలర్లను వెచ్చించిన అమెరికా ఇప్పుడు ఆ అంతర్యుద్ధంవల్ల వ్యాపించిన వ్యాధిని నిర్మూలించేందుకు లక్షల డాలర్లను ఖర్చుపెట్టడానికి వెనుకాడక పోవచ్చు.

## పరిశ్రమల అభివృద్ధికి డాలర్ పెట్టుబడులు, సాంకేతిక సహాయం

యూరప్ మొత్తంలో ఫ్యాక్టరీలు చాలా అసమర్థంగా నడుస్తున్నాయి. తగిన నిపుణులు లేకపోవడం, యంత్రాలు సరియైనవి కాకపోవడం దీనికి కారణాలు కాకపోయినా, పాత అలవాట్లను వదలివేయలేక ధరలను తగ్గించవుండడం, తక్కువ ఉత్పత్తిచేయడం ముఖ్య కారణాలని చెప్పవచ్చు. ధరలు తగ్గించడానికి ప్రయత్నిస్తే, జరిగే ప్రమాదం సంగతి ఇటీవల ఫ్రాన్సులోని రెండు ఉక్కు ఫ్యాక్టరీలకు పట్టిన గతిని పరిశీలిస్తే తేలుతుంది. మోటార్లకు, తగరపు గరాటాలకు వినియోగించబడే ఫ్లాట్ స్టీల్‌ను ఈ ఫ్యాక్టరీలు అతి చౌకగా తయారు చేయగలిగేవి. ఇందులో ప్రపంచం మొత్తంలో వ్యాపారాన్ని ఫ్రాన్సు హస్తగతం చేసుకో గలిగింది. అయితే, అంతర్జాతీయ వాణిజ్యరంగంలో గల ప్రతిబంధకాలు దానికి అడ్డుగా నిలిచినవి. ఈ విషయంలోనే

కాకుండా ఇంకా అనేక విషయాలలో అంతర్జాతీయ వాణిజ్య నిబంధనలే యూరోపియన్ పరిశ్రమల సామర్థ్యాన్ని కృంగ దీస్తున్నవి. మార్కెట్‌లో చెల్లుబడి అయ్యేదానికంటే ఎక్కువ ఎందుకు ఉత్పత్తిచేయాలని యూరోపియన్‌లు ప్రశ్నిస్తారు. ఈ కారణంగా ధరలను తగ్గనివ్వరు.

## ప్రాంతీయ అభివృద్ధి కార్యక్రమాలు

వెనుకబడివున్న ఏ ప్రాంతాన్ని అయినా, స్వశక్తిపై తిరిగి నిలబడేటట్టు చేయడానికై వ్యవసాయాభివృద్ధికి, పారిశ్రామికాభ్యున్నతికి సహాయం చేయడం చాలు. అక్కడక్కడ విడివిడిగా అభివృద్ధి ప్రణాళికలను అమలు జరపడంకంటే సర్వతోముఖాభివృద్ధి సాధనకై అన్ని ప్రాంతాలకు సంబంధించిన కార్యక్రమాలను పరస్పర సహాయ భూతంగా వుండే టట్టు లక్షించడం అత్యవసరం. అమెరికాలోని టెన్నసీవాలీ అథారిటీ ఇట్టిదే. ఒక్కొక్కసారి ఇట్టి ప్రణాళికలు ప్రధానంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికే ఉద్దేశించబడినా, నౌకా యానాన్ని, వరదల కంట్రోల్‌ను సాధించడమే గాక పారిశ్రామికాభివృద్ధికికూడా అవి దోహద మివ్వగలవు. స్కాండినేవియన్ రాజ్యాలలో ఇప్పుడు ప్రారంభించబడిన ప్రణాళికలు ఇట్టివే. మరికొన్ని ప్రణాళికలు తయారై అమలు జరగడానికి సిద్ధంగా వున్నవి. నెదర్లెండ్స్‌లో కేవలం బంజరు భూమి సాగుమాత్రమే ఉద్దేశించబడినా, ఇతరత్రా అన్నింటిని సాధించడానికి వీలుగానే ఈ ప్రణాళికలు తయారుచేయబడినవి.

హాలెండ్‌లో జూడర్ జీ ప్రణాళిక సముద్రాన్ని సైతం ఎండకట్టి ఆ భూమిలో సేద్యం చేయడానికి ఉపకరిస్తున్నది. ఈ విధంగా 1930 లో వీరింజెర్ మీర్ వద్ద 49,000 ఎకరాల భూమిని కొత్తగా డచ్ వారు సృష్టించ గలిగారు. దీనికి రెట్టింపు విస్తీర్ణంగల భూమిని 1942 సెప్టెంబర్ నాటికి ఉర్కూర్‌లాండ్ పోల్డర్ వద్ద సృష్టించారు. కొత్తగా బంజర్ల సాగుకు తయారు అయిన ప్రణాళికలవల్ల 5,50,000 ఎకరాల భూమి అదనంగా సాగు కాగలదు. స్కాట్లెండ్ కూడా బంజర్ల సాగుకు దశవర్ష కార్యక్రమం రూపొందించింది. 29 ప్రాజెక్టులు అమలు జరపబడగలవు. ఇందులో అన్నింటికంటె పెద్దది అయిన లోఫ్‌స్లాయ్ ప్రాజెక్టు పూర్తి అయింది. ఈ ప్రాజెక్టులన్నీ కలిసి ప్రస్తుతం వున్న 8,11,000 కిలోవాట్స్ విద్యుచ్ఛక్తిని నూటికి 60 వంతులదాకా పెంచగలవు.

ఫ్రాన్సులో యుద్ధానంతరం మోనెట్ ప్రణాళిక తయారు చేయబడింది. బొగ్గు, విద్యుచ్ఛక్తి, ఉక్కు, సిమెంట్, వ్యవసాయ యంత్రాల ఉత్పత్తితోపాటు రహదారుల అభివృద్ధికికూడా ఇది దోహదమిచ్చి ఫ్రెంచి ఆర్థికాభ్యుదయాన్ని సాధించగలదు. మోనెట్ ప్రణాళిక పరమలక్ష్యం మార్సెయిల్స్‌నుంచి పారిస్ వరకు కాలువలను త్రవ్వి, నదులను కలపడంద్వారా ఒకే ఒక నౌకాయాన మార్గాన్ని సృష్టించడమే. అప్పుడు నౌకలు సముద్రంచుట్టు తిరిగి, స్పెయిన్‌కు ప్రదక్షిణం చెయ్యవలసిన అవసరం తప్పుతుంది. డోన్‌గ్రీ మోన్‌డ్రాగన్ వద్ద రోన్‌నదిపై నిర్మించబడుతున్న

ఆనకట్ట 1952 నాటికి పూర్తి అయి, అదనంగా 3,60,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేస్తుంది.

యూరప్ మొత్తానికి మార్గదర్శకం కాగల ఆల్ వాలీ అభివృద్ధి ప్రణాళిక వాయువ్య స్విట్జర్లెండ్‌లో అమలు జరుగుతున్నది. 19 వ శతాబ్దంలోకూడా ఆల్ లోయలో ప్రజలు చాలా మొరటుగా జీవితాన్ని సాగించేవారు. అట్టి ఆల్ లోయ ఇప్పుడు క్రమేపీ సర్వతోముఖాభివృద్ధి గాంచుతున్నది.

సాలీనా సగటున అమెరికన్‌లు ఒక్కొక్కరు ఉపయోగించే విద్యుచ్ఛక్తికంటె నార్వేజియన్, స్విస్, స్వీడిష్ ప్రజలు ఉపయోగించేది చాలా ఎక్కువ. స్వీడన్‌లో అనేక నదులు వున్నందున విశేషంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయబడుతున్నది. అమెరికన్ పౌరుడు ఏడాదికి 1,610 కీలోవాట్స్ విద్యుచ్ఛక్తి ఉపయోగిస్తే, స్వీడిష్ పౌరుడు ఇప్పుడే 2000 కిలోవాట్స్ ఉపయోగిస్తున్నాడు. ఇంకా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి నధికం చేయడానికి స్వీడన్ ప్రణాళికలను తయారు చేస్తున్నది. సాలీనా 14,00,00,00,000 కిలోవాట్స్ విద్యుచ్ఛక్తిని అదనంగా ఉత్పత్తి చేయడానికి అది ప్రణాళికలను చేసింది. 1953 ఆ ప్రాంతానికి ఇందులో సగంవరకు ఉత్పత్తి కాగలదు.

స్వీడన్ వలెనే ఫిన్లెండ్‌కూడా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి నధికం చేయడానికి కృషి చేస్తున్నది. ద్వితీయ ప్రపంచ సంగ్రామం పూర్తి అయ్యే సరికి దేశంలో ఉత్పత్తి అయ్యే

విద్యుచ్ఛక్తిలో నాల్గవ వంతును రష్యాకు ఫిన్లెండ్ ఇచ్చింది. అక్కడినుంచి విద్యుచ్ఛక్తి తగ్గిపోయి, దాని పరిశ్రమలకు దెబ్బ తగులగా తిరిగి 1950 నాటికి విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని దాదాపు రెట్టింపుదాకా ఫిన్లెండ్ పెంచగలిగింది. ఓలూనదిపై 8 హైడ్రో ఎలక్ట్రిక్ ప్లాంటులను ఇమట్రా పవర్ కంపెనీ నిర్మిస్తున్నది. కెమీ, లీ నదులపై పోహ్జోలా కంపెనీ 20 విద్యుచ్ఛక్తి కేంద్రాలను నిర్మిస్తున్నది.

## అంతర్జాతీయ సహకారం

అభివృద్ధి ప్రణాళికలు పూర్తిగా లాభించడానికి, సర్వతో ముఖాభివృద్ధిని సాధించడానికి దేశాల సరిహద్దులను విస్మరించడం అత్యవసరం. బ్రిటన్, ఐర్లెండ్ల మధ్య పోరు అనాదినుంచి వున్నప్పటికీ, ఆ రెండూ యథార్థాన్ని గుర్తించి పరస్పర సహకారంతో షానాన్ నదిపై విద్యుచ్ఛక్తి కేంద్రాన్ని నెలకొల్పినందువల్లనే, అక్కడనుంచి ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తి ఐర్లెండ్లో అధిక భాగానికి సరఫరా చేయడానికి సాధ్యమైంది.

యూరప్లో కూడా దేశాల సరిహద్దులను అధిగమించి ప్రాంతీయ అభివృద్ధిని లక్షించిననాడు ఇప్పుడు ఒక దేశాన్ని చూస్తే మరొక దేశానికి వుండే రాగ విద్వేషాలు సమసి పోవడానికి అనువైన వాతావరణాన్ని సృష్టించగలవు.

ఇట్టి ప్రణాళికలలో విశేషంగా చర్చించబడినవి రైన్, డాన్యూబ్ నదులను కలిపే కాలువ. ఇది నిర్మించబడిననాడు

ఫ్రాన్స్, జర్మనీ, బెల్జియం, హాలెండ్, లగ్జెంబర్గ్‌లకు చెందిన 76 వేల చదరపుమైళ్ళ భూభాగాన్ని అభివృద్ధి పరచి 4,50,00,000 మంది ప్రజల అభ్యుదయాన్ని సాధించగలదు. వాణిజ్య విధి నిషేధాలను తొలగించి, ఇప్పుడు ఒకరిపై మరొక రికిగల కార్పణ్యాన్ని రూపుమాపి శాంతియుత వాతావరణాన్ని సృష్టించగలదు.

పశ్చిమయూరపునుంచి మధ్య యూరప్‌కు నౌకా మార్గాన్ని సృష్టించితే, అనగా నార్త్‌సీపై గల రోటర్‌డామ్ నుంచి బ్లాక్‌సీపై గల కాన్‌స్టాంట్ వరకు నౌకాయాన మార్గాన్ని ఏర్పరచితే అది ఏనాటికైనా ఇనపతెరను చించి వేయగలదు. డాన్యూబ్ నదిద్వారా తూర్పు, పశ్చిమ యూరపియన్ రాజ్యాల మధ్య ఏర్పడే సంబంధం ఎంతగా సత్ఫలితాలను సాధించగలదో చెప్పడం దుర్లభంకాని, ఇరవై భాషాలు కలిగివున్న ఇరవై దేశాలమధ్య పరస్పర సహకారం వృద్ధిపొంది క్రమేపీ ఆర్థికంగా సమైక్యం కాగలవని మాత్రం చెప్పవచ్చు.

వెనుకటివలె తిరిగి పశ్చిమ యూరప్‌లో ఉత్పత్తి అయ్యే సరుకు మధ్య, తూర్పు యూరప్‌లలో అమ్ముడు పోడానికి, పశ్చిమ యూరప్‌కు అవసరమైన ముడివస్తువులను తూర్పు యూరపియన్ దేశాలు ఎగుమతి చేయడానికి అవకాశం లభించగలదు. దీనిఫలితంగా ప్రాచ్య, పాశ్చాత్య ఖండాల మధ్య సాగుతున్న ప్రచ్ఛన్నయుద్ధం అంతరించి పరస్పర సుహృద్భావం నెలకొనగలదు.

పశ్చిమ యూరప్ తలవంటిది. తూర్పు యూరప్ శరీరం. ఈ రెండూ కలిస్తేనే అది మనగలదు. రెండూ విడివిడిగా వున్నంతకాలం రెండూ నిరర్థకంగానే మనగలవు.

అందుచేత, పశ్చిమ యూరప్ ఆర్థికాభివృద్ధితోపాటు తూర్పు యూరప్‌లో వాణిజ్యాన్ని అది పునరుద్ధరించుకోవడం అవసరం. దీనిని సాధించగలిగినవి ప్రాజెక్టులు కనుక ఆర్థికవేత్తలు, పెట్టుబడిదారులు, రాజకయవేత్తలు వెనక్కు తగ్గి, ఈ సమైక్యతను సాధించడానికి ఇంజనీరులకు అవకాశమివ్వాలి.

## పరతంత్ర యూరప్—తలలేని మొండెం

యూరప్‌కు డాన్యూబ్ నది జీవనాడి వంటిది. 3,80,000 చదరపుమైళ్ళ విస్తీర్ణం కలిగివున్న డాన్యూబ్ మైదానంలో 7,50,00,000 మంది ప్రజలు నివసిస్తున్నారు.

యూరప్‌లో మానవులు నిర్మించిన సరిహద్దులు, అర్థరహితమైన ఆర్థిక వ్యత్యాసాలు, మతిమాలిన ఇనుప తెరలు ఎంత అసహ్యమైనవో తెలుసుకోడానికి డాన్యూబ్ నది ప్రకృతి ప్రసాదించిన చక్కని సాధనం. డాన్యూబ్ నది వున్నంతకాలం తూర్పు యూరోపియన్ రాజ్యాలతో సహా అన్ని యూరోపియన్ రాజ్యాల మధ్య పరస్పర సుహృద్భావం నెలకొని వ్యాపార వాణిజ్యాలు వృద్ధి గాంచగలవని మానవుడు ఆశించవచ్చు.

తన కీలుబొమ్మలకూ, మిగతా ప్రపంచానికీ మధ్య రష్యా కల్పించిన అవరోధాలు, గీసిన గీతలు ఎంత అసహజమైనవో తెలుసుకోడానికి డాన్యూబ్ నది చక్కని దృష్టాంతం. బల్గేరియా, చెకోస్లోవాకియా, హంగరీ, రుమేనియా, యుగోస్లావియాలలో ఇది ప్రవహిస్తూ మానవుడు ఎంత అడ్డు పడినా, ఈ దేశా లన్నింటిగుండా ప్రవహించి, తాను సాగర గర్భాన్ని చేరగలనని నిరూపించి, ప్రజలకు, పరిపాలకులకు సత్యాన్ని అనుక్షణం గుర్తుకు తెస్తూవున్నది.

డాన్యూబ్ నదిలో నౌకలు నడిచేటంతగా వెడల్పు చేస్తే నార్త్‌సీనుంచి బ్లాక్‌సీవరకు నౌకాయాన మార్గం ఏర్పడి ప్రాచ్య ఖండంతో సరాసరి వర్తక వాణిజ్యాలు సాగించడానికి వీలవుతుందని వెయ్యి సంవత్సరాలక్రితం ఛార్లిమాంగ్ సూచించాడు. 19 వ శతాబ్దంలో ఈ నౌకాయాన మార్గాన్నిగురించి బవేరియా రాజు మొదటి లాడ్విగ్ కలలుకన్నాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసిన పిమ్మట తిరిగి 370 మైళ్ళ పొడవున కాలువను త్రవ్వి రైన్, డాన్యూబ్ నదులను కలపాలన్న ఆలోచన జరుగుతున్నది. ఇందుతో లాభం పొందగలిగే దేశాలు అన్నీకలిసి సమైక్యంగా దీనిని నిర్మించడానికి కృషిచేస్తూ, రహదారిమార్గం అభివృద్ధి గాంచడమే గాక పశ్చిమ యూరప్ వ్యవసాయ ఉత్పత్తి పెరుగుతుంది. హైడ్రో ఎలెక్ట్రిక్ పవర్ విశేషంగా పెరుగు తుంది. ఇందువల్ల బొగ్గు, పెట్రోల్, తగరం, సీసం, క్రోమైట్

మాంగనీస్ ఉత్పత్తులు, వాటితోపాటు పరిశ్రమలు పెరిగి, విద్య అభివృద్ధి గాంచి, సంఘం అభ్యున్నతి గాంచడం తథ్యం.

డాన్యూబ్ నదీ ప్రాంతాభివృద్ధికి సమైక్యంగా కృషి జరిగితే తూర్పు యూరోపియన్ రాజ్యాలు సహకరించ గలవని వెంటనే స్ఫురించగలదు. అయితే, యింతవరకు రష్యన్ ఉపగ్రహ రాజ్యాలుగా మారిన ఆ దేశాలలో తగిన సాంకేతిక శాస్త్ర నిపుణులుగాని, యంత్ర సామగ్రిగాని లేక పోగా, వాటికి ఇతరులతో సహకరించాలన్న ఉత్సాహమే నశించిపోయింది. అందుచేత, తూర్పు, పశ్చిమ యూరోపియన్ రాజ్యాల మధ్య సుహృద్భావం ఏర్పడనిదే డాన్యూబ్ నదీ ప్రాంత అభివృద్ధి ప్రణాళిక అమలులోనికి రావడం అసంభవం.

స్టాలిన్ పాలనకింద సోవియెట్ రష్యా సాధించిన ఉత్పత్తి సంగతి కమ్యూనిజం సామర్థ్యాన్ని వర్ణించే సందర్భంలో ఉదహరించడం పరిపాటిగా వుంది. అయినప్పటికీ రష్యాలో సగటు ఉత్పత్తి శక్తి 1900 సంవత్సరంనాటికంటే లవలేశంగా నైనా పెరగలేదు. అమెరికాలో సగటు ఉత్పత్తి శక్తి 1900 దానికంటె మూడు రెట్లు పెరిగింది. ఒక గంటలో ఒక రష్యన్ ఉత్పత్తి చేసినదాని కంటే ఎనిమిదిన్నర రెట్లు ఎక్కువగా వస్తువులను అదే కాలంలో అమెరికన్ ఉత్పత్తి చేస్తున్నాడు.

తన సంగతంతా రహస్యంగా వుంచుకొని, ఇతరులకేమాత్రం తెలియనివ్వకుండా వుండే ఇనుపతెర మన స్తత్వాన్ని రష్యా విడనాడనంతకాలం ఈ పరిస్థితి మారడం

అసాధ్యం. 32 సంవత్సరాలపాటు నిరంతరం—విశ్రమించకుండా—రష్యా కృషిచేసినప్పటికీ, నేటికికూడా సాంకేతిక శాస్త్ర పరిజ్ఞానంగాని, పరిశ్రమలు అభివృద్ధి పొందడానికి అనువైన వాతావరణంగాని, లేదా ప్రపంచపు మార్కెట్లను జయ ప్రదంగా ఆకట్టుకొనే సామర్థ్యంగాని దానికి అబ్బనేలేదు. దీనికి గల కారణాలు రష్యా శక్తికి అతీతమైన వన్నవి నిజమే. విప్లవానంతరం సంభవించిన కల్లోలం, క్షామం, తదనంతర జర్మనీ దండయాత్ర మున్నగువానివల్ల రష్యా పురోభివృద్ధికి అవరోధం ఏర్పడి వుండవచ్చు. కాని సత్యం ఒక్కటే ఇప్పటికీ రష్యా వెనకబడే వుంది.

రష్యాయే పారిశ్రామికంగా వెనుకబడి వున్నపుడు దాని ఉపగ్రహ రాజ్యాలు పురోగమించ గలవా? 1930 లో అమెరికన్‌కు సగటు సాలీనా ఆదాయం 1,381 డాలర్లు—నేటి అమెరికన్ సగటు ఆదాయంకంటె చాలా తక్కువ—హంగేరియన్ సగటు ఆదాయం 359, బల్గేరియన్ సగటు ఆదాయం 259, రుమేనియన్ సగటు ఆదాయం 243 డాలర్లు. అమెరికన్ పారిశ్రామిక కార్మికునితో సరిసమాన నైపుణ్యం కలిగివుండి తూర్పు యూరోపియన్ రాజ్యాలలోకెల్ల అమెరికనుతో సరి తూగగల ప్రతిభాశాలిగా పేరుగాంచిన జెక్ కార్మికుని సగటు ఆదాయంకూడా 500 డాలర్లే.

పోలెండ్ బోల్షివిక్ వ్యవస్థను స్థాపించి 1955 నాటి కల్లా జీవన వ్యయప్రమాణాన్ని రెట్టింపు చేయాలని నిర్ణయించింది. ఈ లక్ష్యసాధనకు అవసరమైన పారిశ్రామికా

భ్యుదయాన్ని సాధించడానికి యంత్రసామగ్రి దానికి పాశ్చాత్య రాజ్యాలనుంచే రావలసి వుంటుంది. వ్యవహార రంగంలో సహకార విధానాన్ని అమలు జరపడానికి గడువు నిర్ణయించ వలసి వుంటుంది. అధిక కృషిద్వారా జరిగిన అధికోత్పత్తు లను రష్యా తరలించుకొనిపోకుండా అది నిరోధించవలసి వుంటుంది. వీటన్నింటినీ బట్టి బోల్షివిక్ వ్యవస్థా స్థాపనో ద్దేశాన్ని విరమించనిదే మిగతా లక్ష్యాల సాధన అసంభవమని చెప్పవచ్చు.

చెకోస్లోవేకియాలో పరిశ్రమలు చాలావరకు అభివృద్ధి గాంచియే వున్నవి. ఇప్పుడు 75,00,00,000 కిలోవాట్స్–అవర్స్ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతూంటే 11,00,00,00,000 కిలోవాట్స్–అవర్స్ వరకు ఉత్పత్తిచేయగల ప్రణాళికను 1953 నాటికే పూర్తిచేయడానికి అది కృషి చేస్తున్నది. ఉక్కు ఉత్పత్తిని నూటికి 50 రేట్లు పెంచడానికి, వ్యవసాయ యంత్రాల ఉత్పత్తిని రెట్టింపు చేయడానికి, ఎలెక్ట్రిక్ మోటార్ల ఉత్పత్తిని నాలుగురెట్లకు పెంచడానికి కృషి చేస్తున్నది. వాటిలో విజయం పొందవచ్చు. అయితే, పాశ్చాత్య రాజ్యాలతో వర్తకం పడిపోయినందున చెకోస్లో వేకియాకూడా చాలా దెబ్బతిన్నది. అమెరికానుంచి దిగుమతులు ఆగిపోయినందున చెక్ యంత్రాలు దెబ్బతిన్నవి; ఉత్పత్తి తగ్గింది.

తూర్పు యూరప్‌కు చెందిన తదితర రాజ్యాలస్థితి ఈ మాత్రంగాకూడా లేదు. శెర్నవాడానుంచి కాన్‌స్టాంటా

వరకు రుమేనియా ఒక కాలువను త్రవ్వుతున్నది. దీనివల్ల రహదారి సౌకర్యం పెరగడమే గాక వరద ప్రమాదం తప్పి పోయి, వర్షాభావంవల్ల ఎలాంటి నష్టం పొందకుండా చేసుకో వచ్చు. మలేరియా పీడనుంచి విముక్తి పొందగలదు.

అయితే, పారిశ్రామికాభ్యుదయాన్ని సాధించడానికి సాంకేతిక ప్రవీణుల కొరత అడ్డుగావుంది. 30 ఏండ్లు కృషి చేసిన తర్వాత రష్యాకే ఈ కొరత తప్పనప్పుడు తూర్పు యూరోపియన్ రాజ్యాల సంగతి వేరే చెప్పాలా? రష్యన్ ఉపగ్రహ రాజ్యాలలో లభ్యమయ్యే ముడి సరుకులు రష్యాకే విశేషంగా కావాలి కనుక, పైగా తనతో తన ఉపగ్రహ రాజ్యాలు వర్తకంలో పోటీ చేయడం రష్యాకు ఇష్టంలేదు కనుక పశ్చిమ యూరప్‌కంటే పరిశ్రమలలో తూర్పు యూరప్ వెనుకబడి వుండడం ఖాయమనే చెప్పవచ్చు.

తూర్పు యూరోపియన్ రాజ్యాలకు పశ్చిమ యూరప్ ఎంతగా అవసరమో గ్రహించడానికి యూగోస్లావియా సంగతి పరికిస్తే తేలుతుంది. యూగోస్లావియాను పారిశ్రామి కంగా అభివృద్ధి పరచాలని మార్షల్ టిటో ఆశించగా, రష్యా అందుకు భిన్నంగా తలపెట్టింది. మార్షల్ టిటో ఉద్దేశ్యం సాగకుండా అనేక అవరోధాలు కలిగించింది. దానితో యంత్రాలకొరకు, సాంకేతిక నిపుణుల సహాయంకొరకు పాశ్చాత్య రాజ్యాలను టిటో అర్థించక తప్పలేదు. అందుకు గాను టిటోపై కోమిన్‌టాంగ్ దుష్ప్రచారం ప్రారంభించింది. దీని పర్యవసానంగా "రష్యన్ ఉపగ్రహ రాజ్య కుటుంబం"

నుంచి యూగోస్లావియాకు వైదొలగక తప్పలేదు. అప్పుడు అమెరికన్ డాలర్లు, పాశ్చాత్య రాజ్యాల యంత్రాలు మార్షల్ టిటోకు లభించినవి. టిటో ఏదో ఒకవిధంగా తుద ముట్టించబడకపోతే యూగోస్లావియా పారిశ్రామికంగా అభివృద్ధి గాంచడం తథ్యం. యూగోస్లావియాకు 2,00,00,000 డాలర్లు అప్పు నివ్వడానికి అమెరికన్ ఎక్స్‌పోర్ట్, ఇంపోర్ట్ బ్యాంకు, 25,00,00,00 డాలర్లు అప్పు నివ్వడానికి ప్రపంచ బ్యాంకి ఆమోదించినవి. యూగోస్లావియా ఎంత త్వరితంగా అభివృద్ధి ప్రణాళికలను అమలు జరిపితే అంత త్వరగా దానికి డాలర్ల సహాయం లభించగలదు. అది పూర్తిగా అభివృద్ధి గాంచడానికి వీలుగా ఇనుము, బొగ్గు, రాగి, బాక్సైట్ ఆంటీమొనీ మున్నగు ఖనిజాలు ఆ దేశంలో విశేషంగా లభ్యం కాగలవు. యూగోస్లావియా ప్రజలు స్థిర సంకల్పులు, స్థిత ప్రజ్ఞులు కూడా. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని మూడు రెట్లు పెంచడం దాని మొదటి ప్రణాళిక. వాల్సినా నదిపై జెల్జ్నెనికావద్ద పెద్ద ఆనకట్ట నిర్మించబడుతున్నది. వందల కొలది ఏండ్లలోగాని సాధించలేని అభివృద్ధిని అయిదు సంవత్స రాలలోనే సాధించడానికి పట్టుదలతో యూగోస్లావియా కృషి చేస్తున్నది.

రష్యన్ ఉపగ్రహ రాజ్యాలకు పాశ్చాత్య రాజ్యాల సహాయం ఎంత అవసరమో రష్యాకు కూడా అంత అవసరం వుంది. పారిశ్రామికాభ్యున్నతికి తగిన స్తోమతును సాధించ డానికి అనవరతం అది కృషిచేస్తున్నది. అయినా అది సాధించ

వలసింది చాలావుంది. 1949 లో దాని ఆర్థిక స్తోమతుకంటె నూటికి 25 వంతులు తక్కువ. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం ఎంత పెట్రోల్‌ను ఉత్పత్తి చేయగలిగిందో అంతే పెట్రోలును ఉత్పత్తి చేస్తున్నది. 2,13,00,000 టన్నుల ఉక్కును మాత్రమే రష్యా ఉత్పత్తి చేస్తూవుంటే దానికి నాలుగురెట్లు అమెరికా ఉత్పత్తి చేస్తున్నది. 1940 సంవత్సరం కంటే ముఖ్యంగా పరిగణించ తగినంతగా రష్యా అధికోత్పత్తిని సాధించ గలిగింది ఒక్క విద్యుచ్ఛక్తి మాత్రమే. ఇప్పు డది సాలీనా 75,00,00,00,000 కిలో వాట్స్—అవర్స్ విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేస్తున్నది. అమెరికా సాలీనా 3,00,00,00,00,000 కిలో వాట్స్—అవర్స్ విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేస్తున్నది. అయితే, ఇంతమాత్రంచేతనే రష్యా ఉత్పత్తిశక్తి పెరగదని గాని, లేదా బ్రహ్మాండమైన ప్రాజెక్టులను అమలు జరపలేదని గాని అనుకోరాదు. 1937 తో అంతమైన 10 సంవత్సరాలలో సోవియెట్ సెంట్రల్ ఆసియా పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తులు దాదాపు రెండున్నరరెట్లు అభివృద్ధి చేయబడినవని హార్వర్డ్ విశ్వవిద్యాలయంలోని రష్యన్ సమస్యల శాఖ అధిపతి వారెన్ విల్‌హెల్మ్ అంచనా వేశాడు. ఇప్పుడు తిరిగి అంతపెద్ద ప్రణాళికలు అమలు జరపడానికి కృషి జరుగుతున్నది.

(1) 1924 నుంచి 1948 లోపున సోవియెట్ యూనియన్ 25,00,000 ఎకరాలలో చెట్లునాటితే యుద్ధానంతరం పునర్నిర్మాణ కార్యక్రమంలో 1,50,00,000 ఎకరాలలో

చెట్లునాటి, అడవులు సృష్టించడానికి లక్ష్యించబడింది. దీనితో నాలుగువేల మైళ్ళ అడవులు ఏర్పడగలవన్న మాట.

(2) సైబీరియా అభివృద్ధికే ఇంకా విశేషంగా కృషి చేస్తున్నది. ఉజ్ బెక్ స్థాన్ లోని సిర్—దార్యానదిపై కొత్తగా నిర్మించబడిన ఫార్ ఖాద్ హైడ్రో ఎలెక్ట్రిక్ స్టేషన్ అనేక వందలు కొత్త ఫ్యాక్టరీలకు, మిల్లులకు కొత్తగా విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తున్నది. దానికి కొన్నిమైళ్ళ దూరంలోనే మరొకపెద్ద డామ్ నిర్మాణం యత్నించబడుతున్నది.

(3) రష్యన్ విజ్ఞతకు, పట్టుదలకు ఆర్కిటిక్ ప్రాంతంలో వారు సాధించిన కృషి దృష్టాంతం. మంచుగడ్డకట్టేటప్పుడే ఆ ప్రాంతంలో ఇందిగిర్కి, కోల్యామా నదులను పారించి, ఫ్రాన్స్, జర్మనీలకంటె విస్తృతభూమిలో సేద్యం సాగిస్తున్నారు. పోలార్ సీ ప్రాంతంలో పారిశ్రామిక నగరాలు, సైబీరియా ఎడారిలో మిలిటరీ స్థావరాలు నిర్మించబడుతున్నవి.

(4) ఓల్గానది ప్రాజెక్టుకూడా మహిమాన్వితమైనదే. ఉత్తరంగా ప్రవహిస్తున్న రెండునదులను ఎడారి భూములలో కూడా ఉత్తరంగా ప్రవహింపజేయడానికై పరమాణుశక్తిని రష్యన్ లు ఉపయోగిస్తున్నట్టు సూచనగా బయటపెట్టారు. ఓల్గా ప్రాజెక్టుతో 3,000 మైళ్ళ పొడవున వైట్ సీపై గల ఆర్చెంగెల్ నుంచి బ్లాక్ సీపై గల బాటమ్ వరకు, అక్కడినుంచి కాస్పియన్ సముద్రంలోని ఆస్ట్రఖాన్ వరకు నౌకాయాన మార్గం ఏర్పడుతుంది. గత శతాబ్దంలో 8000 వేల చదరపు

మైళ్ళ మేరను కాస్పియన్ సముద్రంలో కలిపివేసుకున్నది. ఇప్పుడు ఈ కాలువద్వారా 5,00,00,000 ఎకరాలు సాగుకు అందుబాటులోనికి వస్తుంది. ఆ సముద్రంపై గల రేవులకు ఎంతమాత్రం ముప్పు వాటిల్లదు.

ఆనకట్టలు, కాలువలు, రిజర్వాయర్లు మాత్రమేగాక 14 పెద్ద హైడ్రో ఎలెక్ట్రిక్ స్టేషన్‌లుకూడా నిర్మించబడ గలవు. ఇందులో చాలా స్టేషన్‌ల నిర్మాణం ప్రారంభమైంది. వాటిలోనిదే గోర్కు స్టేషన్. ఈ కొత్త స్టేషన్‌లవల్ల 1,00,00,000 నుంచి 1,20,00,000 కిలోవాట్స్ వరకు సాలీనా అదనంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పెరుగుతుంది. దీనితో రష్యాలో విద్యుచ్ఛక్తి మొత్తం సాలీనా ఉత్పత్తి 55,00,00,00,000 కిలోవాట్స్ అవర్సు వరకు పెరుగుతుంది. అంటే, ఇటలీ, ఫ్రాన్సులు రెండూ కలిసి యుద్ధానికి పూర్వం ఉత్పత్తి చేసినదానికంటె ఎక్కువన్న మాట. రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలు కలిసి టెన్నెసీవాలీ ప్రాజెక్టువంటి మహాద్భుత ప్రణాళికలను అమలుజరపడానికి ఏకాగ్రచిత్తంతో కృషిచేస్తుంటే అవి పురోగమించడానికి మారుగా ఎందుకు వెనుకకు పోతున్నవి? స్వాతంత్ర్యం పరిమితం కావడంవల్లనే నని జవాబు చెప్పకోక తప్పదు. విదేశాలలో అమెరికా ప్రభుత్వం కాక ప్రయివేట్ వ్యక్తులే పెట్టుబడి పెట్టాలన్న సిద్ధాంతమే చతుర్థసూత్ర కార్యక్రమానికి ప్రాతిపదిక కావ డానికి గల కారణంకూడా ఈ జవాబులోనే నిబిడీకృతమై వుంది. టెన్నెసీవాలీ అథారిటీ పబ్లిక్ కార్పొరేషన్.

భూసారాన్ని రక్షించి, వరదలను నిరోధించి, విద్యుచ్ఛక్తిని అది సరఫరా చేయగానే ప్రయివేటు పెట్టుబడిదారులు గబగబా వచ్చి పెట్టుబడులు పెట్టి లాభాలు తీయడానికి గబగబా పరిశ్రమలు స్థాపించి ద్విగుణీకృతోత్సాహంతో పనిచేశారు.

19 వ శతాబ్దంలో వ్యవసాయాన్ని ప్రోత్సహించడానికి ప్రభుత్వపు భూములను సాగుచేసినవారికి అమెరికన్ ఫెడరల్ ప్రభుత్వం వాటినిచ్చివేసినట్టే టెన్నెసీవాలీ అథారిటీకూడా పరిశ్రమలను నెలకొల్పడానికి ప్రయివేటు పెట్టుబడిని ప్రోత్సహించింది. అలా అది వ్యవహరించి వుండకపోతే, ఈ ప్రాంతం సర్వత్రా ఆర్థికంగా అభివృద్ధి పొందివుండేదే కాదు.

అమెరికా ప్రభుత్వం సాధనసంపత్తిని మాత్రం చేతికిచ్చి, అది ఎలా వినియోగించబడవలెనో నిర్ణయించకుండా పూర్తి స్వేచ్ఛ నిస్తుంది. దాని నెలా వినియోగించుకోవలెనో రాష్ట్ర సంఘాలు, ప్రాంతీయ సంఘాలు, పారిశ్రామిక వేత్తలు నిర్ణయిస్తారు. వెంటనే వారికి కావలసిన సలహాలివ్వడానికి ప్రభుత్వం తాలూకు నిపుణులు సిద్ధంగా వుంటారు. కాని, వారిచ్చిన సలహాలపై నిర్ణయాలు చేసేవి స్థానిక సంఘాలే.

రష్యాలోను, తూర్పు యూరప్ రాజ్యాలలోను ప్రయివేటు పెట్టుబడి లేనేలేదు. కొత్తగా ఉత్పత్తి చేయబడిన విద్యుచ్ఛక్తి అంతా ప్రభుత్వం నిర్ణయించిన కార్యక్రమాల నిర్వహణకే వినియోగించబడుతుంది. అది ట్రాక్టర్లను తయారుచేస్తుంది గాని కార్లను ఉత్పత్తిచేయదు. సైనికులకు

యూనిఫారమ్‌లనే తయారుచేస్తుంది గాని ఆటలలో ధరించే చొక్కాలను కాదు. అయితే, ప్రజాస్వామిక దేశాలలో వర్తకంలో పోటీ వుండడంచేత కారులు, ట్రాక్టర్లు, ఆర్మీ యూనిఫారమ్‌లు, ఆటలలో తొడుగుకునే చొక్కాలుకూడా ఉత్పత్తి చేయబడగలవు. ప్రభుత్వం అజమాయిషీ కింద ఇవి ఉత్పత్తి చేయబడిన దానికంటె చౌకగాను, శీఘ్రంగాను ప్రయివేటు యాజమాన్యంలో ఇవి ఉత్పత్తి కాగలవు. ప్రయివేటువ్యాపారంలో పోటీవుండడం, ప్రభుత్వం యాజమాన్యం కిందనడిచే వాటికి ఆ పోటీ లేకపోవడం దీనికి ముఖ్య కారణం.

వెనుకబడివున్న దేశాలలో పెట్టుబడులు పెట్టడానికి ఉత్సహించే ప్రయివేటు వాణిజ్యాలను ప్రోత్సహించడమే నూతన మహత్తర ప్రణాళిక ప్రధానోద్దేశ్యం. యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వంగాని లేదా ప్రపంచ బ్యాంకిగాని ప్రయివేటు పెట్టుబడులచే నిర్వహించబడదగు పరిశ్రమలలో సమంజసమైన ప్రణాళికలకు కావలసిన అప్పులు ఇవ్వగలవు.

రష్యా ఎంత బ్రహ్మాండమైన ప్రణాళికలను అమలుపరచినా యంత్రాలు యంత్ర పరికరాలు దానికి లేనేలేవు. ప్రజలకు అవసరమైన వస్తువుల కొరత ఇంకా తప్పనేలేదు. ఈ పరిస్థితులు ఇంతలో తొలిగే సూచనలుకూడా కానరావు. సాంకేతిక నిపుణుల సహాయంకూడా ఇలాగే కొరతగా వుంది. 1949 లో ప్రపంచంలోకెల్ల ప్రజ్ఞావంతులైన భూతత్వ శాస్త్రవేత్తల సమావేశం స్విట్జర్లెండ్‌లోని బాసెల్‌లో జరిగినపుడు ప్రతినిధులను పంపించవలసిందిగా

తూర్పు యూరోపియన్ రాజ్యాలు ప్రతి ఒక్కదానికి ఆహ్వానాలు పంపించబడినవి. రష్యన్‌లు దానికి జవాబుకూడా వ్రాయలేదు. ఆ ఆహ్వానాలను చెకోస్లొవాకియా, పోలెండ్‌లు ఆమోదించినవి. కాని, చివరకు క్రెమ్లిన్ ఒత్తిడిపై మనస్సు మార్చుకున్నవి. ఈ విధంగా ఆర్థిక సమస్యల విషయంలోనేమి, రాజకీయ సమస్యల విషయంలోనేమి ప్రపంచంతో, కలవకుండా ఏకాకిగావుండే మన స్తత్వానికి రష్యా అలవాటు పడినందుననేమి ఎంత సాధన సంపత్తివున్నా అది పురోగమించలేకుండా పోతున్నది. వ్యష్టి స్వాతంత్ర్యం అభ్యుదయానికి మొదటిమెట్టు దేశం మొత్తం అభివృద్ధికి ప్రతిబంధకం కాకుండాను, భంగకరం కాకుండాను ఏవ్యక్తికైనా స్వేచ్ఛగా వ్యవహరించడానికి, అనేక ప్రయత్నాలు చేయడానికి స్వాతంత్ర్యం వున్నప్పుడుగాని సర్వతోముఖాభివృద్ధి సాధ్యం కాదు. కమ్యూనిస్టు రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలు ఈ సత్యాన్ని గుర్తించేవరకు అవి అమెరికన్‌లతో గాని, అమెరికన్ యంత్రాలతోగాని పోటీచేసి విజయం పొందజాలవు. ఈ సత్యాన్ని గుర్తించిననాడు అవి కమ్యూనిస్టు దేశాలుగా మనజాలవు.

# తొలి పలుకు

సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి సహాయం చేయడం, అమెరికన్ డాలర్లను పెట్టుబడి పెట్టడం—ఈ రెండింటిపై మాత్రమే నూతన మహత్తర ప్రణాళిక జయప్రదం కావడం ఆధారపడిలేదు. పరస్పర సహకారంతో వ్యవహరించడానికి ప్రజలు చూపే పూనికపైన, పరస్పర సహకారంతో మానవాళి నిర్వహించే కార్యక్రమానికి ప్రకృతి తోడుపడ్డంపైన కూడా ఈ కార్యక్రమం విజయవంతం కావడం ఆధారపడి వుంది. ప్రపంచ రాజ్యాలు స్వార్థాన్ని విస్మరించి, ఇంతకు ముందెన్నడూ కని విని ఎరుగని సమైక్యంతో వ్యవహరించడం పైనే ఇది ఆధారపడి వుంది. ప్రపంచం మొత్తం పారిశ్రామికంగా అభ్యున్నతి గాంచిననాడు దానికి శాశ్వతంగా అవసరం కాగల ప్రకృతి సంపద పూర్తిగా లభ్యంకాగలదన్న అంచనాతోనే ఈ ప్రణాళిక రూపొందించబడింది. ఈ ప్రణాళిక జయప్రదంగా అమలు జరగడానికి స్వాతంత్ర్యంపట్ల అమెరికాకు గల విశ్వాసం మరింత దృఢతరం కావలసివుంది.

ముందు పేజీలలో ప్రకృతి సంపద, మానవాళి ఆశయాలు, ఆశలు, వారి మనస్తత్వం వివరించబడినవి.

## సహకారమే కీలకం

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో అక్షరాజ్యాలను నిర్జించడానికి సైనిక, ఆర్థిక రంగాలలో ఐక్యరాజ్యాలు పరస్పర సహకారంతో వ్యవహరించవలసి వచ్చింది. అజ్ఞానంనుంచి,

దారిద్ర్యంనుంచి, లేమినుంచి మానవాళికి విముక్తి కలిగించ డానికి ప్రపంచ రాజ్యాలమధ్య మరింత సహకారాన్ని సాధించడమే చతుర్థసూత్ర కార్యక్రమం లక్ష్యం.

1949 లో చతుర్థసూత్ర కార్యక్రమానికి ప్రారంభోత్సవ జరుపుతూ ప్రెసిడెంట్ ట్రూమన్ ఇలా అన్నాడు :—

"ప్రపంచంలోని స్వతంత్ర దేశాల ప్రజలు వారంతట వారే అన్నవస్త్రాలు ఉత్పత్తి నధికం చేసుకోడానికి, గృహాలన ఇతోధికంగా నిర్మించుకోడానికి అవసరమైన సహాయాన్ని చేయడం, ఈ కృషిలో వారిపై పడగల భారాన్ని తగ్గించ డానికి వారికి కావలసిన యంత్రశక్తిని సమకూర్చడం మాత్రమే మన ప్రధానలక్ష్యం కావాలి. వారికృషికి పూర్తిగ అవకాశ మివ్వాలి. ప్రపంచ రాజ్యాలు పరస్పర సహకారంతో సమైక్యంగా ఐక్యరాజ్య సమితి ద్వారాను, దానితాలూక శాఖల ద్వారాను కృషిచేయడానికి ఇది సాధనం కావాలి శాంతి, సమృద్ధత, స్వాతంత్ర్యాల సముపార్జనకు ప్రపంచ మొత్తం కృషిచేయడానికి ఇది మార్గంకావాలి."

వెనుకబడివున్న దేశాలలో అభివృద్ధి కార్యక్రమాలన అమలు జరపడానికి అనేకరకాల సంస్థలు—వాణిజ్య సంస్థలు వైద్య, విద్యాప్రచారక సంస్థలు, ప్రభుత్వం తాలూకు శాఖలు అంతర్జాతీయ సంస్థల తాలూకు శాఖలు—కృషిచేయవలసి వున్నవి.

ఇతర దేశాలకుకూడా ప్రత్యేక కార్యక్రమాల వుండవచ్చు. కాని, అవి దీనికి సంబంధించి వుండేవే కావచ్చు

ఉదాహరణకు: బ్రిటన్, ఫ్రాన్స్, బెల్జియమ్‌లు ఆఫ్రికాలో ఇట్టి కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నవి. సోవియెట్ యూనియన్ కూడా బహుశా తన ఉపగ్రహ రాజ్యాలలో ఇట్టి కార్యక్రమాలను అమలు జరుపుతూ వుండవచ్చు.

నూతన మహత్తర ప్రణాళిక ఒక స్థిరరూపంపొంది, దానికి నామకరణం జరగడానికి పూర్వం అమెరికా ప్రభుత్వం తాలూకు వివిధ శాఖలు, అమెరికాలోని వివిధ సంస్థలు శాస్త్రీయ విజ్ఞానానికి సంబంధించిన సమాచారాన్ని అన్ని దేశాలకు వివరిస్తూ వుండేవి. ఆహార పదార్థాల సరఫరా, ప్రజారోగ్యం, విద్యాభివృద్ధి సాధన కార్యక్రమాలను గురించి "ఇంటర్ అమెరికన్ ఎఫెయిర్స్" తాలూకు పరిశోధక సంస్థ పరిశోధనలు జరుపుతూ వుండేది. ఫుల్‌బ్రైట్ చట్టంప్రకారం ఉపాధ్యాయులు, విద్యార్థులు ఇతర దేశాలకు విద్యాబోధనలో శిక్షణ నిస్తూవుండేవారు. ఇతర దేశాలనుంచి శిక్షణ పొందడానికి కొందరు మనదేశానికే వచ్చేవారు. యూరప్‌లోను, దాని పరిసర రాజ్యాలలోను, చైనా, కొరియాలలోను వ్యవసాయం, పరిశ్రమలలో అధునాతన విధానాలను స్వయంగా చేసి చూపించడం ద్వారా ఆర్థిక సహకార సంస్థ ప్రచారం చేస్తూవుండేది. ఫిలిప్పీన్స్, జపాన్‌లలో పునర్నిర్మాణ కార్యక్రమాలు అమలు జరుగుతున్నవి. ఐక్యరాజ్య సమితి తాలూకు వివిధ శాఖలద్వారా ఆర్థికాభివృద్ధి సాధనకు మనం కృషి చేసేవారం. ప్రపంచబ్యాంకి, ఎక్స్‌పోర్ట్ ఇంపోర్ట్ బ్యాంకి విడివిడిగాను సమష్టిగాను అప్పులు ఇచ్చేవి. రహ

దారుల అభివృద్ధికి అవసరమైన సాంకేతిక సహాయాన్ని అంద జేసే వాళ్ళం.

చతుర్థసూత్ర కార్యక్రమం కింద ఈ సహాయ కార్య క్రమాలే ద్విగుణీకృతం చేయబడినవి. సంధులు, ఒడంబడికలు, హామీలు, సుంకాల మార్పులు మున్నగువాటి ద్వారా ప్రయివేటు పెట్టుబడి వెచ్చించబడుతుంది. ప్రయివేటు సంస్థలకు సాంకేతిక శిక్షణ గరప బడుతుంది. ప్రభుత్వాలు నిర్వహించే కార్యక్రమాలపై అజమాయిషీ చేయడానికి నిపుణులు పంపించబడగలరు.

ప్రారంభదశలో ఇంకా ఐక్యరాజ్యసమితి నిర్వహించ లేని కార్యక్రమాల నిర్వహణకు అమెరికాయే ఒడంబడికలు చేసుకొని, వాటి నిర్వహణ బాధ్యతను స్వీకరించగలదు. ఐక్య రాజ్యసమితికి వసతులన్నీ చేకూరిన పిమ్మట ఈ బాధ్యతను అదే స్వీకరించవచ్చు. ఏమైనా చాలాకాలంవరకు ప్రయివేటు సంస్థల సహకారం ద్వారాను, దేశాల మధ్య సహకారం ద్వారాను, అంతర్జాతీయ సహకారం ద్వారాను ఈ కార్య క్రమం వేగంగా సాగవలసివుంది.

చతుర్థసూత్ర కార్యక్రమం కింద ఈ సంవత్సరం 4,50,00,000 డాలర్లను అమెరికా ఖర్చు పెట్ట దలచుకున్నది. ఇందులో దాదాపు 1,00,00,000 డాలర్లను నూతన మహత్తర ప్రణాళిక ద్వారా అమలు జరిగే ప్రణాళికలను కొనసాగించ డానికి కావలసి వుంటవి. ఇదికాక ఇందులో ఎక్కువ భాగం వెనుకబడిన దేశాలకు సాంకేతిక కార్యక్రమాలకు వినియో

గించడానికిగాను ఐక్యరాజ్యసమితికి, దాని శాఖలకు ఇవ్వ బడుతుంది.

సాధ్యమైనంత ఎక్కువగా విజయాన్ని పొందడానికి ప్రపంచం మొత్తంలో గల విజ్ఞాన సంపత్తిని, సాధన సంపత్తిని చతుర్థసూత్ర కార్యక్రమం వినియోగించుకోవాలి. అభివృద్ధి పొందివున్న దేశాలు ఇందుకు సహకరించ వలెనని 1949 మే నెలలో ఐక్యరాజ్య సమితి జనరల్ సెక్రటరీ అన్నాడు. ఈ దేశాల అనుభవం ఇప్పుడు అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరపడానికి ప్రారంభించడానికి ఉప క్రమించిన దేశాలకు వినియోగపడగలదని చెప్తూ, ఇతరులు కూడా చేయగల సహాయం చాల వున్నదని ఆయన అన్నాడు. వివిధ దేశాలు సాంకేతిక నిపుణులను పంపి, సాంకేతిక శిక్షణ నివ్వవచ్చు నని సూచించాడు.

ఐక్యరాజ్య సమితి ప్రణాళికలో సమితియందు సభ్యత్వం కలిగివున్న దేశాలు మానవ జీవన వ్యయప్రమాణాన్ని అభి వృద్ధిపరచి, అందరికీ భృతి చూపించి, ఆర్థిక, సాంఘికాభ్యుద యానికి కృషి చేయగలవని పేర్కొనబడింది. అంతర్జాతీయ ఆర్థిక, సాంఘిక, ఆరోగ్య, సాంస్కృతిక సమస్యల పరిష్కా రానికి, విద్యాభివృద్ధి సాధన కృషికి సమితి సభ్యత్వం గల దేశాలు సహకరించగలవనికూడా వాగ్దానం చేయబడింది.

ప్రెసిడెంట్ ట్రూమన్ చతుర్థసూత్ర కార్యక్రమం ప్రకటించబడిన ఫలితంగా ప్రపంచాభ్యుదయానికి ఐక్యరాజ్య

సమితి అమలు జరుపదగు కార్యక్రమాలు పదిరెట్లవరకు హెచ్చించ బడినవి.

1949 లోనే ఐక్యరాజ్య సమితి వివిధశాఖలు పరస్పర సహకారంతో ఈ లక్ష్య సాధనకు కృషిచేయడం ప్రారంభించి నవి. ప్రపంచ ఆరోగ్యసంస్థ, ఐక్యరాజ్య సమితి తాలూకు విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక ప్రచారకసంస్థ పరస్పర సహకారంతో వ్యవహరించడం ప్రారంభించినవని సెక్రెటరీ జనరల్ అన్నాడు. ఐక్యరాజ్య సమితి శాఖల కృషికి అనుబంధంగా చతుర్థసూత్ర కార్యక్రమం వుంటుంది. 1950 సంవత్సరానికి చతుర్థసూత్ర కార్యక్రమం పరిశీలిస్తే ఈ సంగతి తేలుతుంది.

దక్షిణ అమెరికాలో కార్మికులు విశేషంగా ఉత్పత్తిని సాధించడానికి కొన్ని సమస్యలు అవరోధంగా వున్నవి. అంతర్జాతీయ కార్మికసంస్థ అమెరికా వ్యవసాయశాఖతో కలిసి లాటిన్ అమెరికా అడవుల సంరక్షణ సమస్యలను పరిశీలిస్తుంది. ఇంటర్ అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ తాలూకు వ్యవసాయశాస్త్ర పరిశోధక సంస్థతో కలిసి ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థ లాటిన్ అమెరికా వ్యవసాయ సమస్యలను పరిశీలిస్తుంది. అమెరికా దేశీయశాఖతో కలిసి భూ సంస్కరణల సమస్యను పరిశీలిస్తుంది. ఎపిజూటిక్స్ తాలూకు ఇంటర్నేషనల్ ఆఫీసుతో చేరి పశువుల వ్యాధులనుగూర్చి చర్చిస్తుంది. ప్రపంచ విజ్ఞాన సమితి హైటీలో విద్యాలయాలను నెలకొల్పడానికి కృషి చేస్తుంది. లైబీరియాలోని 8 గ్రామీణ విద్యాలయాలకు, ఒక పట్టణ విద్యాలయానికి అమెరికా పెట్టుబడి పెడుతున్నది.

ప్రపంచ ఆరోగ్యసంస్థ, చతుర్థసూత్ర కార్యక్రమం నిర్వాహకులు కలిసి మలేరియా వ్యాధి నివారణనుగురించి ప్రచారం చేస్తారు. ప్రపంచ శిశుసంక్షేమ నిధి ప్రపంచ ఆరోగ్యసంస్థతో కలిసి లాటిన్ అమెరికన్ బాలబాలికలకు క్షయవ్యాధి సోకకుండా నివారణకు ఇంజక్షనుల నిస్తుంది. అమెరికా పౌర విమానయానశాఖ, అంతర్జాతీయ పౌర విమానయానసంస్థ కలిసి వైమానిక మార్గాల అభివృద్ధికి సూచనలు చేయగలవు. ఈ విధంగా పరస్పర సహకారంతో ఈ కార్యక్రమమంతా నిర్వహించబడుతుంది.

అభివృద్ధి ప్రణాళికలను అమలు జరపడంలో పరస్పర సహకారం అవసరమనే ముఖ్యాంశంపైనే నూతన మహత్తర ప్రణాళిక లక్షించబడింది. తొలిసంవత్సర కార్యక్రమాన్ని పరిశీలిస్తే, ఒకదాని కొకటి అనుబంధంగా వుండగలవని స్పష్టపడుతుంది. ఆర్థికాభివృద్ధి ప్రణాళికలతో పాటే వ్యవసాయాభివృద్ధికి, అటవీ సంపద సంరక్షణకు కార్యక్రమం అమలు జరుపబడుతుంది. వాటితో పాటే ప్రజారోగ్యాభివద్ధికి కృషి జరుగుతుంది. రహదారి మార్గాల అభివృద్ధి, విద్యాప్రచారం వీటికి అనుబంధంగానే వుండగలవు. మొత్తంమీద పెట్టుబడి పెట్టే ప్రయివేటు సంస్థలు, ప్రభుత్వ సంస్థలుకూడా పారిశ్రామికాభివృద్ధికి కృషిచేయాలి, వాటికి ఉత్సాహం కలిగే విధంగా పరిస్థితుల నభివృద్ధి పరచడమే దీనిలక్ష్యం. అయితే, ఈ ఉత్సాహం ఎంతవరకు ఏ యే విధంగా వుండగల దనేది ఆ యా దేశాలను బట్టే వుంటుంది. బహుశా చిలీ అన్నింటి

కంటె ముందుగా పారిశ్రామికాభ్యున్నతి గాంచవచ్చు. ఇరాక్ కంటె ముందుగా పాలస్తీనా, చైనాకంటె ముందుగా ఇండియా ఇదేవిధంగా పారిశ్రామికాభివృద్ధిని సాధించవచ్చు. చతుర్థ సూత్ర కార్యక్రమం ద్విగుణీకృతంగా అమలు జరిగిన కొలదీ ఇప్పుడు భావించిన దానికంటె ముందుగానే దాని లక్ష్యం సిద్ధించవచ్చు.

మున్ముందు సాగించవలసిన కార్యక్రమం పూర్తికాగానే వివిధ దేశాలకు అనువైన విధంగా శాస్త్రీయసంపత్తి నుపయోగించుకొనే మార్గాలను పరిశోధించడానికి కేంద్రాలు ఏర్పాటు చేయబడగలవు. సిమెంట్, ఎరువులు, ఇనుము, గాజు, వస్త్రాల పరిశ్రమల విషయమై పరిశోధనలు జరగగలవు. సాంకేతిక ప్రావీణ్యం పొందినపుడు అతి చౌకగానే అన్ని వస్తువులను తయారుచేయవచ్చునని మారిస్‌మాక్ అన్నాడు. అప్పుడు అవి కుటీర పరిశ్రమలుగా వృద్ధిపొందగలవు. గ్రామీణ పరిశ్రమలతోపాటే సహకార సంఘాలు ఏర్పడగలవు. వాటితోపాటే గ్రామీణ పరపతి సంఘాలు ఏర్పడగలవు. గ్రామీణ సహకార సంఘాలు సింహళంలోను, గ్రామీణ పరపతి సంఘాలు చైనాలోను వున్నవి. పారిశ్రామిక సహకార సంఘాలు కొలంబియాలోను, వ్యవసాయ సహకార సంఘాలు థాయ్‌లెండ్‌లోను వున్నాయి. ఇట్టి సహకారోద్యమానికి ఇండియా, బర్మా, ఈజిప్ట్, ఇరాన్, అర్జెంటీనా, బ్రాజిల్. కలోనియల్ ఆఫ్రికాలలో విశేషప్రచారం సాగుతున్నది. వ్యవసాయం, ఆరోగ్యం, రహదారులు, విద్య, కుటీరపరిశ్రమలు,

అభివృద్ధి పొందిననాడు ఏడాది తరాత్వ ఆర్థికాభివృద్ధి స్పష్టంగా గోచరించగలదు. ఇప్పుడు వెనుకబడివున్న దేశం అప్పుడు ఎంత మాత్రం బడుగుదేశం కాజాలదు. అప్పటి రాజకీయ వాతావరణం సుముఖంగా వుంటే ప్రయివేటు, ప్రభుత్వం పెట్టుబడులకు అది సుక్షేత్రమైన భూమికాగలదు.

అప్పుడు చతుర్థసూత్ర కార్యక్రమంలోనికి రెండవభాగం ఆచరణలోనికి వస్తుంది.

వేగంగా ఆర్థికాభి వృద్ధిపొందినకొలదీ నదీ లోయ ప్రాజెక్టుల నిర్మాణానికి పెట్టుబడులు రాగలవు. కాగా అన్ని చోట్ల టెన్నెసీవాలీ అథారిటీవలెనే ప్రయివేటు పెట్టుబడి వేగంగా ప్రవహించగలదు. ఇంతవరకు అభివృద్ధిగాంచిన దేశాలు అభివృద్ధి ప్రణాళికలను అమలు జరపడానికి అవసరమైన పెట్టుబడిని స్థానికంగానే సంపాదించవచ్చు. వెనుకబడిన దేశాలలో గుప్త ధనం మూలుగుతూవుంది. అట్టిదానిని పైకతీయాలి. ఇలా దేశంలో మూలుగుతూ, వ్యర్థంగా పెట్టుబడి పడివున్నంతకాలం విదేశపు పెట్టుబడితో ప్రారంభించబడిన ప్రణాళికలు సుస్థిరంగా అమలు జరగజాలవు.

ఇప్పుడు వివిధ రంగాలలో కృషిచేసే సంస్థల మధ్య సహకారం ఎంతగా అవసరమో అంతగానూ దేశీయ, విదేశీయమైన పెట్టుబడులమధ్య సహకారం అత్యావసరం. అట్టి సహకారం లభించిననాడే పరిశ్రమలు వృద్ధిపొందగలవు. పరస్పర సహకారమే దీనికి అత్యంత ప్రధానం.

# ప్రపంచ పారిశ్రామికాభివృద్ధికి తగినంత పెట్రోలున్నదా?

అయితే, మిగతా ప్రపంచ దేశాల పరిశ్రమలు త్వరగా అభివృద్ధికావడానికి సాయపడితే, ఖనిజ సంపదలు త్వరగా హరించిపోడానికి తోడ్పడుతున్నామన్నట్టేగదా? అంటే, మన పరిశ్రమల నిర్వహణకు ప్రాణప్రదమైన ఖనిజాలను నాశనం చేస్తున్నట్టేగదా?

ఇనుము, రాగి లోహాలకు సంబంధించినంతవరకు ఫర్వాలేదు. ఎందుకంటే భూమిలో తగినంతగా ఈ రెండు లోహాలూ వున్నాయి.

మన దేశంలో పరిశ్రమలకు బొగ్గు, పెట్రోలు, గ్యాసు కీలకమైనవి. అవి ఏనాటికైనా మనదేశంలో పూర్తిగా నిండుకొనక తప్పదు. త్వరలోనే అవి ఆఖరై పోతాయని కూడా చాలామంది తలపోస్తున్నారు. బొగ్గు, పెట్రోలు ఆఖరైపోగానే మన పరిశ్రమలకు స్వస్తి చెప్పుకో వలసిందే ననేవారుకూడా ఉన్నారు.

ఇది నిజమే అయితే, బొగ్గు, పెట్రోలు, గ్యాసు లభించే క్రొత్త ప్రాంతాలను అమెరికా సంపాదించవలసిన అవసరం ఎంతైనావుంది. పరిశ్రమలు ఎక్కువగా లేని దేశాలు వీటిని వాడకుండా నిరుత్సాహపరచాలన్నమాట.

కాని, ప్రపంచమంతటా పారిశ్రామికాభివృద్ధికై చతుర్థ సూత్ర కార్యక్రమం తలపెట్టబడింది. అందుకోసం దానిలో

దీర్ఘకాలిక విధానం పేర్కొనబడింది. అనేక అమెరికన్ వాణిజ్య, పారిశ్రామిక సంస్థలు ఆ విధానాన్ని ఆమోదించాయి కూడా.

అందువల్ల, ప్రపంచంలో పెట్రోలు, బొగ్గు సప్లయిలు ఏనాటికైనా హరించి పోగలవనేవారు వేసిన అంచనాలు తప్పు అయి వుండాలి లేదా, పారిశ్రామిక ప్రముఖులు ఆత్మహత్యా సదృశమైన విధానాన్నయినా అంగీకరించి వుండాలి. వీటిలో ఏది నిజం?

పెట్రోలు, బొగ్గు లభించదనే వారికి భయాందోళనలు కలిగిస్తున్న కారణాలు మూడున్నాయి. ఒకటి, ఈ నాటి పరిశ్రమలకు అవి ముఖ్యాధారాలై వుండడం; రెండు, వాటిని త్వరత్వరగా వాడుతూండడం; మూడు, అవి ఒకసారి ఆఖరై పోగానే వాటిని తిరిగి సంపాదించగల మార్గాలు లేకపోవడం.

ఈ ఖనిజాలవల్ల నూరుసంవత్సరాల క్రిందట అమెరికా ఎంత శక్తిని వినియోగించుకున్నదో ఈ నాడు అంతకు 160 రెట్లు వినియోగిస్తున్నది. ఈ శతాబ్దారంభంనుంచి అమెరికా వాడుతున్న ఈ శక్తి ఇంతా అంతా కాదు. అంతకు పూర్వం మిగతా ప్రపంచ దేశాలు వినియోగించిన శక్తి నంతటినీ ప్రోగుచేసినా ఇంతకాదు. గనులనుంచి పెట్రోలును ఎంత తోడివేశామో లెక్కలేదు.

నిజానికి పెట్రోలు మొదలైనవాటిని ఇంతగా ఎల్లప్పుడు సంపాదిస్తూ ఉండలేము. 1900 నుంచి తోడిన పెట్రోలు

35,00,00,00,000 పీపాలు ఉంది. ప్రస్తుతం సాలుకు 2,00,00,00,000 పీపాల చొప్పున పెట్రోలును తీస్తున్నాము. ఈ విధంగా అయితే ఇంక 20 సంవత్సరాలలో మన గనులు ఒట్టి పోగలవు.

మన పెట్రోలు మొదలైనవి 850 సంవత్సరాలలో ఆఖరై పోతాయని కొంద రంటున్నారు. ఇప్పటికంటె ఇంకా ఎక్కువగా వాడకంచేస్తే నూరు సంవత్సరాలలోకూడా అవి అయిపోగలవని మరికొంద రంటున్నారు.

పోతే, రెండవ పక్షంవారు సయితం ఈ వాదాలను అంగీకరిస్తూ, ఇతర దేశాల పెట్రోలును తెప్పించుకొని మనం వాడుకొన్నట్లయితే, మన సంపదలను నిలవ చేసుకోవచ్చు నంటారు. ఆ విధంగా అమెరికాకు ముప్పురాకుండా చెయ్యవచ్చు నంటారు.

అమెరికా భూమిలోపల ఇంకా ఇట్టి ఖనిజాలు ఏమి దాగివున్నవో ఎవరికీ తెలియదనీ, ప్రాణంమీదికి వచ్చిన సమయంలో అవి బయటపడవచ్చుననీకూడా వారంటారు. అణుశక్తిని వినియోగించుకుంటే ఈ ప్రమాదం తప్పిపోగల దంటారు.

అవన్నీ అమెరికాకు సంబంధించినంతవరకు మాత్రమే నిరాశ కలిగించగల లెక్కలు. ఇంతాచేసి, ప్రపంచ భూభాగంలో అమెరికా వైశాల్యం నూటికి అయిదువంతులు మాత్రమే. అందుచేత, అమెరికాలో ఇవన్నీ సమాప్త మైనప్పటికీ, ప్రపంచంలో కొల్లలుగా అవి లభించగలవు.

మిగతా దేశాలలోని బొగ్గు, పెట్రోలు రానున్న నూరు సంవత్సరాలలో విశేషంగా వాడకం కాగలవని అంచనా వెయ్యబడుతున్నది. వీటన్నింటిని బట్టిచూడగా, ఇవన్నీ నిజమే అయితే, చతుర్థసూత్ర కార్యక్రమం కేవలం పిచ్చిపనిగా కనిపిస్తుంది. ప్రపంచాన్నంతినీ పరిశ్రమల మయం చెయ్యడం అసాధ్యం మాత్రమే కాక, ఇప్పటి పరిశ్రమల స్థాయి తగ్గిపోగలదు కూడా. కొలదికాలంలో పరిశ్రమలు పెద్ద పెట్టున ఉత్పత్తులు చెయ్యబోవు కూడా. గ్రీక్, రోమన్ సామ్రాజ్యాలవలె, పారిశ్రామిక శకం పతనం కాగలదన్న మాట.

ఈ విధంగా జరుగుతుందా ? పెట్రోలు, బొగ్గు, గ్యాసు లేకపోతే పరిశ్రమలు జరగవా? ఇవేవీ నిజంకాదని బోలెడు నిదర్శనా లున్నాయి, మన కళ్ళముందరే అనేక పరిశోధనలు జరుగుతున్నాయి. నీటినుంచి, వాయువునుంచి, అడవులనుంచి, వాటికంటెకూడా సూర్యరశ్మినుంచి శక్తిని లాగి, పరిశ్రమలను నడిపించాలని శాస్త్రజ్ఞులు ప్రయత్నాలు చేస్తున్నారు.

ఈ ప్రయత్నాలు ఎంతవరకు సఫలమయాయో చూచి, ఆ తరువాత నిరాశావాదుల మాటలను యోచించుదాం.

యురేనియమ్, థోరియమ్‌లనుంచి అణుశక్తిని తీసి అయిదు సంవత్సరాలైనా కాలేదు. మరేవి లేకపోయినా ఈ శక్తిని శాశ్వతంగా వినియోగించి పరిశ్రమలను నడపగలమని కొందరు సంతోషపడ్డారు.

అయితే, పరిశ్రమలకు దానిని వినియోగించుకోడానికి ఇంకా చాలాకాలం పట్టగలదు. ఒక పౌను బొగ్గులో గల అణుశక్తితో "క్వీన్ ఎలిజబెత్" నౌకను కొన్ని వేల మైళ్ళు నడపవచ్చు నంటారు. అది పూర్తిగా నిజమే కావచ్చు. కాని, బొగ్గునుంచి అణుశక్తిని తీయగల అవకాశాలు కాన రావు. థోరియం, యురేనియంలనుంచి మాత్రమే ఇంతవరకు అణుశక్తిని తీయగలిగారు. ఈ ఖనిజాలు అమెరికాలో 50,000 టన్నులు లభించగలవని అంచనా వెయ్యబడింది. (ప్రపంచంలో 5,00,000 టన్నులు లభించగలవట). అయితే, పెట్రోలు అంతకు నూరువేల రెట్లు లభించగలదు. ఇప్పుడు సయితం, మన యురేనియం సంపదలో 30 వంతులకు పైగా వినియోగ మైపోతున్నది. అందుచేత, సొంత యురేనియం మీద నే మనం ఆధార పడ్డామంటే 30 సంవత్సరాలలో అది అయిపోతుంది.

అణుశక్తిని మామూలుకంటె ఎక్కువకాలం ఉపయో గించుకోగల యంత్రాన్ని కనిపెట్టవచ్చునని అణుశక్తి సంఘం వారు ప్రకటించారు. త్వరలోనే హైడ్రోజన్ నుంచి అణు శక్తిని తీయడం సంభవం కావచ్చు. కాని, పరిశ్రమలకు విని యోగించే రీతిగా దానిని కంట్రోలు చెయ్యడం సాధ్యమో, అసాధ్యమో స్పష్టం కాలేదు.

అణుశక్తి కాక, ఇతర మార్గాలుకూడా వున్నాయి.

వాటిలో అమెరికాకు చిర పరిచితమైనది జలశక్తి. నదులనుంచి లభించే జలశక్తి బడుగుదేశాల పరిశ్రమలకు

తొలి దశలో పూర్తిగా సరిపోగలదు. అయితే, పరిశ్రమలు వృద్ధి పొందిన పిమ్మట ఆ శక్తి బొత్తిగా సరిపోదు.

సముద్రజలంనుంచికూడా ఎలక్ట్రిసిటీ తీయగల పద్ధతులను కనిపెట్టవచ్చునని శాస్త్రజ్ఞులంటున్నారు. అటువంటి ఒక యంత్రాన్ని నిర్మించాలని ఇప్పుడు ఫ్రెంచివారు ప్రయత్నిస్తున్నారు. అది ఫలప్రదమైతే, అన్ని దేశాలవారు క్రమంగా ఆ విధంగా చెయ్యవచ్చు. అలాగ జరిగినప్పటికీ, పెట్రోలు బొగ్గు కొరతలను తీర్చజాలము.

ఇదే విధంగా, ఇతరములైన పద్ధతులను అనుసరించినప్పటికీ, పరిశ్రమలను సాగించగల శక్తిని సంపాదించజాలము.

పోతే, అనాదికాలంనుంచి ఉపయోగించబడుతున్న కలపను వాడవచ్చు. ఈ నాడు పరిశ్రమలకు వినియోగించబడుతున్న శక్తిలో నూటికి 12 వ వంతు కలపవల్లనే లభిస్తున్నది. అమెరికా అంత మేరలో సదా అడవులను పెంచుతూ వుంటే ప్రపంచానికి కొరత లేకుండా ఉంటుంది. కాని, అది అధిక వ్యయ ప్రయాసలతో కూడిన విషయం. మరే గత్యంతరం లేకపోతే ఈ విధంగా చెయ్యాలి.

సూర్యరశ్మినుంచి శక్తిని తీయడానికై అనేకవందల లేబొరేటరీలు మాత్రమేకాక, అమెరికా, రష్యాలు ఇతర దేశాలుకూడా పరిశోధనలు జరుపుతున్నాయి. ఈ పరిశోధనలు అప్పుడే కొంతవరకు ఫలించాయి కూడా. అందుచేత, భావిలో ప్రపంచ మానవులకు అది అందుబాటు కాగలదు.

ఈ కారణాలను, అవకాశాలను పరిశీలించినట్లయితే, ఈ అధ్యాయంలో తెల్పబడిన వివిధ మార్గాలద్వారా శక్తిని తీయవచ్చును. అందువల్ల, మన పెట్రోలు, బొగ్గు, గ్యాసు నిల్వలు పూర్తిగా ఆఖరు కాబోవు. ఈలోగానే క్రొత్త పద్ధతులు అనుసరించబడవచ్చును. అప్పుడు అవన్నీ నిలవలో ఉండగలవు.

అందుచేత, చతుర్థసూత్ర కార్యక్రమంద్వారా ప్రపంచ పరిశ్రమలను వివేకవంత మార్గాలలో అభివృద్ధి పరచినట్లయితే, ప్రజాకోటి ఇంతకంటె ఎక్కువ ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లగలదు. ప్రపంచ దేశాల పరిశ్రమలు వృద్ధి అయితే పెట్రోలు, బొగ్గు సప్లయిలు సమసిపోగలవనీ, అమెరికా పరిశ్రమలకే ముప్పువాటిల్లగలదనీ భయపడ నవసరంలేదు.

## యంత్రాలు; డబ్బు

ప్రపంచం పారిశ్రామికంగా అభివృద్ధి పొందడంతో జీవన వ్యయ ప్రమాణం ఎంతవరకు పెరగగలదో, ప్రపంచభాగ్యం ఎంతవరకు వృద్ధిగాంచగలదో పరిశీలిద్దాం.

ప్రపంచ జనాభా మొత్తంలో నూటికి మూడవవంతు మాత్రమే నేడు అమెరికాలోవుంది. అయితే, ప్రపంచం మొత్తంలో వినియోగించ బడుతున్న యంత్రశక్తిలో సగం అమెరికాలో నేడు ఉపయోగించబడుతున్నది. సుఖజీవనానికి ప్రపంచంమొత్తంలో గల వనరులలో సగందాకా అమెరికాలో

గల 15 కోట్లమందికి, మిగతా సగం మిగతా 200 కోట్ల మందికి వినియోగపడుతున్నవి. అమెరికన్ల జీవన వ్యయ ప్రమాణం ప్రపంచంలోని అన్ని దేశాల జీవన వ్యయ ప్రమాణం కంటె ఎక్కువైనదే కాక, మిగతా మానవజాతి మొత్తం జీవన వ్యయ ప్రమాణంకంటె 8 రెట్లు ఎక్కువైనది.

100 సంవత్సరాలక్రితం వారు ఉపయోగించినదానికంటె అనేక రెట్లు ఎక్కువగా నేడు అమెరికన్లు యంత్రాలను ఉపయోగిస్తున్నారు. ఇక రెండు తరాలకు రాగలవారు వెయ్యిరకాల యంత్రాల నుపయోగిస్తూ, శని, ఆదివారాలు మాత్రమేగాక గురు, శుక్రవారాలు కూడా సెలవులు అనుభవించగల స్థితికి రావచ్చు.

ఇక వంద సంవత్సరాలకు అమెరికన్ల జీవన వ్యయ ప్రమాణం ఇప్పటికంటె 16 రెట్లు పెరగగలదని ఒక ఆర్థిక శాస్త్రవేత్త అన్నాడని జనరల్ మోటార్స్ కంపెనీ యజమాని ఛార్లెస్ ఇ. విల్సన్ అన్నాడు. ఇందులో ఆశ్చర్య పడవలసిన దేమీ లేదు. వచ్చే 30 సంవత్సరాలలోను ఇప్పుడు అనుభవిస్తున్నదానికంటె నూటికి 50 వంతులు ఇబ్బడిగాను, బహుశా వుంటే 75 నుంచి 100 వంతులు ఇబ్బడిగాను అనుభవించవచ్చునని హార్వర్డ్ విశ్వ విద్యాలయానికి చెందిన ఆర్థికశాస్త్రవేత్త సమ్మర్ స్లిచర్ అన్నారు. 1750 లో అమెరికన్లు ఎలాంటి స్థితిలో వుండేవారో ఆ స్థితిలోనే నేడు ప్రపంచం మొత్తంలో సగం జనాభావుంది. ప్రపంచం జనాభా మొత్తంలో నేడు సగటున అనుభవించేది 1880 లో

అమెరికన్‌లు అనుభవించినట్టిది. లోగడ అమెరికా ఎంత వేగంగా పరిశ్రమలను పెంపొందించుకొన్నదో అంత వేగంగా ఇతర ప్రపంచం పరిశ్రమలను పెంపొందించుకుంటే వారి స్థితి ఇప్పటికంటె మహా అయితే అయిదురెట్లు మాత్రమే పెరగ వచ్చు. అమెరికా స్థితి నూటికి 50 వంతులదాకా పెరగవచ్చు. చతుర్థసూత్ర కార్యక్రమం ఎంత దిగ్విజయంగా అమలు జరిగినా ఇప్పటికి 50 సంవత్సరాల తరువాతనో లేదా 100 సంవత్సరాల తరువాతనో కూడా ఇతియోపియన్ పౌరుని జీవిత వ్యయప్రమాణం, అమెరికన్ జీవన వ్యయప్రమాణంతో సమానంకాదు—కాజాలదు. అయితే, అతడు అభ్యుదయం పొందడం, అతని జీవన వ్యయప్రమాణం పెరగడం మాత్రం తథ్యం.

ఒక దేశం ఆదాయాన్ని లెక్కకట్టేటప్పుడు ఆహార పదార్థాలను ఎంత మంది పండిస్తారో తెలుసుకొని, వారిని తీసివేసి, ఆదాయాన్ని మిగతావారు సంపాదించినట్లు పరిగ ణించడం ఆర్థిక శాస్త్రవేత్తల ఆచారం. అంటే, వ్యవ సాయంలో ఎంత ఎక్కువమంది వుంటే ఆ దేశం ఆదాయం అంత తక్కువగా పరిగణించబడగల దన్నమాట. 1920 లో చైనా జనాభాలోని నాలుగింట మూడవ వంతు వ్యవసాయ వృత్తిలో వుండేది. కాగా, అప్పుడు చైనాప్రజల సగటు ఆదాయం 20 డాలర్లే. ఇండియాలో 100కి 62 మంది వ్యవ సాయ వృత్తిలో వుండేవారు. అక్కడ సగటు ఆదాయం 90 డాలర్లు. ఇటలీలో నూటికి 43 మంది సేద్యం చేస్తే సగటు

ఆదాయం 154 డాలర్లు. నార్వేలో నూటికి 35 మంది సేద్యం చేస్తే అక్కడ సగటు ఆదాయం 237 డాలర్లు.

అయిదుగురు కార్మికులు వుంటే అందులో నలుగురు ఆహారోత్పత్తికి కృషి చేయవలసి వస్తే, మిగతా వస్తువుల ఉత్పత్తికి ఒక్కడే మిగులుతాడు. కాని, ఒక్క కార్మికుడే మిగతా నలుగురికీ, తనకూ కూడా ఆహారం పండించగలిగిన నాడు, మిగతా నలుగురూ ఇతర వృత్తులకు దిగి చెప్పుల దగ్గరినుంచి నౌకల వరకు తయారు చేయగలుగుతారు. యునైటెడ్ స్టేట్స్‌లో కూడా ఒక రాష్ట్రంలో సగటు ఆదాయానికి, మరొకరాష్ట్రం సగటు ఆదాయానికి తేడా వుంటున్నది. వ్యవసాయం ప్రధానవృత్తిగాగల రాష్ట్రానికి ప్రక్కనే పారిశ్రామికంగా అభివృద్ధి పొందే ప్రాంతంవుంటే వ్యవసాయం ప్రధానంగా గల రాష్ట్రం ఆదాయంకూడా పెరుగుతుంది.

దేశం పారిశ్రామికంగా పొందిన అభివృద్ధిని లెక్కకట్ట డానికి ఆ దేశం ఉపయోగించే విద్యుచ్ఛక్తే ప్రాతిపదిక. 1937 లో సగటున అమెరికాలో ప్రతి ఒకరు 7,000 కిలో వాట్స్ అవర్స్ విద్యుచ్ఛక్తిని ఉపయోగించారు. అప్పుడు అమెరికన్ సగటు ఆదాయం 508 డాలర్లు. అదే సంవత్సరం ఫ్రెంచివారు 2,800 కిలోవాట్స్ అవర్స్ విద్యుచ్ఛక్తి ఉపయోగించగా వారి సగటు ఆదాయం 114 డాలర్లు. చైనీస్ విద్యుచ్ఛక్తి లేకుండా మానవబలంతోనే శ్రమించి సాలీనా 50 డాలర్ల ఆదాయం సంపాదించ గలిగారు.

ఇండియా, చైనా, పాలస్తీనా మున్నగు దేశాలు తలపెట్టిన అభివృద్ధి ప్రణాళికలవల్ల అవి ఎంతవరకు అభివృద్ధి గాంచగలిగేదీ ఇప్పుడు చెప్పడం కష్టం. విద్యుచ్ఛక్తి వినియోగానికి, ఆదాయానికి వుండగల నిష్పత్తిని ప్రాతిపదికగా తీసుకొని లెక్కలుకట్టడానికి మరికొన్ని ప్రతిబంధకాలు వున్నాయి. ప్రభుత్వం అనుసరించే విధానాలు, జనాభా పెరుగుదల, ఆదాయం పంపిణీ, పరిసర రాజ్యాల అభివృద్ధి విషయాలు కూడా ఈ లెక్కలను తల్లకిందులు చేసివేయగలవు. కాని, మొత్తం 10 కిలోవాట్స్ అవర్స్ విద్యుచ్ఛక్తి వినియోగించబడితే డాలర్ ఆదాయం వచ్చినట్టు లెక్క వేయవచ్చు. పారిశ్రామికంగా అభివృద్ధిపొందిన అమెరికావంటి దేశం ఆదాయం నిష్పత్తి ఇంకా పెరుగుతుంది. చైనా, ఇండియాలవలె పారిశ్రామికంగా వెనుకబడివున్న దేశాలలో ఆదాయం నిష్పత్తి తగ్గుతుంది.

మొత్తంమీద ఆదాయ ప్రమాణాన్ని పెంచడంద్వారా బడుగుదేశాలను అభివృద్ధిపరచి, పారిశ్రామికాభ్యున్నతికి తగుస్థితిని నూతన మహత్తర ప్రణాళిక చేకూరుస్తుంది.

రష్యా, యూరప్‌లోనిదాని ఉపగ్రహ రాజ్యాల సమేతంగా పదిదేశాలు సగంవరకు అభివృద్ధిపొందిన దేశాలుగా పరిగణించ బడినవి. వీటి జనాభా 48,88,22,000. సగటు ఆదాయం సాలీనా 154 డాలర్లు. పారిశ్రామికంగా వృద్ధిపొంది, ఆర్థికాభ్యుదయాన్ని సాధించిన దేశాలు 15 రాజ్యాలుగా

పరిగణించ బడినవి. వీటి జనాభా 38,42,38,000. సగటు ఆదాయం 389 డాలర్లు.

వెనుకబడివున్న దేశాలలోకూడా పరిశ్రమల అభివృద్ధికి కృషిచేస్తే వాటి ఆదాయంకూడా పెరుగుతుంది. అప్పుడు మొత్తం 1,75,00,00,00,000 డాలర్ల దాకా వాటికి ఆదాయం రాగలదు. ఇంకా ధాన్యం పండగలదు. అవే అభివృద్ధి ప్రణాళిక లను, ముఖ్యంగా హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులను ప్రారంభించ గలవు. దానితో అమెరికన్ పెట్టుబడిదారులు కూడా ముందుకువచ్చి సాయపడగలరు.

డాముల నిర్మాణం పూర్తికాగానే వెనుకబడ్డ దేశాలకు యంత్రాల అవసరం వస్తుంది. దాదాపు ఒకతరందాకా ప్రపంచ మొత్తానికి కావలసిన యంత్రాలను, యంత్ర పరిక రాలను అమెరికా ఉత్పత్తి చేయవలసి రావచ్చు. కాగా, కొత్తగా పరిశ్రమలను ప్రారంభించిన దేశాలలో నిత్యజీవితా వసర వస్తువులు ఉత్పత్తి కాగలవు. దీనిఫలితంగా అమెరికన్ భారీ యంత్రసామగ్రికి గిరాకీ తగులుతుంది.

ఇప్పుడు వెనుకబడ్డ దేశాలు విదేశాలలో వస్తువులను విశేషంగా ఖరీదుచేయగల సుదినం వచ్చిననాడే నూతన మహత్తర ప్రణాళిక పూర్తిగా జయప్రదమైనట్లు. అప్పుడేమి జరగగలదో ఊహించడానికి ఒక్క సంగతి తెలుసుకోవడం అవసరం. నేడు పారిశ్రామికంగా అభివృద్ధిపొందిన కెనడా జనాభా 1,20,00,000. ఇప్పుడు వ్యవసాయం ప్రధానంగావున్న

దేశాలు చైనా, ఇండియాల మొత్తం జనాభా 80,00,00,000, చైనా, ఇండియాలు రెండూకలసి విదేశాలనుంచి దిగుమతి చేసిన సరుకుకుమించి నేడు కెనడా దిగుమతి చేస్తున్నది.

చైనా జనాభాలో పదవవంతుకూడా లేని బ్రిటన్ చైనాకంటె 17 రెట్లు ఎక్కువగా వస్తువులను విదేశాలలో ఎక్కువగా ఖరీదుచేస్తున్నది. చైనా జనాభాలో 33 వ వంతు జనాభాకూడా లేని ఆర్జెంటీనా విదేశాలలో చైనా ఖరీదుచేసిన దానికంటె నాలుగురెట్లు ఎక్కువ ఖరీదుచేస్తున్నది.

యంత్రాలు లేనందున చైనా, ఇండియాలు రెండూకలిసి ప్రస్తుతం ప్రపంచం మొత్తం జరిగే వ్యాపారంలో నూటికి అయిదు పాళ్ళు మాత్రమే చేస్తున్నది.

దీనినిబట్టి, పారిశ్రామికంగా వెనుకబడిన దేశాలు వృద్ధి గాంచినపుడు వర్తక, వాణిజ్యాలు ఎంతగా వృద్ధిగాంచగలవో ఊహించవచ్చు.

## మహత్తర నిర్ణయం

ప్రపంచంలోని అన్నిదేశాలకంటె భాగ్యవంతమై, శక్తి సంపన్నమై వున్నందున పేదలదాల్చవలసి రాగల బాధ్యత అమిత భారమైనదని అమెరికా ఉపవిదేశాంగమంత్రి విల్లార్డ్ థ్రాప్ అన్నాడు.

ఈ బాధ్యతను స్వీకరించవలసి వచ్చినందుకు అమెరికన్లు ఎంతమాత్రం కించపడడంలేదు. ఏమిచేస్తున్నామో, ఎందుకు

చేస్తున్నామో తెలుసుకోకుండానే, మనం అంతర్జాతీయ రంగంలో కొంతవరకు స్వార్థాన్ని ప్రధానంగా భావిస్తున్నాము. ఇది విజ్ఞాతా పూర్వకంగా అమలు జరపబడిననాడు ఇతర ప్రపంచానికే గాక, అమెరికాకు కూడా శుభప్రదం కాగలదు.

మనం ఏమి భావిస్తున్నప్పటికీ, మనకు తెలియకుండానే మనం మహత్తర నిర్ణయానికి వచ్చాము. శాంతియుత ప్రపంచంలోనే మనం ప్రశాంతంగా జీవించగలమని, శక్తి సంపన్నమైన ప్రపంచంలోనే మనం శక్తిసంపన్నులమై జీవింపగలమని, ప్రపంచం అభ్యుదయం పొందినపుడే మనం అభివృద్ధి గాంచగలమని నిర్థారణకు రావడమే అది.

ఈ మహత్తర నిర్ణయానికి వచ్చినపిమ్మట దీనివెన్నంటి రాగల అనేక నిర్ణయాలను మనం ఎదుర్కొనవలసి వుంటుంది.

భూసారం, జనాభా సమస్యలలో విజ్ఞాని అయిన విలియం వొగాట్ చతుర్థసూత్ర కార్యక్రమం ప్రారంభదశలో ఎదుర్కొనవలసి రాగల నిర్ణయాలను వివరించారు.

విజ్ఞానశాస్త్ర సహాయంతో మహాద్భుతాలను సాధించడానికి లక్షలాదిప్రజలు కృతనిశ్చయమై నిలచినపుడు అది ఆత్మహత్యా సదృశ్యం కాగలదేమో. అనగా ప్రకృతి ప్రపంచం మొత్తంలో ఒకచోట తరుగును, వేరొకచోట మిగులును, ఒకచోట పల్లాన్ని, మరొకచోట మిట్టను సృష్టించడం ద్వారా సాధించిన "సమ ఉజ్జీ"ని విజ్ఞానశాస్త్రసహాయంతో మానవుడు తుడిచిపెట్టడం ప్రమాదం కాగలదేమో నన్న సందేశాన్ని ఆయన వెల్లడించాడు.

ఇంకా ఆయనచేసిన సూచన లివి :—

కొన్ని సంవత్సరాల వరకేగాక కొన్ని దశాబ్దాలవరకు చతుర్థసూత్ర కార్యక్రమాన్ని అమలుజరపవలసి రావచ్చు.

అమెరికాలోను, ఇతర దేశాలలోను శాస్త్రవేత్తలు, సాంకేతిక నిపుణులు ఇప్పుడున్న వారికంటే ఎన్నోరెట్లు ఎక్కువ మంది కావలసి రాగలరు.

సామ్రాజ్యవాదులు ఈ కార్యక్రమాన్ని అండగా చేసుకొని ప్రాబల్యం పొందడానికి యత్నించవచ్చు గనుక వారిని కనిపెట్టి వుండడం అవసరం కాగలదు.

ప్రభుత్వం కరపత్రాలను ప్రచురించే విధానానికి స్వస్తి చెప్పాలి.

నిజంగా చతుర్థసూత్ర కార్యక్రమం ద్వారా సహాయం పొందవలసివున్న దేశాలకుమాత్రమే అది లభించేటట్టు చూడాలి.

ముందే గబగబా ప్రపంచంమొత్తంలో ఈ కార్యక్రమాన్ని ప్రారంభించకుండా లాటిన్ అమెరికా, మధ్యప్రాచ్యం మున్నగు నిర్ణీత ప్రాంతాలలో ముందు అమలు జరపాలి.

జనాభా పెరుగుదలను కంట్రోల్ చేయవలసివుంటుంది. భూమిని సద్వినియోగం చేసుకోవడంలో శిక్షణ నివ్వాలి.

మిస్టర్ వాగాట్ చేసిన కొన్ని సూచనలు సుహృద్భావాన్ని పొందడానికి ముందుజాగ్రత్తగా గైకొనదగు

చర్యలే. జనాభా పెగుదల కంట్రోల్ వంటి సమస్యలు చర్చ నీయాంశాలు. జనాభా పెరుగుదలను కంట్రోల్ చేయడానికి నైతికంగా విజ్ఞుల ఆమోదాన్ని పొందగలసాధనం మున్ముందు ఏదైనా లభించవచ్చు. టైఫాయిడ్ జ్వరం రాకుండా నిరోధించడానికై ఇనాక్యులేషన్ ఇచ్చినట్టే గర్భధారణ నిరోధానికికూడా ఏదైనా ఇనాక్యులేషన్స్ సాధించ బడవచ్చు. అట్టి సాధనం లభించేవరకు విద్యాప్రచారం, జీవనవ్యయప్రమాణాభివృద్ధి, నైతిక బాధ్యతల ప్రచారం మున్నగువాటిద్వారా స్వేచ్ఛగా జన్మనిరోధాన్ని ప్రజలు అమలుజరిపేటట్టు చూడాలి. పరిశ్రమలు వృద్ధిపొందడంతో జనాభా మరింత పెరగవచ్చు. జనాభా పెరుగుదల సమస్యా పరిష్కారానికి వలసలు ఒక మార్గమే అయినా, జన్మ నిరోధానికి సూచించబడుతున్న ఇతర మార్గాలు మానవుల మధ్య సంబంధాన్నిగురించి ప్రకృతిశాసించిన దానిని ధిక్క రించాలనడమే కాగలదు. ఈ కృషిలో సర్వనాశనానికి సైతం మనం పురికొల్పబడవచ్చు. అయితే, మానవాళి మొత్తానికి సుఖప్రదంకాగల మహత్తరమార్గాలను పరిశోధించి, భూతలాన్ని స్వర్గధామంగా వారు మార్చనూవచ్చు.

ఇక పోతే నూతన మహత్తర ప్రణాళికను ప్రయివేట్ పెట్టుబడులద్వారా అమలుజరపవలెనా, లేక పబ్లిక్ పెట్టుబడుల ద్వారా అమలుజరపవలెనా అనే ప్రధానసమస్య వుంది. ప్రభుత్వం తలపెట్టిన ఈ నూతన మహత్తర ప్రణాళికతో వాణిజ్యవేత్తలు సహకరించిననాడే ఇది జయప్రదం కాగలదు.

నైతిక బాధ్యతల నిర్వహణకై తలపెట్టిన ఈ కార్యక్రమంలో వాణిజ్యవేత్తలుకూడా భాగస్వాములని విజ్ఞానవేత్తలు గ్రహించాలి.

వాణిజ్యవేత్తల సహకారం లభ్యంకాగలదన్న ఆశయం తోనే ఇప్పటి స్వరూపంలో చతుర్థసూత్ర కార్యక్రమం రూపొందించబడింది. అమెరికన్ ప్రజల జీవన వ్యయ ప్రమాణాభివృద్ధికి ఏ మార్గాలు దోహదమిచ్చినవో, ఆ మార్గాలే బడుగుదేశాల ప్రజల అభివృద్ధికి సాధనాలుకాగల వన్న నిశ్చయంతోనే అది రూపొందించబడింది.

ప్రయివేటు సంస్థలు చారిత్రాత్మకమైన ఈ కార్య క్రమాన్ని నిర్వహించడంలో పూర్తి విజయాన్ని పొందజాలకి పోవచ్చు. కాని, ప్రయివేటు సంస్థల సహకారం, ప్రోత్సాహం లేకుండా ఈ కార్యక్రమ నిర్వహణకు ప్రభుత్వమే పూనితే అది అపజయం పొందడం తథ్యం. ఇందుకు చరిత్రే దృష్టాంతం.

యూరప్‌లో చాలా కొద్ది దేశాలు తప్ప, మిగతా అన్నింటికి ప్రయివేటు పరిశ్రమలపైన, ప్రయివేటు పెట్టుబడుల పైన అనుమానమే. అందుచేతనే కరెన్సీ గారడీలతోను, పరి శ్రమలపైన, కార్మికులపైన కంట్రోల్‌ను గుప్పిట్లో వుంచు కొనడంద్వారాను ప్రభుత్వానికి గల అధికారం, అజమాయి షీలు తొలగకుండా సర్వదా వాణిజ్యం, పరిశ్రమలు తమ చేతిలోనే వుండేట్టు ఆ దేశప్రభుత్వాలు వ్యవహరిస్తున్నవి.

బూర్జువాలే తమకుగల సాధన సంపత్తితో ఉత్పత్తి సాధన శక్తులను హస్తగతం చేసుకొనడంద్వారా సోషలిస్ట్ కార్యక్రమాన్ని నిరోధించగలరని మార్క్స్, ఎంజిల్స్ అనుమానాలను వెల్లడించినా యూరొపులో కేపిటలిజమ్ వృద్ధిపొందకపోగా రక్షణకై అది ప్రభుత్వ సహాయాన్ని అర్థించవలసిన స్థితి ఏర్పడింది. సోషలిజమ్, ఆర్థికాభివృద్ధికి దోహదమివ్వదగు జాతీయ తత్వం ఒకదాని సరసనే మరొకటి వృద్ధి పొందినవి. యుద్ధమే ఈ రెండింటి ఉద్ధృతాన్ని శీఘ్రతరం చేసింది. 20 వ శతాబ్దం వచ్చేసరికి ఆర్థికంగా, రాజకీయంగా సాంఘికంగా యూరొప్ ఒక దానితో మరొకదానికి ఎంత మాత్రం సంబంధం లేని విడివిడి భాగాలుగా రూపొందింది ప్రజల జీవన వ్యయప్రమాణం పెరుగుదల మందగించింది.

పోటీకి అవకాశంగల కేపిటలిస్టు అమెరికాలో 20 వ శతాబ్దం వచ్చేసరికి 19 వ శతాబ్దంలో కంటె కూలిరేటు పదికొండు రెట్లు పెరిగింది. పెట్టుబడులుకూడా విశేషంగా పెరిగినవి. 1945 లో అమెరికాలో 70,00,00,00,000 డాలర్ల దాకా పెట్టుబడి వుంది. నేడు అమెరికాలో ఉత్పత్తి రేటు ప్రపంచం మొత్తంమీద ఏ దేశంలోను పెరగనంత వేగంగా పెరుగుతున్నది. అమెరికా ఆర్థిక వ్యవస్థాస్వరూపాన్నిబట్టి ఈ పెరుగుదల ఇంకా సాగుతూనే వుంటుంది. అందుచేతనే వాణిజ్య వేత్తలకు చతుర్థసూత్ర కార్యక్రమం, చతుర్థసూత్ర కార్యక్రమం నిర్వహణకు వాణిజ్య వేత్తలు అత్యవసరం.

ప్రభుత్వం ఎంత సౌజన్యంతో వ్యవహరించినప్పటికీ, ఇతర దేశాల పౌరులకు భారీగా ఉత్పత్తులు, పంపిణీలు జరగడంవల్ల చేకూరగల లాభాలను వివరించజాలదు. దీనికి పోటియే సముచిత సాధనం.

అమెరికా ఉత్పత్తిశక్తి పెంపొందడానికి ముఖ్యకారణం స్వేచ్ఛా వాణిజ్యావకాశమే. ఏ రంగంలోబడితే ఆరంగంలోనే స్వేచ్ఛాకృషికి అవకాశం వున్నందునే ఇంతవేగంగా అది వృద్ధిపొంద గలిగింది.

ఎవరికైనా ఈ విషయంలో సందేహంవుంటే గత 100 సంవత్సరాలలోను అమెరికా, రష్యాల అభివృద్ధిని పరిశీలిస్తే తేలుతుంది. అమెరికావలెనే రష్యాకుకూడా సహజ సంపత్తి అశేషం. ఇతర సాధనాలన్నీ రెండింటికీ సమానమే. అమెరికాలో వున్నదీ రష్యాలో లేనిదీ ఒక్క వ్యష్టి స్వాతంత్ర్యమే.

ఈ స్వాతంత్ర్యాన్ని ప్రయివేటు వాణిజ్య సంస్థలు నిలుపుకొని, సద్వినియోగం చేసుకుంటే, అది చతుర్థసూత్ర కార్యక్రమానికి వెన్నెముక కాగలదు. అలాకాక స్వాతంత్ర్యాన్ని పరిమితం చేసుకుంటే దాని భవిష్యత్తు అంధకారమే.

స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేసుకొనకుండాను, స్వాతంత్ర్య ప్రధాన లక్షణాలు కొరవడకుండా కొన్ని మార్పులకు ఆమోదించడంద్వారాను సోషలిజమ్‌కంటె ప్రయివేటు

పెట్టుబడుల విధానమే ఉత్తమోత్తమమైనదని ప్రపంచానికి అది నిరూపించుకో వచ్చునని మార్క్వాస్ డబ్ల్యు. ఛైల్డ్స్ అన్నాడు.

రోజుకు 8 గంటలు మాత్రమే పనిచేయాలని శాసించడం, పసిపిల్లలచేత కూలిచేయించరాదని శాసించడం మున్నగు సోషలిస్టు సంస్కరణలకు ఆదిలో అమెరికన్ పారిశ్రామిక వేత్తలు నిరసించినా, తుదకు వారే వాటి నామోదించారు. ఆ సంస్కరణలు వారికి లాభప్రదంగా వున్నాయి కూడా. నేడు అమెరికాలో ప్రభుత్వానికివచ్చే ఆదాయంపన్నుద్వారా ఎంత ఆదాయంవస్తున్నదో అంత ఆదాయమే రష్యాలో అన్ని విధాలా వస్తున్నది. అయినప్పటికీ అమెరికా కేపిటలిస్టు దేశంగానే నిలచి వున్నది.

ప్రయివేటు పెట్టుబడులను ఆకర్షించడానికి అనువైన పరిస్థితులను ప్రభుత్వం కలిగించవచ్చు. రహదారులను, ప్రజారోగ్యాన్ని, రేవులను, రోడ్లను ప్రభుత్వం అభివృద్ధిచేస్తే అప్పుడు నదీలోయ ప్రాజెక్టులను, పరిశ్రమలను ప్రయివేటు పెట్టుబడులు ప్రారంభించ గలవు. ఇలా పరస్పర సహకారంతో ప్రభుత్వం, ప్రయివేటు వాణిజ్య సంస్థలు కలసి కృషిచేయాలి. ఇది సాధ్యమా అనే సమస్య లేకపోలేదు. తమ రక్షణకు అనువైన హామీలను ప్రయివేటు పెట్టుబడులు పొందగలిగి నపుడు ఇది సాధ్యమే.

ఆర్థిక వ్యవస్థపై ప్రభుత్వం పూర్తి అజమాయిషీని కైవసం చేసుకోడానికి చతుర్థసూత్ర కార్యక్రమం ఒక సాధన అనే విమర్శకులు కూడా వున్నారు. కాని, నిజం దానికి పూర్తిగా భిన్నం. ప్రయివేటు పెట్టుబడులద్వారా పొందగల లాభాన్ని ప్రపంచానికి నిరూపించడానికి గత 20 సంవత్సరాలుగా లభ్యంకాని అవకాశాన్ని చతుర్థసూత్ర కార్యక్రమం ఇప్పుడు చేకూర్చింది. కాని, నేను అమెరికాలో వున్నట్టే ప్రపంచం అంతటిలో ప్రభుత్వానికి అజమాయిషీ వుండడం మంచిదనే అభిప్రాయమే ప్రబలంగా వుంది. పూర్తిగా ప్రభుత్వ విధానంతోనే పబ్లిక్ కార్పొరేషన్‌లు స్థాపించి, ప్రయివేటు పెట్టుబడులను వెనక్కు త్రోసివేయడం ప్రభుత్వానికి చాలా తేలిక. ఇలా జరగాలన్న ఆందోళనకూడా వుంటుంది. అయితే, చతుర్థసూత్ర కార్యక్రమ నిర్వహణలో ప్రయివేటు పెట్టుబడులకు ఇవ్వబడిన ప్రముఖ పాత్రయే దాని నిరోధానికి మార్గం.

తగు సమయం రాగానే వెనుకబడి వున్న దేశాలకు ప్రయివేటు పెట్టుబడులను దూకించి వాటి అభివృద్ధికి ప్రయివేటు వర్తకులు విశేషంగా శ్రమించిననాడు ప్రయివేటు పెట్టుబడులపైన, అమెరికాపైన ప్రపంచంలో అచంచల విశ్వాసాన్ని సాధించవచ్చు. అలాకాక, తగుసమయం వచ్చేసరికి ప్రయివేటు పెట్టుబడులు వెనుకాడితే, స్వయంగా అపచారానికి వారు పడికట్టినట్టే కాగలదు. అమెరికా స్వీయ శ్రేయస్సును కాంక్షించి ప్రపంచంలో సుస్థిరత్వాన్ని సాధించడం

అత్యవసరం. 1945 నుంచి 1948 లోపున 2,00,00,00,000 డాలర్ల దాకా విదేశాలలో అమెరికన్ పెట్టుబడులద్వారా వెచ్చించింది. దీనిలో నూటికి 75 వంతులు అమెరికన్ కంపెనీలు పెట్టినవే. ఇందులో అధిక భాగం కెనడా, బ్రాజిల్, వెనిజులా, పెనామా, మధ్యప్రాచ్య రాజ్యాలలో వెచ్చించబడింది. మూడింట రెండువంతుల పెట్రోల్ పరిశ్రమకు వెచ్చించబడింది. పారిశ్రామిక వేత్తలు ఈ పెట్టుబడిని వెచ్చిస్తూ వుండగానే అమెరికా ప్రభుత్వం 12,00,00,00,000 డాలర్లను అప్పుగాను, 10,00,00,00,000 డాలర్లను విరాళంగాను విదేశాలకు ఇచ్చింది.

ప్రయివేటు పెట్టుబడి ఉత్సాహంతో ముందుకు రాకపోతే విదేశాలకు అవసరమైన పెట్టుబడిని ప్రభుత్వమే పెట్టుతుంది. అప్పుడు సమస్తం ప్రభుత్వపరం కావాలన్న ఆందోళన వృద్ధిగాంచి, దానికే ప్రాబల్యం చేకూరడం తథ్యం. అమెరికాలోనే ప్రయివేటు పెట్టుబడి దుర్గతికి పాల్పడితే బడుగు దేశాలు దానిని అణచి వేయగలవు.

ప్రభుత్వాన్ని ప్రయివేటు పెట్టుబడిదారులు అనుమానించడం చతుర్థసూత్ర కార్యక్రమానికి ఎంత నష్టదాయకమో, వాణిజ్య వేత్తలను ప్రభుత్వం అనుమానించడం కూడా అంతగానూ నష్టదాయకమే.

ప్రభుత్వమే సమస్తాన్ని కైవసం చేసుకోవాలన్న ఆందోళన ఇటీవల పెరగడానికి లిబరల్స్ ప్రచారమే ముఖ్యంగా దోహద

మిచ్చింది. ప్రభుత్వం సర్వదా ప్రజలకు రక్షణగా వుండగలదని వారి అభిప్రాయం. కాని, దూరదృష్టితో పరికిస్తే వారివాదం ప్రమాదకరమే కాగలదు. సాంఘిక, ఆర్థిక వ్యవస్థల దుష్ట చర్యల నిరోధానికి ప్రజా-స్వామ్య ప్రభుత్వం సాధనమే గాని, ప్రభుత్వం విశేషంగా పెరిగిపోయిననాడు, దానిశక్తి మరింత వృద్ధిగాంచిననాడు అది వ్యష్టికి శత్రువే కాగలదు.

చతుర్థసూత్ర కార్యక్రమ నిర్వహణలో ప్రయివేటు వర్తకులకుకూడా అవకాశం వున్నందున దానిలక్ష్యం అప్పుడే తప్పిందని, అప్పుడే అది అవినీతికి ఆకరమైందని కొందరు లిబరల్స్ అనుమానిస్తున్నారు. ఈ అవినీతినుంచి దానిని తప్పించడానికి పూర్తిగా ప్రభుత్వం అజమాయిషీకిందనే ఈ కార్యక్రమం అమలు జరగాలని వారు వాదిస్తున్నారు.

వస్తూత్పత్తి పెరిగి, అందువల్ల ధరలు తగ్గి, అమెరికాలో ఆర్థికమాంద్యం సంభవించకుండా చేయడానికి సాలీనా 20,00,00,00,000 డాలర్లను అమెరికా పారవేయవలసి వుంటుంది గనుక, ఈ డబ్బును ప్రపంచాభ్యున్నతికి వినియోగించడం మంచిదని సూచిస్తూ నూతన మహత్తర ప్రణాళిక చాలా పెద్దదని దానిని ప్రయివేటు సంస్థలు నిర్వహించడం కష్టమని కాగా, దాని నిర్వహణలో పాలు గైకొనడానికైనా వారికి శక్తిచాలదని ఫిలడల్ఫియాలో జరిగిన చర్చలలో ఒక ప్రముఖ లిబరల్ నాయకుడు అన్నాడు.

యూరప్‌కు సాలీనా అమెరికా చేస్తున్న సహాయం 20,00,00,00,000 డాలర్లుగాని, మార్షల్ ప్లానుతో కలుపు

కుంటే అమెరికా ఖర్చు చేస్తున్న 25,10,00,00,00,000 డాలర్లుగాని అమెరికాలో అధికంగావున్న డబ్బును అవతల పారవేసి ఆర్థికమాంద్యాన్ని తప్పించుకొనడానికి జరిపించబడుతున్న కార్యక్రమమని అమెరికన్‌లలో చాలామంది ఆమోదించారు.

ప్రభుత్వం, ప్రయివేటు సంస్థలు కలిసి పెట్టుబడిపెట్టడం మంచిదనేభావం క్రమేపీ బలపడుతున్నది. ప్రపంచబ్యాంకి ద్వారా ఇవ్వబడే అప్పులు ఇట్టివే. ప్రయివేటు పెట్టుబడిపై ప్రభుత్వం అజమాయిషీ చేయడానికి అవకాశం వుంది. ప్రపంచంలోని అనేక దేశాలకు ఈ విధంగా ప్రభుత్వం, ప్రయివేటు సంస్థలు కలిసి పెట్టుబడి పెట్టడం శ్రేయస్కరం కాగలదు.

చతుర్థసూత్ర కార్యక్రమంపై చేయబడిన విమర్శలలో ఇతరవాటికి అసలు సమాధాన మివ్వవలసిన అవసరమే లేదు.

విదేశాలలో అమెరికన్‌లు పెట్టుబడిపెట్టే డబ్బుకు రక్షణకై ఆ దేశాలతో సంధులు, ఒడంబడికలు చేసుకొనవలసి వుంటుందని, ఇట్టి సంధులను తలకిందులు చేయడానికి ఎల్లపుడూ వీలుంటుంది కనుక చతుర్థసూత్ర కార్యక్రమాన్నే విరమించాలని కొన్ని పత్రికలు విమర్శించాయి.

ఈ తెలివితక్కువ వాదాన్ని అమెరికా ఇతర దేశాలతో చేసుకునే ప్రతిసంధిని విమర్శించడానికి ఉపయోగించ వచ్చు. ప్రపంచంలో దేశాలు విడివిడిగా వున్నంతకాలం సంధులు, ఒడంబడికలు తప్పవు.

ఇతర విమర్శలుకూడా ఇట్టివే.

కమ్యూనిస్టు ఉపద్రవాన్ని గూర్చి జరిగిన చర్చలలో సాధారణంగా విస్మరించబడేది ఆ ప్రమాదాన్ని చాలావరకు రెచ్చగొట్టుతున్నది రష్యాయేనన్నదే. తనపై దాడి జరగగలదని సర్వదా రష్యా భయపడుతూ వుండడమే దీనికి కారణం. చతుర్థసూత్ర కార్యక్రమం రష్యాకు, పాశ్చాత్య రాజ్యాలకు మధ్య శాంతి సాధకశక్తిగా వర్థిల్లగలదు. కమ్యూనిస్టు లక్ష్యసాధనకు ప్రజల దారిద్ర్యాన్ని అవకాశంగా గైకొనవచ్చునని భావించవచ్చు. కాని, ప్రపంచంమొత్తం క్రమబద్ధంగా పురోగమించి నప్పుడే రష్యాకుగాని, అమెరికాకు గాని భవితవ్యం ఉజ్జ్వలం కాజాలదు.

ఇండియా పారిశ్రామికాభ్యున్నతికి అమెరికా సహాయం చేయడం మహాశక్తిని సృష్టించడమే కాగలదని, అట్టి సందర్భంలో విదేశాల మార్కెట్లను సంపాదించేందుకై ప్రయత్నించి, అవసరమైతే బలప్రయోగానికి దిగే అవకాశం లేకపోలేదని కొందరు సందేహిస్తున్నారు. ఇట్టి సందేహమే బ్రాజిల్ విషయంలోకూడా సూచిస్తున్నారు. కాని, పూర్తి అనుభవం పొందివున్న అమెరికా మార్గదర్శిగా నిలచి, వెనుకబడివున్న దేశాలలో పారిశ్రామికాభివృద్ధి ప్రమాదాలకు దారితీయకుండా తగు సలహాలివ్వగలదు. ఇప్పుడు వెనుకబడివున్న దేశం స్వయంకృషితో పారిశ్రామికాభివృద్ధికి కృషిచేస్తే, లోగడ మనం చేసిన తప్పులన్నింటినీ చేయడం సంభవించవచ్చు. కార్మికులను అణచివేయడం, ఆర్థిక సామ్రాజ్యతత్వానికి

లోనుగావడం, విదేశాలను జయించడానికి తలపెట్టడం— మున్నగు అనేక తప్పిదాలకు ఒడిగట్టవచ్చు. అయినప్పటికీ ఏదో ఒకవిధంగా ప్రపంచం కొత్త పారిశ్రామికాభివృద్ధికి కృషిచేయడం సంభవం. మీరు ఇది చదువుతూ వుండగానే పారిశ్రామికాభ్యున్నతికై అన్ని దేశాలు సాగిస్తున్న కృషి పెరిగిపోతున్నదికూడా. అందుచేత, మనం ఎంత ప్రయత్నించినా దానిని నిరోధించలేము గనుక, మనం లోగడపొందిన అనుభవంతో మనం చేసిన తప్పిదాలే ఆ దేశాలుకూడా చేయకుండా సలహాలిచ్చి, వాటి అభ్యున్నతికి కృషి చేయగలము.

అమెరికా శక్తి సంపన్నమై ప్రపంచం మొత్తాన్ని శక్తి విహీనంగా నిలపడంద్వారాగాని, మిగతా ప్రపంచాన్ని శక్తి సమన్వితం చేయడంద్వారాగాని ఆత్మరక్షణకు కృషి చేయవచ్చుననే వాదన లున్నాయి.

అమెరికా శక్తి సంపన్నమై మిగతా ప్రపంచాన్ని శక్తి విహీనంగా నిలపాలనే వాదన ముందుగానే తోచవచ్చు గాని, దాని ఫలితంగా మిగతా ప్రపంచంలో నియంతృత్వాలు జనించి, ఆదేశాలు సమైక్యమై త్వరలోనో, తప్పితే కొంత కాలానికో అమెరికాను ప్రతిఘటించడానికి తలపడడం తథ్యం.

కాబట్టి, మిగతా ప్రపంచాన్ని శక్తి సంపన్నం చేయడం ద్వారా అమెరికా ఆత్మరక్షణకు పూనుకోవడమే సమంజసం. శక్తి వృద్ధిపొందితే ప్రమాదమేమీ లేదు. ఆ శక్తిని

వినియోగించుకొనే మార్గాలపైనే అది ప్రమాదకరమో కాదో ఆధారపడి వుంటుంది. అందుచేత ప్రపంచానికి చేకూరే నవశక్తి విశ్వమానవ కళ్యాణానికి వినియోగించేటట్టే మనం కృషి చేయాలి.

ఇతర దేశాలకు మనం కేపిటలిజమ్‌ను ఎగుమతి చేస్తున్నామని అంటే ఆ దోషం మనలో వున్నట్టు ఒప్పుకోవచ్చు. కేపిటలిజమ్ ప్రజానీకానికి లాభప్రదమైనంతకాలం ఇందుకు మనం సిగ్గుపడవలసిందేమీ లేదు.

ప్రపంచంపై విశ్వాసంతోను, ఆత్మ విశ్వాసంతోను అమెరికా ప్రారంభించిన కార్యక్రమమే చతుర్థసూత్ర కార్యక్రమం. ప్రపంచం పారిశ్రామికంగా అభ్యున్నతి పొందడం శాంతికి సాధనం కాగలదన్నదే ఆ విశ్వాసం.

*

# ఇండియా లక్షించిన
# పెద్ద అభివృద్ధి ప్రణాళికలు

దామోదర్ నది :—బెంగాల్‌లోని దామోదర్ నదికి వరదవస్తే అతి ప్రమాదంగా వుంటుంది. ఆస్తి పాస్తులను, కుటుంబాలను ధ్వంసం చేయడమే గాక భూసారాన్ని కూడా తుడిచి పెట్టుకొని పోతుంది. ఒక్కొక్కసారి దామోదర్ నదికి వచ్చిన వరదతో ఈస్ట్ ఇండియా రోడ్డు దాదాపు మూడు మాసాలదాకా ప్రయాణం చేయడానికి వీలులేకుండా పోతుంది. దామోదర్ నదిపైన, దాని ఉపనదులపైన ఎనిమిది డామ్‌లు, ఆనకట్టలు నిర్మించబడితే, అప్పుడవి వరదను కంట్రోల్ చేయగలవు. ఇదిగాక 1,86,000 నుంచి 75,00,000 ఎకరాలదాకా అదనంగా సాగుకువస్తుంది. 10,00,000 కిలోవాట్స్ విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేయడానికి వసరైన ప్లాంట్ నిర్మించబడుతుంది. ఇక్కడ ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తితో దామోదర్ లోయలో లభ్యమయ్యే బొగ్గును పరిశ్రమగా వృద్ధిచేయవచ్చు. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి పదిసంవత్సరాలు పట్టుతుంది. మొత్తం మీద 16,00,00,000 డాలర్లు ఖర్చు అవుతుంది. 50,00,000 ప్రజలకు లాభిస్తుంది.

ఒరిస్సా నదులు:-దారిద్ర్యంతో పీడించబడుతున్న ఒరిస్సా లోయలగుండా ప్రవహించే నదులలో బౌల్డర్ డామ్‌ను మూడు సార్లు నింపడానికి తగినంత నీరు వుంటుంది. మహానదిలో

ప్రవహించి, సముద్రానికి చేరే నీరును నిల్వచేస్తే 10,00,000 ఎకరాలను సాగుచేయడానికి సరిపోగలదు. ఒరిస్సా, మధ్య ప్రదేశ్, తూర్పు రాష్ట్రాలకు చౌకగా విద్యుచ్ఛక్తి లభించగలదు. సముద్రంనుంచి వచ్చే నౌకలు సరాసరి సముద్రానికి 350 మైళ్ళు దూరంలో మధ్యపరగణాలకు కాలువలద్వారా వెళ్ళవచ్చు.

గోదావరినది :—దక్షిణాన గోదావరినది పొడవునా ప్రపంచంలోకెల్ల విస్తృతంగా వుండగల కాలువలను త్రవ్వుతున్నారు. ఈకాలువలు 37,50,000 ఎకరాలకు అందుబాటులో వుండి, దానిలో 20,00,000 ఎకరాలు సాగుకాగలవు. చెన్న రాష్ట్రానికి సాలీనా కొరతపడిన ఆహారపదార్థాలలో సగం వరకు పూర్తిగా ఈ కాలువలకింద సాగుకువచ్చే భూమిలో పండించవచ్చుననీ, ఈ కాలువలలో ఏర్పటగల జలపాతాలతో 75,00,00,000 కిలోవాట్స్ అవర్స్ విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేయవచ్చుననీ ఆర్థిక శాస్త్రవేత్త వి. యస్. స్వామినాథన్ వ్రాశాడు.

7,50,00,000 డాలర్లతో తయారుకాగల గోదావరి ప్రాజెక్టు ఇనుము, ఉక్కు, కాగితం, ఎరువుల ఫ్యాక్టరీలను నడపడానికి సరిపడే విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగలదు. మాంగనీసు, ముడిఇనుము, గ్రాఫైట్, షైల్, లైమ్‌స్టోన్‌లు కలిగివున్న విశాలభూమిలో కొత్త పరిశ్రమలు స్థాపించడానికి అవకాశం ఏర్పడుతుంది.

తుంగభద్రానది :—ఒక సంవత్సరం పంటపండితే మరు సంవత్సరం కాటకానికి గురికావడం దక్షిణ భారత పీఠ భూమికి (రాయలసీమ ప్రాంతానికి) అనువాయితీ. ఇక్కడ 7,50,000 ఎకరాలను సాగుచేయడానికి సరిపోగల 80,00,00,000 గాలన్ల నీటిని నిల్వచేయడానికి ఒక రిజర్వా యర్‌ను భారతీయులు నిర్మిస్తున్నారు. క్రొత్త బంగారు గనులు, పంచదార ఫ్యాక్టరీలు, నూనె మిల్లులు, తుంగభద్ర డామ్‌లో ఉత్పత్తి అయ్యే 50,00,00,000 కిలోవాట్స్ అవర్స విద్యుచ్ఛక్తి నుపయోగించుకోవచ్చు.

తిష్టానది :—బెంగాల్‌లోని చిన్ననదులలో మామూలుగా పారుతున్నపుడు వాటిపై ప్రయాణంచేయడం భలేబాగుంటుం దని భారతీయులు అంటారు. కాని, వాటికి నేడు వరద తగలడం, రేపు ఎండిపోవడం కద్దు. ఇక్కడగల మహానదులు గంగ, తిష్ట బ్రహ్మపుత్రానదులు. నీటి జలాన్ని ఒకచోటుకు చేర్చి, వానిని ఈ చిన్ననదులకు పారించడం ద్వారా సర్వదా వానిలో నీరు వుండేట్టు చేయడానికి కృషి జరుగుతున్నది. హిమాలయ పర్వతాల దిగువభాగంలో నిర్మించబడగల తిష్టాడామ్ 40 మైళ్ళ దూరంవరకు ప్రవహించడానికి తగిన నీరును సరఫరా చేస్తుంది. ఇక్కడినుంచి త్రవ్వబడే కాలువల ద్వారా ఈ నీరు చిన్నచిన్న నదులకు పంపించ బడుతుంది. ఇప్పుడు ఏడాదికి ఒకటి, ఒకటిన్నర పంటలు పండుతున్న ఈ ప్రాంతంలో రెండూ, రెండున్నర పంటలదాకా పండగలవు.

ప్రపంచం మొత్తంలో అతి దుర్భరమైనదిగా పరిగణించబడుతున్న నిరుద్యోగాన్ని నిర్మూలించగలదు. భారతీయ రైతులు ఏడాదిలో దాదాపు సగంరోజులు పనిలేకుండా వుండవలసి వస్తుంది. ఇప్పుడు పంటలు ఎక్కువ కావడంతో వారికి ఏడాది పొడుగునా పని వుంటుంది.

## ఇండియాలో తలపెట్టబడిన పెద్ద ప్రాజెక్టుల వివరణ

| ప్రాజెక్టు | విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాల శక్తి | ఖర్చు |
|---|---|---|
| కోసీ ఆనకట్ట (బీహార్) ... | 10,00,000 కి | 15,00,00,000 డాలర్లు |
| గోదావరి (మద్రాసు) ... | 1,75,000 హైడ్రో<br>1,27,500 థర్మల్ | 7,50,00,000 |
| తుంగభద్ర (డక్కన్) ... | 1,00,000 | 5,00,00,000 |
| జోగ్ (మైసూరు) ... | 1,20,000 | 1,50,00,000 |
| ధీరంగరా (కాశ్మీర్) [పంజాబ్‌తో కలిసి సంయుక్తంగా నిర్మించేది] | 2,50,000 | 4,50,00,000 |
| చామ్‌బాల్ (గ్వాలియర్) ... | 75,000 | 3,00,00,000 |
| దామోదర్ (బెంగాల్) ... | 3,00,000 | 16,00,00,000 |
| కశా (పంజాబ్) ... | 1,00,000 | 4,00,00,000 |
| భాక్రా (పంజాబ్) ... | 2,00,000 | 2,08,50,000 |
| లార్జి (పంజాబ్) ... | 76,000 | 3,20,00,000 |
| | 25,23,500 | 61,78,50,000 |

## సంయుక్త పరగణాలు

| | | | | |
|---|---|---|---|---|
| దొనాయ్ | — | 2,70,000 | — | 12,50,00,000 |
| పిప్రీ | — | 1,20,000 | — | 2,97,50,000 |
| ఖరామి | — | 44,000 | — | 1,19,29,000 |
| రాయపురా | — | 30,000 | — | 1 01,00,000 |
| అబ్రా | — | 43,200 | — | 1,07,60,000 |
| జాన్జ | — | 77,500 | — | 6,61,32,000 |
| కిశాల్ వాన్ | — | 57,500 | — | 2,32,26,000 |
| ధూాక్ వాన్ | — | 26,750 | — | 38,36,000 |
| మూంతాతిల | — | 40,750 | — | 1,27,88,000 |
| పెరిఖా | — | 40,400 | — | 1,95,71,000 |
| సింగాపుర | — | 73,680 | — | 3.20,72,000 |
| ఆర్చా | — | 33,000 | — | 1,15,10,000 |
| కళాగర | — | 75,000 | — | 3,49,43,000 |
| రాజ్ ఘుట్ | — | 40,000 | — | 3,03,49,000 |
| | | 9,71,780 | — | 42,19,41,000 |
| | | 25,23,500 | — | 61,78,50,000 |
| మొత్తం | — | 34,95,280 | కిలోం | 1,03,97,91,000 |